# యదువంశపు భీష్ముడు

శ్లో॥ వ్యాసశాస్త్రోపవనతః సుమనాంసి విచిన్వతా,
కృతా వై ప్రభుదత్తేన మాలా భాగవతీ కథా॥

గ్రంథకర్త :
శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుడు :
శ్రీ రామ్‌శరణ్ కుంముర్తి వేంకట నరసయ్య
సంపాదకుడు, "మోక్షసాధని"

1970 [వెల : 9-50

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :
నటరాజ పబ్లికేషన్స్
ఏలూరు రోడ్ * విజయవాడ-2

# యదువంశము
# భీష్ముడు

శ్లో॥ వ్యాసశాస్త్రోపవనతః సుమనాంసి విచిన్వతా,
కృతా వై ప్రభుదత్తేన మాలా భాగవతీ కథా॥


గ్రంథకర్త:
శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు

అనువాదకుడు:
శ్రీ రామ్‌శరణ్ కుంచుర్తి వేంకట నరసయ్య
సంపాదకుడు, "మోక్షసాధని"


1970 [వెల: 9-50

సోల్ డిస్ట్రిబ్యూటర్సు:

## నటరాజ పబ్లికేషన్సు
ఏలూరు రోడ్డు * విజయవాడ-2

సూతుఁడిట్లనెను:— "మునులారా! కణ్వాశ్రమమందు దుష్యంతమహారాజు ఒకదానికి మించినదొకటి విచిత్ర వస్తువులను గాంచెను." అచ్చటనుండిన మునులందఱును తపో నిరతులై యుండిరి. చాలమంది కర్మిష్ఠులు యజ్ఞములందేమంత్రములను, నెచ్చట, నేకార్యమందు వినియోగింపవలయును, ఫలాని క్రియ నేవిధముగాఁ జేయవలయునను విషయమున వివాదపడుచుండిరి. చాలమంది దార్శనికసిద్ధాంతములనుగూర్చి ఊహాపోహాలొనర్చుచుండిరి. చాలమంది యమనియమ పరాయణులై, మౌన వ్రతమును ధరించి, ఆసనమును వేసికొని మంత్రజప మొనర్చుచుండిరి. చిత్ర విచిత్రములగు నాసనములు

మీఁదఁ గూర్చుండి ఋషులందఱును మూర్తీభవించిన తపము గను, సజీవజ్ఞానమువలెను, సాక్షాత్కరించిన సంయమమువలెను దోఁచుచుండిరి. రాజు లోలోన నందఱకును బ్రణామమును గావించెను. రాజు సాధారణ వేషమున నుండెను. చాలమంది కులపతియగు కణ్వభగవానుని దర్శించుటకు వచ్చుచుండిరి. అందువలన నెవరును నాతనివైపు విశేషధ్యానమేమియునుంచ లేదు. కొందఱు బ్రహ్మచారులు చేతిలోఁ బాలాశదండమును ధరించి, గొడ్డలినిఁ ద్రాటినిఁ జేతఁ బట్టుకొని సమిధలను గొని వచ్చుటకు వనమునకుఁ బోవుచుండిరి. అందువలన వారినిఁగాంచి రాజు ఆదరప్రేమలతో నిట్లనెను:- "బ్రహ్మచారులారా! కణ్వమహర్షి కుటీరమేదో మీరు చెప్పగలరా?"

వారిలోఁ బెద్ద కన్నులుగల సుందరవటువిట్లనెను :— "అచ్చట నెదురుగ నున్న నా నాలుగు దట్టమైన మామిడి చెట్లచాటున రెండు పొడుగుపాటి కుటీరములు కలవే ఆ కుటీరములందు కులపతులవారుందురు. పదండి, నేను మిమ్ములను బంపి వచ్చెదను." అని పలికి బ్రహ్మచారి రాజును వెంటఁ బోయెను.

ఆ కుటీరమున నలువైపులను నొకప్రహరిగోడ మట్టితోఁ బెట్టఁబడియుండెను. దానిలోని కెవరును జూడఁజాలరు. దానికి వెదురుకఱ్ఱలతో నొకద్వారముండెను. దానికి రెండువైపులను రెండువృక్షములమీఁద మాలతీలతలుప్రాకి పుష్పించియుండెను

ద్వారమునుజూపి బ్రహ్మచారి యిట్లనెను:- "మీరు దీనిలోప లికి పోవచ్చును. నాసహచరులుచాలదూరము పోయియుందురు కావున నేనిప్పుడు మీ యనుజ్ఞను దీసికొనుచున్నాను." ఇట్లు పలికి ఆతఁడు పరుగెత్తుకొని వెడలిపోయెను.

ద్వారమునకుఁ జేరి రాజు మంత్రిపురోహితుల నచ్చటనే ఆపి, ఆతఁడొంటరిగ నాశ్రమములోనికిఁ బోయెను. ఆశ్రమ మందు వస్తువులన్నియును నస్తవ్యస్తముగఁ బడియుండుట నాతఁడుఁ గాంచెను. వృక్షములన్నిటికి బోదెలు చేయబడి యుండెను. అన్ని బోదెలకు నీరు పెట్టఁబడెను. నలువైపులను లతామండపములు నిర్మింపఁబడినవి. ఆశ్రమమందు మంచి పుష్కరిణికూడ ఒకటి యుండెను. దానిలో వివిధములగు కమ లములు వికసించి యుండెను. యజ్ఞశాల బాగుగా మెత్తబడి అలుకఁబడి స్వచ్ఛముగనుండెను. రెండు కుటీరములు మిక్కిలి చక్కగ నలంకరింపఁబడి యుండెను. రాజునకు దాను వైకుం ఠములోనికి వచ్చినట్లుండెను. ఆతనికచ్చట కులపతియగు కణ్వ మహర్షి కనఁబడలేదు. ఆతడు కొంచెముసేపు నిలుచుండి "ఇచ్చట నెవరైనఁ గలరా? నేను కణ్వమహాముని దర్శనము నిమిత్తమై వచ్చియున్నాను" అనెను.

వెంటనే సమీపముననున్న బొదరింటినుండి వల్కల వస్త్రములను ధరించి, తలను దువ్వుకొనుచు, సిగ్గుతో నొక్క మిక్కిలి సుందరియగు యువతి వచ్చుచుండుటను గాంచెను.

రాజును గాంచి ఆమె ఆతని సమీపమునకువచ్చి, తలను వంచుకొని నిలుచుండెను. ఈమున్యాశ్రమమునందు సాక్షాల్లక్ష్మివలెను మూర్తీభవించిన తపస్సువలెను మన్మథపత్నియగు రతీదేవివలె నా యనుపమరూప లావణ్యాయుక్తయగు లలనా లలామమును గాంచగానే రాజుయొక్క మనస్సు చంచలమయ్యెను. ఆతఁడిట్లనుకొనెను:- "ఈమె రమాదేవియా? లేక సరస్వతియా? ఈమె రతీదేవియై యుండదు. ఆర్యాశ్రమమునకిచ్చట నేమి పని? ఈమె యీ వనమందలి అధిష్ఠాన దేవత కాదుగదా! లేక స్వయముగ సౌందర్యముయొక్క సాకార స్వరూపమే నాకు స్వాగతము నిచ్చుటకిచ్చటకు వచ్చినదా యేమి? లేక ముని లేనప్పుడాతని తపస్సే మూర్తీభవించి నాకాతిథ్య మొసంగుటకు వచ్చుచున్నదా యేమి? ఈమె దేవకన్యక కాదుగదా! తపస్వుల కన్యకలకిట్టి కోమలత యుండదు". రాజిట్లనుకొనుచుండఁగనే ఆ సుందరి వీణావినందిత స్వరమున నిట్లనెను:- "నృపతీ! మీకు స్వాగతము. మా తండ్రిగారిప్పుడే ఒక మునితో వనమునకుఁ బోయియున్నాఁడు. బహుశః ఆతఁడు రేపు తప్పక రావచ్చును మీరు వేంచేయుఁడు. ఇదిగో మీకు పాద్యము. దీనితో మీరాచమింపుఁడు. ఇదిగో నేను నా తండ్రికి బదులుగా మీకర్ఘ్య మొసంగుచున్నాను. ఈ యాసనముపై మీరు సుశోభితులు కండు".

రాజు మధ్యలో నేమియును మాటలాడకయే ఆ దేవమాయాసదృశయగు లలనా లలామముయొక్క లలితవచనము

లను వినుచుఁ బాదములను గడుగుకొని, ఆచమనముకావించి, శ్రోత్రియరీతిని నర్ఘ్యమునుస్వీకరించి ఆదేవి యొసంగిన నాసనముపైఁ గూర్చుండెను.

రాజు కూర్చుండినమీఁదట శకుంతల యిట్లడిగెను :- "నేను మీ పరిచయమును బొందవచ్చునా?"

రాజిట్లనెను:- "దేవి! నేనీదేశమునకు రాజును. నన్ను దుష్యంతుఁడందురు. నేను వేటకై వనమునకు వచ్చితిని. ఆశ్రమమును జూడఁగానే కణ్వభగవానుని దర్శనముచేయుఁతల యునిపించినది. నేను వేటాడి యాఁడి అలసిపోయితిని. దప్పికచే వ్యాకులతను జెందియున్నాను; కాని మునియొక్క మనోహరమగు నాశ్రమమును దర్శింపఁగనే నాకాకలిదప్పులు పోయినవి ఇచ్చట నీ మధురవచనములచేతను, ప్రేమభరితమగు నీ యాతిథ్యమువలనను నేను కృతార్థుఁడనైతిని. కణ్వభగవానుని దర్శనము కాకపోవుటచే నాకవశ్యము నిరాశ కలిగినది, కాని నీ స్నేహపూర్ణమగు వ్యవహారముచే నా యాత్ర సఫలమైనది. ఇప్పుడు నా సంగతినిఁ జెప్పితిని. ఇప్పుడు నీ సంగతినిఁ దెలిసికొనవచ్చునా?"

సిగ్గుపడుచు నా సుందరి యిట్లనెను. "రాజా! నేను కణ్వభగవానుని పుత్రికనని చెప్పినఁ జాలును. ఆతఁడు లేనప్పుడు నాకతిథిసేవాభారము పడుచుండును. నేను మీకే ప్రియకార్యమొనర్పవలయునో నాకాజ్ఞాపింపుడు".

రాజిట్లనెను:- "కణ్వభగవానుఁడు బాలబ్రహ్మచారి కదా! అతనికి పుత్రిక యుండుట యెట్లుపొసగఁగలదు? ధర్మము తన హద్దులనైనను దాటునుగాని కణ్వుఁడుమాత్రము తన ధర్మమును దప్పఁడు. నీవాతనికి పుత్రికవెట్లైతివి? నాకు నీ యదార్థమగు పరిచయము నొసంగుము."

ఇది వినఁగా శకుంతల లజ్జితయయ్యెను. ఆమె యిట్లనెను:- "రాజా! నేను కణ్వభగవానునకు పెంపుడుకూఁతురను నేనెట్లుపుట్టితినో అది నా తండ్రికిఁ దెలియఁగలదు." రాజుతో శకుంతల యిట్లు చెప్పుచుండఁగనే ఆ సమయమునకామె పరిచారికి యగు సఖి అటకు వచ్చెను. రాజామెను గాంచి యుతికి పడెను. రాజిట్లనెను:- "దేవి! నీవు నీ సఖియొక్క యుత్పత్తి కథను నాకు జెప్పఁగలిగినఁ జెప్పుము. ఈమె సంగతిని దెలిసికొనవలయునని నాకు చాల ఉత్కంఠతగా నున్నది."

సఖి యిట్లనెను:- "రాజా! ఒకదినమున నొక మహర్షి అడుగఁగాఁ గణ్వమహర్షి వారికెట్లు నా సఖియొక్క యుత్పత్తి నిగూర్చి చెప్పెనో దానిని మీకు వినిపించెదను. మీరు దత్త చిత్తులరై యీ మనోరంజకమగు నాఖ్యానమును శ్రవణ మొనర్పుఁడు."

సూతుఁడిట్లనెను:- "మునులారా! సఖియొక్క వాక్యములను విని మహారాజు పరమోత్సాహమును జెందెను. అతఁడత్యంతోత్కంఠమున నుండుటనుగాంచి సఖి శకుంతలయొక్క యుత్పత్తి కథను జెప్పుటకుద్యుక్త యయ్యెను.

# శకుంతలా జన్మకథ.

~~~

శ్లో॥ విశ్వామిత్రాత్మజైవాహం త్యక్తా మేనకయా వనే।
వేదైతద్భగవాన్ కణ్వో వీర కిం కరవామ తే॥
ఆస్యతాం హ్యరవిందాక్ష గృహ్యతా మర్హణంచ నః।
భుజ్యతాం సంతి నీవారా ఉష్యతాం యది రోచతే॥

శ్రీ భాగవతము 9 స్కం. 20 అ. 23, 24 శ్లో.

మ॥ అనివార్య ప్రభ మున్ను మేనకయు విశ్వామిత్ర భూభర్త యుం
గనిరా మేనక డించి పోయె నడవిం గణ్వుండు నన్నింత గా
వవిచెన్ సర్వము నా మునీంద్రుఁడెఱుఁగున్ మద్భాగధేయంబునన్
వినుఁ గంటిం బిదపం గృతార్థనగుదున్ నేఁడీ వనాంతంబునన్॥

కం నీవారము ప్రజలేమును
నీవారము పూజగొనుము నిలువుము నీవున్
నీవారును మా యింటను
నీవారాన్నంబు గొనుఁడు నేఁడు నరేంద్రా॥

శ్రీమదాంధ్రభాగవతము

కమలము పంకమునుండి పుట్టును. అయినను నది దేవతల శిరస్సున కెక్కును. నీలము బొగ్గుగనినుండి వెలువడును అయినను అది బహుమూల్యమైనదిగ నెన్నఁబడుచున్నది. గంగా జలము పవిత్రమైనదగుచున్నది. గోవేజాతిలోనిదైనప్పటికిని దాని పాలు పవిత్రములుగ నెన్నఁబడుచున్నవి. ఇదేవిధముగఁ
~~~

గన్యారత్నమును దుష్కులమందుదయించినను గన్యారత్నము నిర్దోషగ నీతిశాస్త్రము చెప్పుచున్నది. సత్కుల ప్రసూతయై మునిపాలితమైన గన్యారత్నము క్షత్రియులకు లభించినచో నామెను వారు సహర్షముగ స్వీకరించెదరు గాని ఆమె తమ కంటె నుచ్చకులములోనిది కాదుగదాయని చూచుకొనుచుండెడివారు. ఇట్లు చేయుటచే నత్యంత గర్హ్యమగు విలోమ సాంకర్యము సంభవించును. తనకు సమాన వర్ణము కలదియు, తనకంటె నిమ్న వర్ణము కలదియగు గన్యక వర్ణాశ్రమ ద్విజులకు ప్రశస్తమైనదని చెప్పఁబడినది. కావున వివాహమునకుఁ బూర్వము కన్యకయొక్క కుల, గోత్రముల నెఱుఁగుట ఆవశ్యకము.

సూతుఁడిట్లనెను.- "మునులారా! దుష్యంతమహారాజు శకుంతల సఖివలన మిక్కిలి యుత్కంఠతతో శకుంతలయొక్క జన్మకథను వినఁగోరఁగా నామె యిట్లు చెప్పఁదొడఁగెను:- "రాజా! వినుఁడు. నేను నూకు మా సఖియొక్క జన్మవృత్తాంతమును జెప్పెదను."

పూర్వకాలమున బ్రాహ్మణుఁడగుటకై రాజర్షియగు విశ్వామిత్రుఁడు గొప్ప ఘోరతపంబానరించెను. ఆతని తపస్సును గాంచి దేవేంద్రుఁడు మిక్కిలి భయభీతుఁడయ్యెను. ముని తపస్సును జేసి తన ఇంద్రాసనమేమైన లాగుకొనునేమో యనుకొనెను. ఇట్లనుకొని ఆతఁడా ముని తపస్సునకు విఘ్నము నాపాదించుకొనుటకునిశ్చయించుకొనెను ఆతఁడు స్వర్గమందలి

సర్వశ్రేష్ఠ సుందరియగు మేనకను బిలిచి యిట్లనెను:- "సుందరీ! నీవు నాకొక ప్రియకార్యమొనర్పవలెను. ఏవిధముగనైన నీవు విశ్వామిత్రుని తపస్సునకు భంగముకలిగింపవలయును"

మేనక యిట్లనెను :- "దేవా! నావలన నీ పని కాఁజాలదు."

దేవేంద్రుఁడిట్లడిగెను :- "ఏల గాదు?"

మేనక యిట్లనెను :- "కారణమేమనఁగా నా ముని అతి క్రోధి."

దేవేంద్రుఁడిట్లనెను :- "కామమువలనఁ గ్రోధము శాంతించును. సుందరతయొక్క ఆకర్షణముముందు క్రోధము నశించిపోవును."

మేనక యిట్లనెను :- "నా సౌందర్యమందు నాకంత నమ్మకము లేదు."

దేవేంద్రుడిట్లనెను:- "నీవు వెళ్ళుచు నీవెంట వసంత, రతి, మలయానిల, కామాదుల నందఱను దీసికొని పొండు."

మేనక యిప్పుడేమి చేయగలదు? యజమాని యాజ్ఞ నెట్లు కాదనఁగలదు? ఆమె మునికడకుఁబోయి, తన హావ భావములచేతను, కటాక్ష సంగీతములచేతను ముని మనమును మోహింపఁజేసెను. ముని మనస్సు చంచలమయ్యెను. ఆతఁడామెను దన యాశ్రమముననుండుమని యాహ్వానించెను. మేనక వచ్చినదీపనికొఱకే. ముని పిలువఁగానే ఆమె పోయి, ఆతని

కోర్కెలను నెఱవేర్చుచు సుఖముగ మునితో నానంద విహార మును గావించుచుండెను. ఆ ముని యీ వారవనితా సంగమ మున జప, తప, యోగ, ధ్యానాదులనన్నిటిని మఱచిపోయెను. ఇప్పుడాతఁడు రాత్రింబవళ్ళు లలన నలరించుటయందే లగ్న మైయుండెను. ఆతఁడామె వయో, రూప, సౌందర్యములందా సక్తుఁడై సమయగతినిగూడ మఱచిపోయెను. ఎప్పుడు పొద్దు క్రుంకినదియు నెప్పుడు తెల్లవారినదియు నాతఁడుమఱచిపోయెను

ఒక దినమున మునికి తెలివి వచ్చెను. అయ్యో! నేను తపస్సును త్యజించి విషయములలోఁబడిపోయితినే. అవశ్యమిది దేవతల మాయయే. ఆతఁడు కన్నులెఱ్ఱఁజేసికొని యిట్లనెను:- "మేనకా! నీవు నా తపంబునకు విఘ్నమొనర్చ వచ్చినావా?."

ఇది విని మేనక భయముచే గడగడ వణఁకసాగెను" ఆమెకుండిన భయమిపుడామెకుఁ బ్రత్యక్షముగ సమ్ముఖమున నుండెను. ఆమె అత్యంతభయభీతయై భూమికి శిరమును మోపి గద్గద వాక్కులతో నిట్లనెను:- "మునివరా! ఇందు నా దోష మేమియును లేదు. నన్ను దేవేంద్రుఁడు పంపినాఁడు. మీరు నా యపరాధమును క్షమింపవలయును. నాకభయదానమొసం గుడు."

సురసుందరి యీవిధముగ భయముచే గడగడ వణఁకు టను గాంచగనే మునికి దయ కలిగెను. అతఁడిట్లనెను :- "సుందరీ! ఇందు నీ దోషమునులేదు మన్మథుని దోషమును

లేదు. ఇదంతయు నా దోషమే. నేనింద్రియములను జయించి యుండినచో, నేనీప్రకారము తపస్సునువీడి కామములో నేలఁ బడెదను. నా మనస్సులోనే దోషముకలదు. నీవు మేలగుగాక! ఇప్పుడు నీవు సుఖముగ స్వర్గమునకుఁ బోవచ్చును, మానవుఁడు విషయలోలుపుఁడు కానిచో స్త్రీ వానినేమియును జేయఁ జాలదు. నీవు నీకిష్టమువచ్చినచోటునకుఁ బోవచ్చును. ఇప్పుడు నేనింకను ఘోర తపస్సును జేయుదును" ఇది వినఁగానే మేనకకుఁ బ్రాణములలోనికిఁ బ్రాణము వచ్చెను. ఆమె ముని చరణములకుఁ బ్రణామము గావించి వెంటనే అచ్చటనుండి వెడలిపోయెను. ఆమె గర్భవతియై యుండెను. విశ్వామిత్రుని యొక్క తేజోవీర్యమామె యుదరమున నుండెను. గర్భమునకు రోజులు నిండెను. అందువలన మేనక మున్యాశ్రమమునకు దూరముగ మాలినీ నదీతటమున సింహ వ్యాఘ్ర సేవితమగు నిర్జనవనమునందొక కన్యకను గనెను. హిమాలయ సానుప్రదేశమున శీఘ్రగామినియగు నా సరిత్తటమునందా సద్యోజాత కన్యక నట్లే అనాథగ విడిచి ఆ స్వచ్ఛందచారిణియగు కామిని యా సురసుందరి స్వర్గమునకుఁ బోయెను. పృథివిపై నామె మానవరూపమును ధరించెను. అందువలన నామెకు గర్భము నిలిచెను. కాకున్న స్వర్గస్త్రీలకు స్వర్గమందు సంతానము కలుగదు.

కణ్వాశ్రమమీ మాలినీ తటముననే కలదు. కులపతి యగు కణ్వమహర్షి స్నానమొనర్చుటకై నదీ తటమునకుఁ

బాల్యకాలమునఁ బోవుచుండెడివాఁడు. అతఁడు నిర్జనవన మందొక మిక్కిలి చక్కని సుందరి విద్యుత్పుంజమువలె సద్యోజాత శిశువచ్చట పడియుండుటను గాంచెను. అమెకు నలువైపులను శకుంతపక్షులు చుట్టుకొని యుండెను. కొన్ని తమ రెక్కలచే నామెపై ఛాయను బట్టుచుండెను. కొన్ని గాలి విసరుచుండెను. ఆ కన్యకను జూడఁగనే మునికి మిక్కిలి దయ కలిగెను. కరుణావశమున నాతఁడా పిల్ల నెత్తుకొని హృదయమునకు హత్తుకొని ఆశ్రమమునకు దీసుకొనిపోయెను.

ఒక వృద్ధతాపసినిఁ జూపుచు సఖి యిట్లనెను:– ఆతఁడీ వృద్ధ తాపసికి ఆ కన్యకను దెచ్చి యిచ్చెను. ఈతఁడు తన పుత్రికవలె నామెను బోషించెను. శకుంతపక్షులు చుట్టుకొని యుండుటచే నీమెకు శకుంతలయను పేరును బెట్టిరి. ముని తన పుత్రికవలె నీమె గారాబముతోఁ బెంచెను. అందువలన నీమె ఆతనిఁ దన తండ్రి యని చెప్పుకొనుచుండును. ఆతఁడును నీమెను ప్రాణములకంటె నధికముగఁ బ్రేమించుచుండును. ఇప్పుడీమె పెద్దదైనది. అందువలన ముని యిప్పుడీమె వివాహమునుగూర్చి ఆలోచించుచున్నాఁడు. ఈమెకొఱకు యోగ్యుఁడగు వరుని వెదకుచున్నాఁడు.

ఇది వినగానే శకుంతల కన్నులెఱ్ఱనై కోపముతోఁ దన సఖిపైపునకుఁ జూచి చేతితో నామె చేతిని వత్తి అట్లనుటను నిషేధించెను. సఖి నవ్వెను శకుంతల లజ్జిత యయ్యెను. ఆమె

తన సిగ్గును మాపుకొనుటకై యిట్లనెను :- "నరదేవా! నాకు కణ్వభగవానుఁడు పెంపుడుతండ్రి. నేను మేనకాదేవి యుదరమున రాజర్షి యగు విశ్వామిత్రుని పుత్రికనఁ యు నా తల్లి నన్నువనమునవిడిచి వెళ్ళినదనియు కణ్వమహర్షియే నన్నుఁబోషించుచుండెననియు నేనాతని నోట వింటిని. నేను నాకు జన్మదాతయగు తండ్రినిఁ జూడనేలేదు. నేనీతనినే నా సర్వస్వముగ భావించుచున్నాను. మంచిది ఇవన్నియు నిట్లుజరిగినవి ఇప్పుడు మీరు నా ప్రార్థనమును వినుఁడు. స్వతః జలములందుత్పన్నమైన నీవారధాన్యమే మునులకు భక్ష్యాన్నము. ఆనివరిధాన్యముతోడనే మునిగణములకును, దేవతలకును, అతిథులకును, పితరులకును తృప్తినిఁ గలిగించుచున్నారు. ఆ బియ్యము సిద్ధముగ నున్నవి. మీరు రాజులు. ఏఁబదియారు పిండివంటలతో నిత్యమును భోజనమొనర్చుచుందురు. మీకివి రుచింపవు కాని మామీఁదఁగల ప్రీతితో మీరు దానినిఁ దినుఁడు. మా యాతిథ్యమును స్వీకరించి మమ్ములను గృతార్థుల నొనర్పుఁడు."

రాజిట్లనెను :- "దేవీ! మీ దర్శనముచేతనే నాకన్నియును లభించినవి. మధువువలె మధురవచనములచేతనే నాకు పరమ తృప్తి కలిగినవి. నీ రూపాసవమును బానమొనర్చియే నేను దృప్తిఁ జెందితిని. మీరు నాకు చేసిన సత్కారమువలన నన్నిటినిఁ బడసితిని."

అత్యంతోత్సాహముతోడను అనురాగ స్వరమునను దన ప్రేమ భరిత దృష్టిని రాజు దృష్టిలోఁ గుప్పించుచు శకుంతల యిట్లనెను:- "కమలనయనా! మీరు నాకు పూజనీయులును, మాననీయులునగు నతిథులరు. తండ్రి లేనప్పుడు మీకు సేవ చేయు భారమంతయు నామీఁదఁ గలదు. మీరు సంకోచింపకుఁడు. మీకే ప్రియ కార్యము నొనర్పవలయునో ఏవిధముగ మిమ్ముల నానందపరుపవలయునో స్పష్టముగ నాజ్ఞాపింపుఁడు. మీరొకరాత్రి యిచ్చట నివసించి ప్రాతఃకాలమునఁ దండ్రిగారు రాఁగానే దర్శనమొనర్చి మీరు వెడలవలెనని నా కోరిక, మీరు రాజులు. మిమ్ముల నధికముగ బలవంతపెట్టఁజాలను కాని మీకిష్టముండి యేమైన విశేష హాని లేకున్నచో మీరొకరాత్రి యిచ్చట నవశ్యము నివసింపవలయును."

రాజిట్లనెను:- "లేదు, సంకోచమేమియును లేదు. ఇంతవఱకును నామమాత్రమగు సంకోచము గలదు. ఇంతవఱకు నేను నిన్ను బ్రాహ్మణ తపస్వి కన్యకవనుకొంటిని. విషయము తెలిసినమీఁదట నీవొక రాజర్షి కన్యకవని తెలిసినది. ఇప్పుడిఁక సంకోచ మేమియును లేదు. నేను నామంత్రి పురోహితులను బిలిచి వారియభిప్రాయమడిగి వీలున్నచో నొకరాత్రి యిచ్చట నుండి నీ యాతిథ్యము నవశ్యము స్వీకరించెదను. అట్లు చేసిన నాకానందము కలుగును." అని పలికి రాజాశ్రమ ద్వారము కడకు వచ్చెను. అచ్చట నాతని మంత్రి పురోహితులు

కూర్చుండియుండిరి. రాజిట్లనెను:- "కణ్వభగవానుడిచ్చట లేడు. నేఁటి రాత్రి నేనిచ్చట నుండఁదలఁచినాను. మీరు శిబిరమునకుఁబోవచ్చును. ఋష్యాశ్రమమునకు జాలదూరమున నుండవలయునని సేనానాయకునితోఁ జెప్పవలయును. ఋషులకు మనమూలమున నేవిధమునను గష్టమును గలిగింపరాదు".

మంత్రి యిట్లనెను:- "ఇచ్చటకు మహాజుకడకంగరక్షకులను, సైనికులను బంపెదను".

రాజిట్లనెను:- "వలదు. ఇచ్చటికెవరినిఁ బంపనవసరము లేదు. ఋష్యాశ్రమముల కంగరక్షకులేల? ఇచ్చట ఋషుల తపస్సే అందఱను రక్షింపగలదు. నేనొంటరిగ నిచ్చట నుండెదను. ఎవరికినిఁ జెప్పవలసిన పని లేదు".

మంత్రి యిట్లనెను :- "దేవరవారి యాజ్ఞ" అని పలికి ఆతఁడు రాజు నభినందించి పురోహితునితో శిబిరమునకుఁ బోయెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! రాజుమనస్సుశకుంతల సౌందర్యఁముమీఁద నాసక్తినిఁజెందియుండెను. ఆమె క్షత్రియ కన్యకయనుసంగతినిఁ దెలిసికొని ఆతఁడు పరమసంతోషమును జెందెను. అతని రోమరోమములనుండి అనురాగము వెడలుచుండెను. ఇచ్చట శకుంతలయును నేఁటివఱకిట్టి సుందరు నెవరినిఁ జూడలేదు. ఇప్పటివఱకామె మృగశాబకములతో నాడుకొనుచుండెను. ఆమె దృష్టియందు బాలకులవలె నమాయక

త్వముండెను. కాని నేఁడామె విశాల నేత్రములందనురాగ తంతులు స్పష్టముగ గోచరించుచుండెను. నేఁడామె ముఖముపై లజ్జా, సంకోచానురాగోత్సాహములన్నియును క్షణ క్షణమున వచ్చిపోవుచుండెను. రాజామె సమీపమునకు వచ్చి కూర్చుండెను. ఇప్పుడు రాజు స్వప్రయోజనమునకు సంబంధించిన విషయముల నారంభించెను. ఆశ్రమమందు శకుంతలయు, నామె సఖియును, వృద్ధతాపసియుఁదప్ప యింకెవరును లేరు.

## దుష్యంత శకుంతలల గాంధర్వ వివాహము.

౭౦

శ్లో॥ ఉపపన్నమిదం సుభ్రు జాతాయాః కుశికాన్వయే।
స్వయం హి వృణుతే రాజ్ఞాం కన్యకాః సదృశం వరమ్।
ఓమిత్యుక్తే యథాధర్మముపయేమే శకుంతలామ్।
గంధర్వవిధినా రాజా దేశకాలవిధానవిత్॥

శ్రీ భాగవతము 9 స్కం. 20 అ. 15, 16 శ్లో.

కం॥ బంధుర యశుఁడు జగన్నుత
సంధుఁడు దుష్యంతుఁ డుచిత సమయజ్ఞుఁడై।
గంధగజగమన నప్పుడు
గాంధర్వవిధిన్ వరించె గహనాంతమునన్॥

శ్రీమదాంధ్రభాగవతము

వివాహమొక ధార్మిక సంబంధము. దానివలన ధర్మప్రాప్తియును గలుగును, కామసుఖమును గలుగును. ధర్మ

హీనమగు కామము నరకమునకు గొనిపోవును. ధర్మ సమ్మత మగు కామము సుఖకరమైనది. దానివలన స్వర్గాపవర్గములు ప్రాప్తించును. ధర్మావిరోధమగు నర్థకామములే పరలోకమందు సుఖమును గలిగించును. ధర్మరహితమగు నర్థ కామములీ లోకమందు క్షణిక సుఖముల నొసంగినను బరిణామమున దుఃఖమే కలుగును. కామభోగమందు ప్రాణులకు ప్రవృత్తి స్వాభావికము. దీని నెవరును నాపఁజాలరు. ఒకవేళ ఆపినను వారత్యుదుగ్రు లుందురు. అందువలన స్మృతికారులు ధార్మిక బంధనము మనుష్యులకొఱకే చెప్పబడినది. పశుపక్షులు ప్రకృతి ననుసరించి వ్యవహరించుచుండును. కామప్రవృత్తి అనివార్యము, స్వాభావికము. దీని నాలోచించియే ఋషులు వివాహములు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, అసుర, గాంధర్వ, రాక్షస, పైశాచములను నెనిమది భేదములుగఁ జెప్పఁబడినవి. వీనిలోఁ గొన్ని ఉత్తమములు. కొన్ని మధ్యమ ములు, కొన్ని అధమములు. కన్యకను వస్త్రాభరణాదులతో నలంకరించి యోగ్యుఁడగు వరునింటికిఁబిలిచి విధిపూర్వకముగఁ గన్యక నొసంగినచో నది బ్రాహ్మవివాహము. ఇది సర్వశ్రేష్ఠ మైనది. ఈరోజులలో నిదియే జరుగుచున్నది. యజ్ఞ సమయ మునఁ దన కన్యక నలంకరించి దక్షిణకై యాకన్యకను ఋత్విజున కొసంగినచో దానిని దైవ వివాహమందురు. ఇప్పుడు యజ్ఞములు జరుగుటలేదు. కావున నిట్టివివాహములు జరుగుట లేదు. వరునివలన నొకటిరెండు గోవులను గైకొని వివాహము

చేసినచో దాని నార్ష వివాహమందురు. "మనమిద్దరమును గలిసియుండి ధర్మాచరణ మొనర్చెద" నని ప్రతిజ్ఞ నొనర్చి నే వివాహము జేయఁబడునో అది ప్రాజాపత్య వివాహము. నేఁడిది జరుగుచునేయున్నది. కన్యకకును, కన్యక జాతివారికివి ధనము నొసంగి చేసికొను వివాహ మాసుర వివాహము. ఈ వివాహమిప్పుడు నిర్ధనులలో నెక్కుడుగ జరుగుచున్నది, ఇది అత్యంత నీచవివాహముగ నెన్నఁబడుచున్నది. కన్యావరులిద్ద రును సమ్మతింపఁగా స్వేచ్ఛగాఁ జేసికొను వివాహము గాంధర్వ వివాహము. దీని మూలమునఁ గామము కలదు. విద్వాంసులు దీనినిఁ బ్రశంసింప లేదు. చదువుకొనుచున్న యువతీ యువకు లలో నేఁడిది మిక్కిలి వ్యాపించియున్నది. ఇంటిలోనివారినిఁ గొట్టి, పోట్లాడి, గాయపఱచి యేడ్చుచున్న కన్యకను బలవంతముగఁ బట్టుకొనిపోయినచో దానిని రాక్షస వివాహ మందురు. దీనికి కన్యకయొక్క యిష్టానిష్టములక్కఱ లేదు. నేఁడిట్టి వివాహము రాజకీయ నియమ విరుద్ధమైనదగుటచేఁ బ్రత్యక్షముగ జరుగుట లేదు. ఇది అత్యంత హేయమగు వివా హము. సుప్త ప్రమత్తావస్థలో నేకాంతమునఁ గన్యకా గమన మొనర్చినచో నది అత్యంత నీచమగు పైశాచిగ వివాహము. వీనిలో బ్రాహ్మణులకుఁ జివర చెప్పఁబడిన రాక్షస, పైశాచ వివాహములు నిషిద్ధములు. మిగిలిన నాలుగును నుత్తరోత్తర ముగ శ్రేష్ఠములు; అనఁగా గాంధర్వమన్నిటికంటె నధమమైనది. క్షత్రియులకు గాంధర్వవివాహము నింద్యనీయమైనది కాదు.

వారిలో స్వయంవరము జరుగును. కన్యా వరుల కిద్దరకు నిష్ట మైననే యీ వివాహము జరుగఁగలదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! దుష్యంతుని మంత్రి పురోహితులు వెడలిపోఁగానే అతఁడు శకుంతలతో నొంటరిగా నుండెను. అప్పుడాతఁడు మిక్కిలి ప్రేమతో నామెతో నిట్లనెను:- "సుందరీ! నీవు రాజకుమారివి, వనములలో నుండఁ దగినదానవు కావు. నీవు రాజభవనములను సుశోభిత మొనర్ప వలసినదానవు."

శకుంతల లజ్జించుచు నిట్లనెను :- "మహారాజా! నేను వనములోనే పుట్టితిని. వనమందే పెంపబడితిని. వనజంతువుల తోడనే నా జీవితము గడచినది. రాజభవనములందు రాజులు రాణులుందురు మాబోటితపస్వుల నొసట వనమునే వ్రాసినారు"

రాజిట్లనెను:- "రాణి యెచ్చటను నగ్నిజ్యోతిలోనుండి బయలుదేరి రాలేదు. క్షత్రియ కన్యలను రాజునకిచ్చి పెండ్లి చేసినచో వారు రాణులయ్యెదరు. నేనీ సమస్త భూమండలము నకు రాజును. నీవు నన్ను వివాహము చేసికొనుము. నీవును రాణివయ్యెదవు. దాస దాసీ జనములు నిన్ను సువర్ణ, మణి, ముక్తాభరణములచే నలంకరించెదరు. నీకు నిత్యనూతనములగుఁ బట్టుదుకూలములను గట్టెదరు. నీ శరీరమందు దివ్యమగు నంగ రాగము నలఁదెదరు. వివిధములగు నలుగులను బెట్టి నీకు స్నానమును జేయించెదరు. సదా నీయాజ్ఞకై వేచియుండెదరు.

అందఱును నీసమ్ముఖమునఁ జేతులను జోడించుకొని నిలుచుం డెదరు. నా సర్వస్వమును నీదే కాఁగలదు. నేనును నీ కధీనుఁ డనై యుండెదను."

ఇది విని శకుంతల లజ్జిత యయ్యెను. ఆమె ముఖమెఱ్ఱ నయ్యెను. ఆనందకారణమున హృదయముప్పొంగెను. దీర్ఘ నిశ్శ్వాసములను విడుచుచుండెను. కన్నులందను రాగము వ్యాపించెను. ఆమె కొంచె మాఁగి యాఁగి యిట్లనెను:- "నర దేవా! నేను వివాహమాడుటకు స్వతంత్రను గానినియు, భ్రాతా ధీననినియు మీకు దెలిసినదే. నా తండ్రి యెవరికిచ్చి వివాహ మొనర్చునో నేను వారితోఁ బోయెదను. ఏమి చెప్పుటకును నాకధికారము లేదు".

రాజిట్లడిగెను:- "నీ తండ్రి యెవరికైన వాగ్దానమొన ర్చినాఁడా యేమి?"

శకుంతల యిట్లనెను:- "నాకు తెలిసియున్నంతవఱకిం కను నా తండ్రి యెవరితోడను వివాహ చర్చనొనర్చిన గుర్తు లేదు. ఆతఁడట్లు చేసినచో నన్నుఁ దప్పక అడిగి యుండెడి వాఁడే. ఆతఁడు నన్నెక్కువగఁ బ్రేమించుచుండును."

రాజిట్లనెను:- "అయితే యిది చెప్పుము. నీకు నన్నుఁ బతిగా నొనర్చుకొనుటకిష్టమున్నదా? లేదా? నీవు నీకు నేనను రూపుడనని భావించుటలేదా?"

అత్యంత లజ్జతోడను, సంకోచ స్వరమునను శకుంతల యిట్లనెను:- "మహారాజా! ఇట్లు ప్రశ్నించి మీరు నన్నే లజ్జిత నొనర్చెదరు? మీకాత్మసమర్పణ మొనర్చుటయే పరమసౌభాగ్యమని భావింపని యువతి యీప్రపంచమున నెవతె యుండగలదు. మర్త్యభామినుల మాటయేల? స్వర్గసుందరులగు దేవకన్యకలును మిమ్ముఁ దమ పతిగా గ్రహించుట పరము గౌరవముగ భావించెదరు. నేను కోరననే అన్నియును నెఱవేరవు. నేను నా తండ్రికిని, అధర్మమునకును మిక్కిలి భయపడుచుందును. ధర్మవిరుద్ధముగ నేనెన్నఁడును వర్తింపఁజాలను. నేను ప్రాణములనైనను వదలఁగలనుగాని ధర్మమునెన్నఁడును వదలఁజాలను."

రాజిట్లనెను:- "నేను నిన్ను ధర్మమును వదలుమనుట లేదు. నీవు యువతివి. ప్రాప్తవయస్కవు. రాజకుమారివి. యువతియగు క్షత్రియకన్యకకు స్వయంవర మొనర్చుటకుఁ బూర్ణమగు నధికారము కలదు. వారికి గాంధర్వ వివాహము గర్హ్యముకాదు. ప్రశంసనీయమైనదే; అధర్మముకాదు ధర్మమే; కనిష్ఠముకాదు, ఉత్తమమే; అయశస్కరముకాదు, యశస్కరమే; అకీర్తికరముకాదు, కీర్తికరమే. నీవు నన్ను గాంధర్వ విధిచే వివాహమాడవచ్చును. కణ్వమహాముని ధర్మజ్ఞుఁడు. ఆతఁడు దీని ననుమోదింపఁగలఁడు. నీకు నామీఁదఁ గృప యుండినచో నిప్పుడే నీవు నన్ను వివాహమాడుము."

శకుంతల యిట్లనెను:- "మహారాజా! నేను స్వయంవర మొనర్చుటకు స్వతంత్రినైనచో నిది ధర్మమునకును, నీతికిని విరుద్ధము కానిచో నేను మిమ్ముఁ బతిగాఁ బడయుటలో మిక్కిలి సంతసించెదను; కాని యిచ్చట మంత్రపాఠ మొనర్చు పురోహితుఁడు లేఁడు కదా!".

రాజిట్లనెను: - "వివాహ మంత్రములను నేనెఱుఁగుదును. ఒకవేళ నెఱుఁగకున్నను గాంధర్వవివాహమున మంత్రములను జదువకున్నను ధర్మవిరుద్ధము కాదు. ఇద్దరును బ్రతిజ్ఞాపూర్వకముగఁ బాణిగ్రహణ మొనర్చుకొని యొకరి నొకరాత్మ సమర్పణ మొనర్చుకొనినచోఁ జాలును."

శకుంతల యిట్లనెను :- "ఇదియే శాస్త్రీయమగు నాజ్ఞయగుచో నేను మీకాత్మసమర్పణ మొనర్చుటకే యభ్యంతరమును లేదు. కాని మీరొక ప్రతిజ్ఞ నొనర్పవలయును."

రాజిట్లనెను:- "అదేది?"

శకుంతల యిట్లనెను:- "రాజులచిత్తము చంచలమైనది. వారికనేకులు రాణులుందురు. నా గర్భమునఁబుట్టిన పుత్రుఁడేఁ రాజ్యాధికారి యగునట్లుగ మీరు ప్రతిజ్ఞ నొనర్పుఁడు."

రాజత్యంతోల్లాసముతో నిట్లనెను :- "ప్రియా! నీవు నామీఁద నవిశ్వాసమును జెందెదవేల? నీకు పుత్రుఁడెప్పుడుదయించునో తెలియదు. నేను నేఁడే నా తను, మన, ధన,

రాజ్యమును వేయేల సర్వస్వమును నీకు సమర్పించుచున్నాను. నీ గర్భమునఁ బుట్టిన పుత్రునే నేను నా రాజ్యమునకధికారిగా నొనర్చెద నేను సత్యసాక్షిగాఁ బ్రతిజ్ఞ నొనర్చుచున్నాను. నేను నేఁటివరకు మిథ్యాభాషణమును గావింపలేదు. నీకు నా మాటమీఁద విశ్వాసము జనించినదని ఆశించుచున్నాను. ఇప్పుడు నీవు కమలముకంటెను గోమలముగను సుందరముగను బ్రకాశమానముగను నెఱ్ఱగ నుండునదియును అత్యంత కోమలములగు మణిబంధములు కలదియు మధులోలుపులగు భ్రమరములు సరోరుహములను భ్రాంతిచే వానికడనే తిరుగునట్లు చేయునవియునగు నీ కరములను నా కరములందుంచుము."

ఇది విని . శకుంతల అనురాగ పూర్ణమగు హృదయముతోఁ దన కమల సదృశములగు గోమల కరములను మహారాజువైపునకుఁ జాచెను. మిక్కిలి ఆఁకలిని జెందినవాఁడెట్లు భోజనమును గ్రహించునో అట్లే మహారాజా సుకుమార కరముల నదే ఉత్కంఠతతో గ్రహించెను. ఇంకను మిక్కిలి దప్పిక చెందినవాఁడు సుందర సుగంధిత స్వచ్ఛ సలిలములను గ్రహించునట్లును, లోభి ధనరాశిని గ్రహించునట్లును నా మహారాజు శకుంతలయొక్క కరమును వాదరముతోడను ఉల్లాసముతోడను అనురాగముతోడను దనచేతిలోనికిఁ గైకొనెను. అంత నిద్దరును వేదమంత్రములతో నొకరొకరు బ్రతికియున్నంత వఱకు ధర్మపూర్వకముగఁ గలిసియుందుమని ప్రతిజ్ఞను గావించుకొనిరి. స్వర్గమందలి దేవతలును, పితరులును నీ మంగళ

మయు గాంధర్వ వివాహమును గాంచి ముదితులైరి. వారు నవ దంపతులమీఁదఁ గల్పవృక్ష కుసుమములను వర్షింపఁజేసిరి. ఆశ్రమమందలి వృక్షములు కదలి దీని ననుమోదించెను. పవనదేవుఁడిద్దరియొక్క యుత్తరీయవస్త్రములను నెగురఁగొట్టి గ్రంధి బంధన మొనర్ప నుపక్రమించెను. తమ సఖి రాణి యయ్యెనని శకుంతల సఖులు లోలోన నుబ్బిపోవుచుండిరి. కల్పలతను బెంచి దానిని పెద్దదానినిఁ గావించిన దానికి పుష్ప ఫలములు వేసినచో నెంతగా సంతోషించెదరో వృద్ధ తపస్విని అంత సంతోషపడుచుండెను. నేఁడామె తన శ్రమ సఫలమైన దనుకొనుచుండెను. "నా కమూల్యమగు వస్తువు లభించినదని రాజనుకొనెను. తన జీవితము సార్థకమైనదని శకుంతల తెలిసి కొనెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈవిధముగ గాంధర్వ వివాహమైన తరువాత మహారాజు హారమునకు బదులుగ తన విశాల భుజములను శకుంతల మెడకునైచి హారముగ నొన ర్చెను. నవవధువునకుపహారముగ హారము నొసంగవలయును. అచ్చట హారమెచ్చటిది? అందువలన బాహు హారమునేవైచి అతఁడామెను సమీపమున నున్న దట్టమైన కుంజములలోనికి గొనిపోయెను."

# పుత్రవతియగు శకుంతల

౭౭౧

శ్లో॥ అమోఘవీర్యో రాజర్షిర్మహిష్యాం వీర్యమాదధే।
శ్వోభూతే స్వపురం యాతః కాలే నా సూత సా సుతమ్॥

శ్రీ భాగవతము 9 స్కం, 20 అ 17 శ్లో॥

వ॥ ఇవ్విధంబున నమోఘవీర్యుండగు నా రాచపట్టి తపసి రామారికిఁ జూలు నిలిపి మఱునాఁడు తన వీటికిం జనియె నయ్యంతియుం గొంతకాలమునకుఁ గొడుకుం గనినఁ గణ్వ మునీంద్రుండా రాచపట్టికి జాతకర్మాది మంగళాచారంబులొనర్చె

శ్రీమదాంధ్రభాగవతము.

సదా వ్యర్థముగ నసత్యములాడువాని మాటలందు మహాత్మ్యముండదు. విలువయు నుండదు. ప్రజలు వాని మాటలను విశ్వసింపరు. వాని వాక్యములందాస్థను జూపింపరు. కాని యెవరు మౌనముద్వారా వాక్కును సంయమమొనర్చి ఆసమయమున ననావశ్యకములు నసత్యములునగు శబ్దములను బలుకనివాని వాక్కు అమోఘమగును. వారే శాపముగాని వరమునుగాని యిచ్చుటకు సమర్థులగుచుందురు. అదే విధముగ నెవరు కామవశులై రజోవీర్యముల నెవరు వ్యర్థముగ నపవ్యయమును గావించెదరో క్షుద్రములగు నింద్రియ సుఖములకు వశీభూతులై ధర్మాధర్మములను గమ్యాగమ్యములను విచారింపక వానిని వ్యర్థముగ నుపయోగించెదరో వారి రజోవీర్యములు

మోఘములై వ్యర్థములగును. దీనికి విపరీతముగ నెవరు సదాచారపథము నెన్నడును పరిత్యజింపక ధర్మబంధనమును సడలింపక ఆర్య సంస్కృతిని రక్షించుచుఁ గామవశులయ్యు ననుచిత కార్యములొనర్పకుండువారి మోఘవీర్యులగుదురు? అట్టి వారి వీర్యమెచ్చటఁ బడినను వ్యర్థము కాఁజాలదు. అందువలననే రాజర్షుల యొక్కయు, బ్రహ్మర్షులయొక్కయు నమోఘవీర్యము పశుపక్ష్యాదులందును వృక్షములందును నెచ్చటఁ జ్యుతిమైనను నచ్చటనె సంతానోత్పత్తి కాఁగలదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! సాయంకాలమున గోధూళికా లగ్నమందు శకుంతలా దుష్యంతులకు బాణిగ్రహణ సంస్కారమయ్యెను. అంత ననురాగ భరితమగు హృదయముతో రాజుయొక్క బాహుపాశమున నాబద్ధయై శకుంతల రతీదేవివలెఁ దాను వేసిన నుపవనమందే భ్రమించుచుండెను. తాపసులు కుటీరములలో నుండిరి. సఖులు రాజును, రాణిని ననుగమించుచుండిరి. వారిట్లనుచుఁ బోవుచుండిరి:- "మహారాజా! ఈ సువర్ణయూధికయందు పచ్చపచ్చగ వికసించిన కళికలున్నవే యీ చెట్టును మా సఖియగు శకుంతల మిక్కిలి శ్రమతో నాటినది. దీనిని లతాకుంజముగ నొనర్చుటకు మిక్కిలి వ్యసనము కలదు. అచ్చట నెదురుగాఁ బుష్పభారముచే వంగిన సఘన మాధవీకుంజము కనఁబడుచున్నదే దానిని మా సఖి మిక్కిలి కళతో నిర్మాణము కావించినది. ముందుగా మట్టిస్తంభమును జేసి వానిసహాయమున నంటు కట్టి తరువాతఁ

పెద్దవాసములమీఁదకు వాని నెక్కించి వృక్షములకంటించినది. వృక్షములమీఁద పుష్పించినమాధవీలతవలన వృక్షమే పూచి నట్లుండెను. నా సఖికి కమలములనిన మిక్కిలి అనురాగము. ఈ కనఁబడునట్టి పుష్కరిణిని మేమందఱమును గలిసి త్రవ్వి తిమి. మాలినీ నదినుండి స్రోతను గొనివచ్చి దీనిని నింపితిమి. కులపతి భగవానునితోఁ జెప్పి దూరదూరములనుండి రంగుల రంగుల కమలములను దెప్పించితిమి. ఇంతటి మంచికమలములు సులభముగ నెచ్చటను దొఱకవు. ఈ చేఁపలెట్లు దుముకుచు న్నవో మీరు చూడుఁడు. జలమే వీనికి జీవనాధారము. వాని జీవనాధారముయొక్క వక్షఃస్థలమందే అవి క్రీడించుచున్నవి! కమలములను గదలించుచున్నవి! చూడుఁడు. కమలములు సూర్యాస్తమయమగుటచే ముడుచుకొనుచున్నవి. ఇప్పుడర్ధ వికసితమగు కళికాసమీపమునకే యీ భ్రమరములు వచ్చి దీనిలోఁ బడిపోయినవి. ఇప్పుడింక రాత్రియంతయును దీనియంక మందే బంధింపఁబడియుండెను. ఇవి యెగిరిపోలేదు. ఎదురుగ దట్టముగ నుండిన నరఁటి కుంజముదగ్గఱ నీ విధారలతలెంతో దట్టముగ నున్నవి! శకుంతలచేఁ బెంచఁబడు హరిణమిచ్చటనే నివసించుచున్నది. అదిగో ఆ నల్లకొమ్ముల లేడి విషయమున నొక యితిహాసము కలదు. మేమొకదినమున వనమునఁ దిరుగు చుంటిమి. అచ్చటనే ఒకవ్యాధుఁడొక హరిణినిఁ జంపివైచెను. ఇది దాని శిశువు. ఒంటరిగా నటునిటుఁ దన్నుకొనుచుండెను. శకుంతల దీనినిఁ బ్రేమతో వడిలోనికిఁ దీసికొని ఆశ్రమము

లోనికిఁ దీసికొనివచ్చి పుత్రునివలె దీనినిఁ బెంచి పాలనుబోయు చుండెను; కొంచెము పెద్దదైన తరువాత దీనికొక హరిణితో వివాహ మొనర్చినది. అది వివాహ సమయమున నిట్లు వర మొసంగెను:- "నీ వెట్లీ యాశ్రమమున నాకు జంటను గలిపితివో అట్లే ఒక దినమున నీకును నిచ్చట జంట లభింపగలదు." ఆ వరమిప్పుడు సఫలమైనది నాకుపనియున్నది. ఆపచ్చరియావు నాకే మాలిమి. ఇతరులను బాలుపిండనీయదు. ఇప్పుడు నేను బాలను బిండపోయెదను." ఇట్లు పలికి ఆమె వెడలిపోయెను, శకుంతల ఆమెను మిక్కిలిగ పిలిచెను:- "ఓసీ సత్యా! ఎచ్చటికిఁ బోయితివి? నీవు నన్నొకాకిగా వదలి వెళ్ళెదవేమి? వినవేమే?"

ఆమె విననట్లుగ నిట్లనెను:- "నేను విననవలసినపని లేదు. ఒంటరిగా నేమియుంటివి. ఇప్పుడు నీకు రక్షకుఁడును, భర్తయు నగు మహారాజు వెంటనే యున్నాఁడు." అని పలికి ఆమె కన్నుల కగపడకయే వెడలిపోయెను. మహారాజా విధారను, అరఁటి కుంజమును గాంచి మిక్కిలి సంతోషించెను. రాత్రి యంతయును వారచ్చటనేగడిపిరి. అమోఘవీర్యుఁడగు రాజర్షి తన ధర్మపత్నియందచ్చటనే గర్భాదాన సంస్కారమును గావించెను.

ప్రాతఃకాలమయ్యెను. రాజు శరీరము శిథిలమయ్యెను. అందువలన నాతనికి లజ్జా, సంకోచ, భయ, చింతలు కలిగెను. మానవుఁడు కామముయొక్క ప్రబల ప్రవాహములోఁ బడిపో

యినచో అప్పుడు పెద్దల సంకోచము ధర్మాధర్మముల భయము కర్తవ్యాకర్తవ్యజ్ఞానము వానికుండదు. కామవేగము శాంతింపఁ గనే మరల విచారము కలుగును. ఇప్పుడు రాజిట్లనుకొనెను:- "ఋష్యాశ్రమమునకు వచ్చి నేనెట్టి యనుచిత కార్యము నొన ర్చితిని! ఋషి యనుమతి లేక శకుంతలతో నేనిట్టి ప్రస్తావ మును జేయకుండవలసినది. నేనీ ఛలకపటరహితయగు నమా యకను స్వార్థ ధర్మమును జెప్పి మోసగించితిని! ముని క్రుద్ధుఁ డైనచో నా రాజ్యమునంతను శాపమొసంగి భస్మము చేయఁ గలఁడు. అను నీ విచారములు రాఁగానే రాజు ముఖము వాడి పోయెను. అతఁడు భయభీతుఁడై శకుంతలతో నిట్లనెను :- "ప్రియా! ఇప్పుడు నేను నాపురమునకుఁ బోఁగోరుచున్నాను."

శకుంతల వివశతా స్వరమున నిట్లనెను :- "ఇప్పుడే యెందులకు? ఇప్పుడు తండ్రిగారు రాఁగలరు. వారి దర్శనము నర్చి ఆశీర్వాదమును బొంది పొండు."

రాజిట్లనెను :- "దేవీ! రాజకార్యములు చాల కఠిన ములుగనుండును. మునిచరణధూళిని మస్తకమునధరించి కృతా ర్థుఁడను గావలయునని నాకును గలదు. కాని కార్యభారముచే వివశుఁడనగుచున్నాను. మరల నింకొకసారి వచ్చి దర్శనము నర్చెదను."

శకుంతల తన యనురాగభరిత దృష్టిని రాజు దృష్టి యందుఁ గలుపుచు నాతని భుజముమీఁదఁ దన శిరస్సు నుంచి యిట్లనెను - "అట్లయితే, నేను మీరు లేక యెట్లుండఁగలను?"

రాజిట్లనెను :- " నీవేమియును జింతింపకుము. వెళ్ళఁగానే నేను చతురంగసేనను నిన్నుఁగొనిపోవుటకై పంపెదను. నిన్ను రాణివలె మిక్కిలివైభవముగ నా మంత్రి సేనాపతులు తీసుకొని రాఁగలరు."

శకుంతల యిట్లనెను :- " మహారాజా! రాజధానికి పోఁగానే నన్ను మఱచిపోయెదరు. ఆశ్రమములో నెవరు కలిసికొనిరో మరల మీకు స్మరణముండదు."

శకుంతల తలవంచుకొనఁగా గడ్డముపట్టుకొని యెత్తుచు రాజిట్లనెను:- "ప్రియా! నీవెట్టి మాటలను బలుకుచున్నావు? నాపై యింతటి యవిశ్వాసమును జెందెదవేల?"

ఇది వినఁగానే శకుంతలయొక్క రెండు కన్నులనుండి బొట బొట నశ్రువులు రాలెను. రాజు హృదయమును ద్రవీభూతమయ్యెను. ప్రసంగ మత్యంత కారుణికమగుటను గాంచి రాజు వెడలిపోవుటకు బయలుదేరెను. శకుంతలయును నాతని వెంటఁబోయెను. ఆతఁడు వెళ్ళుట ఆమెకు కష్టముగనుండెను. వియోగజన్య దుఃఖముచే నామె హృదయ ముప్పొంగెను. కాళ్ళతో నామె కష్టముతో నడుగులిడుచుండెను. రాజొక వృక్షచ్ఛాయను నామె నాపి యిట్లనెను.:- "నీకు శ్రమ కలుగును. ఇఁక ముందు రావలదు." ఇట్లు పలికి శీఘ్రముగ నామె నాలింగనము చేసికొని ఆతఁడు వెడలిపోవుచుండెను. శకుంతల తల తిరుగసాగెను. ఆమె అచ్చటనే కూలబడెను. రాజప్పటికి

దూరము పోయెను. దొంగవలె నాతఁడు తన్ను దాను దాచుకొనుచుఁ బోవుచుండెను. ఆశ్రమ ద్వారమును దాటి ఆతఁడత్యంత శీఘ్రముగఁ దన శిబిరమునకుఁ జేరుకొని వెంటనే సేనకు బ్రస్థానమొనర్చుట కాజ్ఞాపించెను. రథమునెక్కి రాజధానికిఁ బోయెను.”

శకుంతల చాలసేపటివఱకు సఘనస్మృతిచ్ఛాయయందు పడియుండెను. ఆమె యెప్పుడు పరుండినదో ఆమెకే తెలియదు ఆమె మెలఁకువ వచ్చునప్పటికి ఆమె భూమిమీఁదఁ బడియుండెను. మిక్కిలిలజ్జించెను. ఆమెకుఁ బ్రపంచమంతయును శూన్యముగఁ గనఁబడుచుండెను. తెలియనివానివలె నామె కష్టముతో లేచెను! వల్కలవస్త్రములందలి ధూళిని ఆమె దులుపుకొనెను. ఎదుటనే నవ్వుచుండిన సఖి ఆమెకు గనఁబడెను. నేఁడామె నైపునకుఁజూచుట లేదు. మెదలక తన యుటజములోనికిదూరెను. సఖి ఆమెకు స్నానము చేయించి వస్త్రమును మార్పించెను. కాని ఆమె మెదలక కపోలము మీఁదఁ గరమును బెట్టుకొని చింతామనస్కయై కూర్చుండెను. ఆమె కెవరి సమ్ముఖమునకైనఁ బోవుటకు లజ్జవేయుచుండెను.

అల్పకాలముననే ఫలపుష్పముల బుట్టను, కుశల కట్టను దీసికొని కణ్వభగవానుఁ డచ్చటికి వచ్చెను. నిత్యస్వభావానుసారముగ నాతఁడిట్లనెను. “అమ్మాయి శకుంతలా!” ఇది వినఁగానె శకుంతలకు సిగ్గు కలిగెను. ఆమె బయటకు రాలేదు. నిత్యమువలె నామె ముని పాదములను కడుగలేదు, ఫలముల

బుట్టను దలమీఁదనుండి దింపలేదు. సర్వజ్ఞుఁడగు ముని అంత యును గ్రహించెను. బుట్టను దింపి ఆతఁడుటజములోనికిఁ బోయెను. శకుంతల లజ్జచేఁ దన శరీరమును ముడుచుకొని యుండెను. ముని ఆమె శిరస్సున హస్తమునుంచి యిట్లనెను:- "అమ్మా! ఏమో అస్తవ్యస్తముగనుంటివేల? చిత్తమెట్లున్నది?"

ఇది వినఁగానే శకుంతల ముని పాదములమీఁదఁ బడి యేడ్వసాగెను. ముని లేవనెత్తి ఆమెనుగౌఁగిలించుకొని యిట్ల నెను:- "అమ్మా! నేను యోగదృష్టిచే సమస్తవృత్తాంతమును దెలిసికొంటిని. నీవేమియును ధర్మవిరుద్ధపుకార్యమునొనర్ప లేదు రాజర్షియగు దుష్యంతుఁడు ధర్మాత్ముఁడు. ఆతనినిఁ బతిగా గ్రహించి మంచిపనినే చేసితివి."

ముని యనుకూలుఁడగుటను గాంచి శకుంతల లేచి తన పెంపుడుతండ్రి పాదములను గడిగి పండ్లను లోపలఁ బెట్టెను. అంత నామె తన దైనికకార్యములలో లగ్నయయ్యెను. ఇప్ప టికి శకుంతలకు బాల సులభచంచలత్వము సమాప్తమయ్యెను. ఇప్పుడామె బాలభావము విలీనమయ్యెను. ఇప్పుడామె గర్భవతి యయ్యెను. రాజు సేన యెప్పుడు రాఁగలదు. యెప్పుడు నేను నాప్రాణపతికడకు బోఁగలనని ఆమె ప్రతిదినమును ప్రతీక్షించు చుండెను కాని ఒక్కొక్క దినము లెక్కపెట్టుకొనఁగా మూఁడు సంవత్సరములు గడిచెను; సేనయును రాలేదు, రాజుగారివద్ద నుండి యే సందేశమును లభింపలేదు. లజ్జాకారణమున నామె తండ్రికిని నేమియును జెప్పలేదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! శకుంతల శంక సత్య మయ్యెను. రాజు పురమునకుఁ బోఁగానే ఆశ్రమములోని సమస్త వృత్తాంతమును మఱచిపోయెను. సమయము రాఁగానే శకుంతల ఒక పుత్రరత్నమును బ్రసవించెను. ఆశ్రమమంతటను నానందోత్సవమొనర్పఁబడెను. స్వయముగ కణ్వమహర్షియే ఆతనికి సమస్తసంస్కారములను గావించెను. ఇప్పుడు శకుంతల బాలికకాక పుత్రవతి యయ్యెను.

## శకుంతల పతిగృహమునకుఁ బోవుట

౭౭౨

శ్లో॥ కణ్వః కుమారస్య వనే చక్రే సముచితాః క్రియాః।
బద్ధ్వా మృగేంద్రాంస్తరసా క్రీడతి స్మ స బాలకః।
తం దురత్యయ విక్రాంత మాదాయ ప్రమదోత్తమా।
హరేరంశాంశ సంభూతం భర్తురంతిక మాగమత్॥

శ్రీ భాగవతము 9 స్కం. 20 అ. 18 శ్లో.

క॥ కుంతితుఁడుగాక వాఁడు
త్కంఠం దన పిన్ననాఁడె కణ్వ వనచర
త్కంఠీరవ ముఖ్యంబుల
కంఠములం బట్టియడుచుఁ గట్టున్ విడుచున్॥

క॥ ఆ పిన్నవాని వతుల
వ్యాపారు నుదారు వైష్ణవాంశోద్భవునిం
జూపెదనంచు శకుంతల
భూపాలునికడకు వచ్చెఁ బుత్రునిఁ గొనుచున్॥

శ్రీమదాంధ్రభాగవతము.

సంయోగవియోగ శృంఖలయందే ప్రపంచమాబద్ధమై యున్నది. రాకపోకలు గలదే సంసారము ఆవాగమన రహిత మైనది. సంసారాతీతమైనది. ప్రియ సంయోగమున సుఖమంద అకును గలుగును. ప్రియవియోగమున నందఱియొక్క కన్నులు తడియగును. హృదయము ద్రవించును. ప్రియాప్రియజ్ఞానము లేనివాఁడుపురుషుఁడుకాఁడు పురుషోత్తముఁడు. సంయోగమున నెంతటి సుఖము కలుగునో వియోగమున నంతటి దుఃఖమును కలుగును. పాషాణ హృదయులగు హంతకుల హృదయమం దును గరుణ గోచరించును. వారికిని ప్రియ వియోగమునఁ గంట నీరు విడుచుట గోచరించుచుండును. జ్ఞానికైనను అజ్ఞాని కైనను సంయోగ వియోగ ప్రభావమందఱిమీఁదను బడును. భిన్న భిన్న ప్రకృతి కలవారు భిన్న భిన్న వనుభవించువిషయ ముది వేఱు.

సూతుఁడిట్లనెను :– " మునులారా! శకుంతల పుత్రవతి యైనది. దీనివలన నాశ్రమములోనివారందఱికును మిక్కిలి యానందము కలిగెను. శకుంతలా పుత్రుఁడత్యంత సుందరుఁడు. అత్యధిక స్వస్థుఁడు. ఆతని అంగ ప్రత్యంగము లత్యంత బలిష్ఠ ములై యుండెను. ఆతఁడు పూర్ణముగ మూఁడువర్షములు గర్భ మందుండెను. చూచుట కాతఁ డొక సింహ శాబకమువలె నుండెను. క్రమక్రమముగ నాతఁడాశ్రమముయొక్క వాయు మండలమునఁ బెరుగుచుండెను. ఆతని వెండ్రుకలు నల్లగ నుంగరములు తిరిగియుండెను. తల వెడల్పుగనుండెను. భ్రువు

ధనురాకారముగ నుండెను. నేత్రములు రెండును గమలముల వలెఁ బెద్దవిగ నుండెను. నాసిక వంకరగనుండెను. స్కంధము సింహమునకువలె నుండెను. బాహువులు విశాలముగనుండెను. ఱొమ్ము వెడల్పు. ఉదరము కేసరికివలె నుండెను. జఘనము మాంసలముగను స్థూలముగను నుండెను. జానుజఘనములు సుందరములుగను నుబ్బెత్తులుగ నుండెను. చరణములెఱ్ఱగ నుండెను. నఖములు కాంతియుక్తములుగ నుండెను. అతని దంతములు తెల్లగ వరుసగ నుండెను. చేతిలోఁ జక్రచిహ్నము కలదు, ఆశ్రమమునకాతఁడొక ఆటబొమ్మ. ఏ ఋషి గానిండు ముని కానిండు వచ్చినా వాని నెత్తుకొని ముద్దులాడవలసినదే. అతఁడు తన తల్లి చంకను నుండఁడు. చంక కెత్తుకొనిన యదార్థమునఁ దల్లి చంక నిండిపోవును. పాలను ద్రావి వెంటనే అతఁడు నేలమీఁదకు దిగి అటునుండి యిటు మోఁకాలు బలమునఁ బోవుచుండును. అతఁడు గోశాలకుఁ బోయి దూడల మెడకు వ్రేలాడును; గోవుల తోఁకలనుబట్టుకొని వ్రేలాడును; కొమ్ములను బట్టుకొని ప్రాకును. వానికెవరి భయమును లేదు. క్రమక్రమముగ నాతఁడు పెద్దవాఁడయ్యెను. ఆశ్రమమందే అతని కాలేండ్లు నిండెను. చూచుట కాతఁడు సింహమునకు వలెఁ దోచుచుండెను. అతఁడెచ్చటనైన సింహగర్జనమును వినెనా పరుగెత్తుకొనిపోయి దాని చెవులనుబట్టుకొని లాగుకొని వచ్చును. అతఁడు రెండుసింహములను బట్టుకొని పోరాడించును అడవిపందులమీఁద నెక్కును. పరువిడుచున్న హరిణములను బట్టుకొనును. చెట్లపై కెక్కి యెలుఁగుబంటు జుట్టును బట్టుకొని

చెట్టుమీఁదనుండి దుముకును. అందఱును నాతని పరాక్రమ మును గాంచి చకితులగుచుందురు. అందఱును నాతనికి 'సర్వ దమనుఁ'డను పేరును బెట్టిరి. ఏలననఁగా నాతఁడు సమస్త పశువులను దమన మొనర్చును. ఆతనికిఁ గణ్వమహర్షి పాద ములందత్యధిక భక్తి. ఆతని యాజ్ఞలనన్నిటిని నాతఁడు పాలిం చుచుండును. అడవి దున్నలనెత్తి పైకి నెగురవేయుచుండును. శకుంతల మాటిమాటికి నిట్లనుచుండును :– "సర్వదమనా! నీవింత యల్లరినిఁ జేయుచున్నావు. ఏదోదినమున నిన్ను సింహ వ్యాఘ్రములు పరిహార మొనరింపఁగలవు."

ఆతఁడిట్లనెను :– "అమ్మా! నేను సింహమునకుఁ దీసిపో యినవాఁడనుగాను. నాకు సింహదంతములనిన నిష్టము. నేను వానినిఁ బట్టుకొని లెక్కింతును చూడుము. నేనా రెండు సింహములను గట్టివైచితిని. ఇప్పుడు నేను వాటినిఁ బోరాడిం చెదను."

శకుంతల యిట్లనెను:– "అయ్యో! నీవు వట్టి వెఱ్ఱివాఁడ వురా! వదలివేయుము, వదలివేయుము. సింహముల నిట్లు కట్టరు." తల్లిమీఁదిగౌరవముచే సర్వదమనుఁడు సింహములను వదలివేయును. ఈవిధముగ ననేకవిధములగు పరాక్రమములను బ్రదర్శించుచు బాలకుఁడందఱను నాశ్చర్యచకితులను గావిం చుచుండెను."

కొంతకాలమైన తరువాతఁ గులపతియగు కణ్వుఁడిట్లనెను :- "అమ్మా! రాజేమియును జాడ కనుఁగొనుట లేదు. ఏమియును ఫరవాలేదు. ఆతఁడు పిలువకున్నను నీవాతని భవనమునకుఁ బొమ్ము."

శకుంతల యిట్లనెను:- "తండ్రీ! రాజు నాజాడను గనుగొనకపోయినచో నేనిచ్చటనే మీ చరణసన్నిధిని దినములను గడుపుకొందును. మీరు పదివేలమందినిఁ బోషించుచుండఁగా మీకు నేనొక్కతెను భారమగుదునా?"

కణ్వమహాముని యిట్లనెను :- "అమ్మా! వయస్సు వచ్చిన పుత్రికలు తండ్రి నింట నెక్కువ దినము లుండరాదు. దీనివలనఁ బ్రపంచమున నపవాదము కలుగును. అకీర్తి వ్యాపించును. పతి ధనికుఁడు కానిండు, దరిద్రుఁడు కానిండు ఆతని గృహమునకు స్త్రీయే శోభ. భర్తయుండఁగా వయస్సువచ్చిన కన్య గృహమునకు భారమగును. కేవలము పొట్ట నింపుకొనుట చాలదు. గృహస్థ ధర్మమునుగూడ పాలింపవలయును."

శకుంతల యిట్లనెను:- "అచ్చటినుండి యెవరును బిలుచుటకు రాలేదు. పిలువనిది అచ్చటికిఁబోవుట మంచిది కాదు."

కణ్వమహర్షి యిట్లనెను :- "పుత్రీ! నీవు చెప్పినది నిజమే. పిలువకయే పోయినచో నాదరముండదు; కాని పుట్టినింటికిని, పతి గృహమునకును, గురు గృహమునకును తన

మిత్రుని యింటికినిఁ బిలువక వెళ్ళినను దోషము లేదు; ఏలన నఁగా నివి యన్నియు స్వగృహములే."

శకుంతల యిట్లనెను:- "మీ యాజ్ఞ ప్రకారమే. కాని నేను మీరు లేక యెట్లుండఁగలను?" అని పలికి శకుంతల యేడ్వఁదొడంగెను.

ముని బుద్ధిమంతులగు నలుగురైదుగురు శిష్యులను బిలిచి యిట్లనెను:- "మీరు శకుంతలను గొనిపోయి హస్తినా పురమందు దుష్యంతమహారాజు భవనమునకుఁ జేర్చుఁడు."

ఇట్లు పలికి ముని శకుంతల సఖితో సిద్ధపడవలసినదని చెప్పెను. తాపసులు మూటను ముల్లెను కట్టిరి. ఒకరు సర్వాద మను నెత్తుకొనిరి. ఇప్పుడు వెళ్ళుట కందఱును దొందఱ పడు చుండిరి. శకుంతలయొక్క రెండు కన్నులనుండి అశ్రువులు ప్రవహించుచుండెను. ఆమె యెవరినిఁ జూచినను వారినిఁ గౌఁగిలించుకొని వెక్కి వెక్కి యేడ్వసాగెను. ఆమె యెచ్చ టికో వెడలుచున్నట్లుండెను. ఆమె హృదయమున మాటి మాటికిని దుఃఖముప్పొంగుచుండెను. ఆశ్రమములోని కణకణ మునందామెకు మోహము కలిగెను. ఆమె నాటిన వృక్షము లును, లతలును పుష్పించి ఫలించుచున్నవి. ఏ హరిణముల నామె వడిలోఁబరుండఁబెట్టుకొని మేపినదో, దూదిపింజలతోఁ బాలను బోసినదో యిప్పుడవి పెద్ద కొమ్ములు కలవైనవి. అయినను నవి ఆమెను బిల్లలవలెఁ జుట్టుకొని నిలుచుండినవి.

ఆమె శరీరమును నాకుచుండెను. శకుంతల వానిమీఁదఁ జేయిని నిమిరి, ముద్దిడుకొని, ముఖముమీఁద నామె ముఖము నుంచి "నేను వెడలుచున్నా" ననెను.

ఏ పక్షుల నామె నిత్యమును నీవారధాన్యమును వేసి మేపుచుండెనో అవన్నియును నేఁడు వృక్షములమీఁదనుండి దిగివచ్చినవి. అవి బియ్యమునుదినుటలేదు. నిర్నిమేషదృష్టితో నవి శకుంతలను జూచుచు నేడ్చుచున్నవి. చిన్న చిన్న వటువులు వచ్చి శకుంతలను జుట్టుకొనిరి. వారిట్లడుగుచుండిరి :- "అమ్మా! నేఁడు మీరెచ్చటికిఁ బోవుచున్నారు."

ఇంకొకరిట్లనిరి :- "నీవు పతి గృహమునకు వెళ్ళుచున్నావా?"

పిల్లలిట్లనిరి :- "మనకందఱకును కులపతి కణ్వమహర్షియే గదా!"

ఇంకొకఁడిట్లనెను.- "కాదురా, ఆమె అత్తవారింటికిఁ బోవుచున్నది."

పిల్లలిట్లడిగిరి :- "అత్తవారింటినుండి యెప్పుడు తిరిగి రాఁగలదు."

పెద్దవాఁడిట్లనెను:- "ఇప్పుడేలఁ దిరిగి వచ్చును? అత్తవారింటికి వెళ్ళినవారు తిరిగి వచ్చెదరా?"

ఇది విని పిల్లలేడ్వసాగిరి. శకుంతల వారి ముఖములను ముద్దుపెట్టుకొని కన్నులను దుడుచుచు నిట్లనెను:- "నాయనా! నేను త్వరగా వచ్చెదనులే"

పిల్లలిట్లనిరి:- "అమ్మా! నీవెంట మేముకూడవచ్చెదము"

శకుంతల యిట్లనెను :- " నాయనా! చాల దూరము పోవలయును. మీరందఱలసిపోయెదరు."

పిల్లలిట్లనిరి :- "సర్వదమనుఁడుకూడ పోవుచున్నాఁడా? మేము వానివెంట వచ్చెదము"

ఇతర ఋషులు పిల్లలకిట్లు చెప్పిరి :- "కాదురా మేమెప్పుడైన వెడలునప్పుడు మీరు రావచ్చునులెండు."

కణ్వభగవానుఁడు మాటిమాటికి వెళ్ళుమనుచుండెను. ఆతనికిని దుఃఖముప్పొంగెను. ఆతఁడు తన బాష్పాశ్రువులను బిగపట్టినాఁడు కాని ఆతని హృదయము కఱఁగుచుండెను. అది లోలోనఁ గరుగుచుండెను. నీరు నీరగుచుండెను. ఆ లక్షణ మాతని ముఖమండలమునఁ బ్రత్యక్షముగఁ గనఁబడుచుండెను ఆతని వాక్కు రుద్ధమయ్యెను. ఆతఁడెంతో కష్టమునఁ గొలదిగ మాటలాడుచుండెను.

అనేకసార్లు ముని హోమ్మనఁగా శిష్యులు మూటలు ముల్లెలను దీసికొని బయలుదేరిరి. శకుంతల తన పెంపుడుతండ్రి పాదములనంటి ఆతనిఁ గౌఁగిలించుకొని అబోధబాలికవలె నేడ్వసాగెను. ముని యామె శిరస్సునఁ జేతితో నిమురుచు మాటి

మాటికి నిట్లనుచుండెను. "పుత్రి! ఏమనవలెను. మేమచ్చటి కప్పుడప్పుడు వచ్చుచుందుము." ఆతఁడు చూడఁగా శకుంతల శిఖ తడిసియుండెను. ఉంగరములుతిరిగిముడివేయఁబడియుండిన నామె వెండ్రుకలమీఁద జలబిందువులుండెను. అవి తన నేత్ర బిందువులనుసంగతి మునికిఁ దెలియదు.

ఏదోవిధముగ శకుంతల నాతఁడు వేఱుజేసెను పిల్లి లేడ్చుచుండిరి. హరిణములు వెనువెనుకనే పరుగిడుచుండెను అవి శకుంతల వస్త్రములను బండ్లతో బట్టుకొనెను. పక్షుల చిన్న చిన్న పిల్లలామె పాదములకడకు బోవుచుండెను. తపస్వి నులు కన్నీరును దుడుచుచు శకుంతలను బట్టుకొనిపోవుచుండిరి కణ్వమునియును నాశ్రమ ద్వారమునఱకామెను బంపుటకుఁ బోయెను. ఆశ్రమమున నిదివఱకే మాలినీనది ప్రవహించు చుండెను. నేఁడింకొక కరుణాస్రవంతియును నకస్మాత్తుగఁ బ్రవ హించుచుండెను. దానిప్రవాహమువ నాశ్రమవాసులందఱును గొట్టుకొనిపోవుచుండిరి. అందఱి నేత్రములనుండియును నశ్రు వులు ప్రవహించుచుండెను. అందఱును విషణ్ణవదనముతో శకుంతల ననుగమించుచుండిరి.

ఆశ్రమద్వారముననిలుచుండిమునియిట్లనెను:- "అమ్మా! దశదిక్పాలకులునిన్నురక్షించెదరుగాక! వనములందలిఅధిష్ఠాతృ దేవతలు నీకనుకూలురగుదురుగాక! నీకు మార్గశ్రమ కలుగ కుండుగాక! దేవతలు నీకు మంగళప్రదులగుదురుగాక! మంచిది పోయిరమ్ము" అనిపలికి మరల తన పిల్లల శిరస్సును మూర్కొ

నెను. పాదములమీఁదఁ బడిన సర్వదమను నెత్తుకొని మాటి మాటికి నాతని అరుణారుణముఖమును ముద్దిడుకొనెను. ఆసమయమున నందఱకును దుఃఖ ముప్పొంగెను. ప్రసంగ మత్యంత కారుణికమగుటను గాంచి ముని వెనుకకు తగ్గెను. శకుంతల మాటిమాటికి వెనుకకుఁ దిరిగి చూచుచు వెడలుచుండెను. ఆమెకాళ్ళు ముందుకు పోవుచుండెను. దృష్టి వెనుకకుండెను. మనస్సొక్కొక్కప్పుడాశ్రమమునకుఁ బరువిడును. ఒక్కొక్కప్పుడు రాజభవనమునకుఁ బోవును. ఈ విధముగా నామె అనేక స్మృతుల భారమును మీఁద నెత్తుకొని పోవుచుండెను. శకుంతల దూరము వెళ్ళుటనుగాంచి ముని తిరిగి ఆశ్రమమునకు వచ్చెను. ఆ యాశ్రమమందు తపస్వులును, దపస్వినులు నుండిరి. వారిప్పుడు నుండిరి. కేవలమొక్క శకుంతలయే వెళ్ళినది? ఆమె కారణమున నాశ్రమమంతయును శూన్యముగఁ గనఁబడుచుండెను. మునికి అడుగడుగునకును శకుంతలా స్మృతియే జాగృతినిఁ జెందెను. ఈ లత నామె యెంతగాఁ బ్రేమించెడిది! ఈ యశోకము నామె తన పుట్టిన పండుగు దినమున స్మృతిగ నాటినది. ఈ కమలములను దెచ్చుటకామె యెంతగా బలవంత పెట్టినది! ఈ హరిణము కొఱకామె నాచే నెన్ని కసురులను జీవాట్లను దినినది! అయినను నామె దీనినిఁ దనదగ్గఱనే పరుండఁబెట్టుకొనుచుండెడిది. ఆమె పక్షులకు నీరు పట్టుటకై చెట్టుమీఁద నీపాత్రను బంధించినది. నిత్యనియమముగ నామె దీనియందు నీరు పోయుచుండెడిది. వృక్షములమీఁద నీరు పోయించిన తరువాతనే ఆమె అన్నము తిను

చుండెడిది. ఈ పుష్పముల నామె యెంతటి ఆనందముతోడను ఉల్లాసముతోడను గోసెడిది ఎట్టి సుందరములగు మాలల నామె నాపూజనము కొఱకు కట్టెడిది! ఆమె కూరగాయల నెన్నిటినో పెట్టినది. ఈవిధముగ నాలోచించుకొనుచుండ మునికి సాయంకాలమయ్యెడిది. నేఁటాతఁడు మాధ్యాహ్నిక కృత్యములను నొనర్పను లేదు, భోజనమును జేయలేదు. ఈ విధముగఁ జాలదినముల వఱకాశ్రమమందు శకుంతలా వియోగానుభవమే యుండెను.

ఇచ్చట మునియొక్క శిష్యులు సర్వదమన సహితముగ శకుంతలను దీసుకొని దుష్యంతుని రాజధానికిఁ జేరుకొనిరి. వారు నిర్భయులై రాజభవనములోనికిఁ బోయిరి. వారు రాజభటులద్వారా లోనికి వార్త నంపిరి.:- "మేము కణ్వమహర్షి ఆశ్రమమునుండి వచ్చితిమి. శకుంతలను రాజభవనమునకుఁ బంపిరమ్మని మాకు వారియాజ్ఞ. అందువలన మేము సర్వదమనునితోఁగూడ శకుంతలను దీసికొని వచ్చితిమి."

సమాచారమును వినఁగానే రాజు కేవలము మునులను బిలిచెను. మునులు రాజునకు జయకారములొనర్చి కులపతికి బదులుగ కుశలము నడిగి వృత్తాంతము నంతయును జెప్పుచు సర్వదమనునితోఁగూడ శకుంతల వచ్చిన వృత్తాంతమును గూడ చెప్పిరి. అంతయును విని రాజిట్లనెను :- "మునులారా! మీరుండుఁడు. రేపు రాజసభయందు దీని నిర్ణయమొనరించెదను. మీరు యజ్ఞశాలలో నివసించి భోజనమొనర్పుఁడు."

మునులిట్లనిరి :- "శకుంతల పూర్ణగర్భిణి. నీ కాంతయగు నామెను నీవు యింట నేట్లు భోజనము చేయఁగలము? మీరు మీ యిష్టమువచ్చినప్పుడు నిర్ణయించుఁడు. మేము కులపతియగు కణ్వుని యాజ్ఞ ననుసరించి శకుంతలను రాజమహాలునకు మీ కడకుఁ జేర్చవలసియున్నది. మేమామె నిచ్చటికిఁ జేర్చితిమి. మీకు సూచననుగూడ చేసితిమి. ఇప్పుడు మేము వెళ్ళెదము" అని పలికి రాజునకు జయజయకారములొనర్చి శకుంతలను రాజమహాలునందే వదలి పాపము తపస్వులగు మునులచ్చట నుండివెడలిపోయిరి. వారు తిరిగివచ్చి కులపతియగు కణ్వునితో నిట్లనిరి:- స్వామీ! మేము యథావిధిగ మీ యాజ్ఞను పాలించితిమి సర్వదమనునితో శకుంతలను సకుశలముగ రాజభవనమున వదలి రాజుతో జతపరచి మేము తిరిగివచ్చితిమి." ఇది వినఁగానే కులపతికి మిక్కిలి సంతోషము కలిగెను.

సూతుఁడిట్లనెను :- "మునులారా! రాజమహాలునందు శకుంతలకెవరును సత్కారమొనర్పలేదు. ఆమె రాజద్వారమున నెదురుగా నొక స్థానమునఁ గూర్చుండి యుండెను.

## పతి శకుంతల నవమానించుట

223

శ్లో॥ యదా న జగృహే రాజా భార్యాం పుత్రావసింహితౌ,
శృణ్వతాం సర్వభూతానాం ఖే వాగాహాశరీరిణీ॥
మాతా భస్త్రా పితుః పుత్రో యేన జాతః స ఏవ సః।
భరస్వ పుత్రం దుష్యంత మావమంస్థాః శకుంతలామ్॥

శ్రీ భాగవతము 9 స్కం. 20 అ 20-21 శ్లో॥

వారట్లుచేయనిచో జనమతము వారికి విరుద్ధమై జనులలో వారి కాదరముండదు! లోకదృష్టిలో వారు పతనమగుదురు.

శ్రీ సూతుడిట్లనెను :- "మునులారా! కణ్వమహర్షి శిష్యులు వెడలిపోఁగానే శకుంతల తన సఖీసమేతముగ సమీపముననున్న నతిథిశాలయందు నివాసమొనర్చుచుండెను. ఆమె హృదయమునందనేకములగు నూహాపోహలు జరుగుచుండెను ఆమె ఆశ్రమమున స్వతంత్రముగఁ బెంపఁబడినది. వనమృగి వలె నామె జీవితమును గడిపెను. నేఁడామె రాజభవన పరిధిలో బంధింపబడుటను గాంచి తాను బంధితననుకొనుచుం డెను ఆమె రాత్రి యంతయును నేడ్చుచునే యుండెను. సర్వ దమనుఁడు శ్రమితుఁడగుటచే నిద్రించుచుండెను కాని శకుంతల కన్నులకు నిద్ర యెక్కడిది? ఆమె రాత్రియంతయును జింతా, ఉద్విగ్నతా, వికలతలలోనే గడిపెను.

ప్రాతఃకాలమయ్యెను. నిత్యకర్మలనుండి నివృత్తయై ఆమె సభాపాలకునితో రాజుతోనేదోనివేదించుకొనవలయునని సూచనను గావించెను. నిండుసభలోనికి అందఱముందు శకుం తల పిలిపింపఁబడెను. ఆమె లజ్జించుచు వివశయైఅందఱ సమ్ము ఖమునకు వచ్చెను. రాజామె నాదరింపను లేదు కూర్చుండుట కాసనమునీయ లేదు. ఆతఁడామె కుశలమునుగూడ అడుగ లేదు. అపరాధినివలె నామె నిలుచుండెను. అప్పుడు రాజపరిచితుని వలె నిట్లడిగెను:- "నీవెవరు? ఎచ్చటనుండి వచ్చితివి? ఎవరి పుత్రివి?"

శకుంతల యిట్లనెను:- "రాజా! మీరు నన్ను మరచితిరా? నేను కణ్వమహర్షియొక్క పెంపుడు పుత్రికను. మహర్షియగు విశ్వామిత్రునిద్వారా మేనకయందు నాకు జన్మ కలిగినది. నన్ను శకుంతల యందురు.

రాజు గంభీరుఁడై యిట్లడిగెను :- "నీవు కోరునదేమి? నీవు నాతో నేమైనఁ జెప్పుకొందువా? ఇచ్చటికేల వచ్చితివి?"

శకుంతల యిట్లనెను :- "మహారాజా! మీరీవిధముగ నపరిచితునివలె మాటలాడుచున్నారేల? కణ్వాశ్రమమందు మీరు నాతో నిమ్యక్తముగ వివాహమును గావించుకొంటిరి. మీ వీర్యముచే నాకీ పుత్రుఁడు పుట్టినాఁడు. కణ్వభగవానుని యాజ్ఞచే వీనినిఁ దీసికొని నేనిచ్చటికి వచ్చితిని, వీనిని మీరు యువరాజపదమందభిషిక్తుఁ జేయవలయును."

రాజిట్లనెను:- "ఓహో, నీవెచ్చటి మోసకత్తెవు వచ్చినావు! నీకెవరు బోధించి యిచ్చటకిఁ బంపిరి? నేనింతవరకుంను నిన్నెప్పుడును జూడనేచూడలేదు. నీవు నాకు భార్యవైనగుటకు నాకు లేదు."

ఇప్పుడు శకుంతలకు రెండు పెదవులదరెను. క్రోధమున నామె ముఖమెఱ్ఱనయ్యెను. ఆమె క్రుద్ధ సింహినివలె రాజువైపునకుఁ జూచుచుండెను. ఆమె యిట్లనెను :- "రాజా మీరు ధర్మాత్ములై యిట్టి అధర్మమును మాటలాడుచున్నారా! నన్ను మోసగించి ధర్మములు పలికి మీరు నన్నుఁ బాణిగ్ర

హాణ మొనర్చుకొని, నా కన్యాత్వమును భంగపఱచి, ధర్మశపథము కావించి, నా సంతానము రాజ్యాధికారమును వహించునట్లు మాట నిచ్చి వచ్చునప్పుడు చతురంగ సేనలను బంపునట్లాశ్వాసన మొసఁగి యిప్పుడిట్టి మోసపుమాటలను బలుకుచున్నారా? మీకును నాకును వివాహమైనపుడెవ్వరును లేరు, ఏకాంతమున జరిగినది, ఎవ్వరును జూడలేదు. కావునఁ దప్పించుకొనవచ్చునని మీరనుకొనుచున్నారు. అందఱ యంతఃకరణములందును నుండు సర్వాంతర్యామి అంతయును జూచుచున్నాఁడను సంగతిని మీరు జ్ఞాపకముంచుకొనుఁడు. ఆదిత్య, చంద్ర, పృథివీ, జల, తేజ, వాయు, ఆకాశ, గ్రహ, నక్షత్ర దేవతా; దిన, రాత్రి రెండు సంధ్యలు ఇవన్నియును శాస్త్రులొనర్చు మంచి చెడ్డ కర్మలకు సాక్షులు. వీరు చూచుచుందురు. ధర్మమునకు భయపడుఁడు. అధర్మము నాశ్రయింపకుఁడు."

రాజిట్లనెను :- "నీవు మంచి ధర్మచారిణివి! నీవు నీ పుత్రుఁడని యెవరినిఁ జెప్పుకొనుచున్నావో, ఆతఁడు క్షత్రియత్వమునుండి బ్రాహ్మణత్వమును బొందుటకుఁ బ్రయత్నమొనర్చును. నీవు తల్లియని యెవరినిఁ జెప్పుచున్నావో ఆమె స్వర్గమందలి వారవనిత. ఆమెకొక్క పతి యుండఁడు. ఇట్టిగాని పుత్రికవా నన్నెఱిఁగినదానవు. నీవాతపస్వులు ధరించు వల్కల వస్త్రములను ధరించినావే. దీనిలో నీవు నీ పాపమును దాచుకొనఁదలంచుచున్నావా? ఈ పిల్లవాని నెచ్చటనుండియో తీసి

కొనివచ్చి నా కొడుకని చెప్పుచున్నావా! అందఱ ముందిట్టి యసత్యవాక్యములను బలుకుటకు నీకు సిగ్గు వేయుట లేదా?"

శకుంతల ధైర్యముతో నిర్భయయై యిట్లనెను:- "రాజా! ఒక్క అబలయెడల నిట్టి యత్యాచారమును గావించుచుఁ దన ధర్మపత్నిని వారవనిత యనుచుండిన మీకు లజ్జ రావలయును. మహారాజా! నేను పుట్టినప్పటినుండియు ధర్మాచరణము కావించినాను. నేను పాపమెట్టిదో యెఱుఁగనే యెఱుఁగను. మీరే నాకు గాంధర్వవివాహము ధర్మమైనదని చెప్పితిరి. ధర్మమనుకొనియే నేను దాని కంగీకరించితిని. మీరు వెడలి వచ్చిన మీఁదట మా తండ్రి కణ్వమహర్షియును దీనిననుమోదించినాఁడు. "నీ పుత్రుఁడు సమస్త భూమండలమునకును జక్రవర్తి కాఁగలఁడని అతఁడాశీర్వదించినాఁడు. తపఃపూతుఁడగు బ్రాహ్మర్షి వాక్యములు మిథ్యలు కాఁగలవా? ధర్మావతారా! నేను మరలఁ జెప్పుచున్నాను. "నేను మీకు ధర్మపత్నిని. ఈతఁడు మీకు న్యాయతః పుత్రుఁడు. వీనిని స్వీకరింపుఁడు. వడి లోనికిఁ దీసికొని ముద్దిడుకొనుఁడు. ఈతఁడెంత సేపటినుండియో మీవైపున కుతూహలభరిత దృష్టితోఁ జూచుచున్నాఁడు".

అంత రాజిట్లనెను:- "తాపసీ! నాకు నీ వచనములందు సత్యము గోచరించుటయే లేదు. నేనిదివరకు నిన్ను జూఁడనే చూడలేదు. అట్టి స్మరణమును నాకు గలుగుట లేదు. నీవు ధర్మాచరణవైనను నధర్మాచరణవైనను నాకు నీతో నేమియును బ్రయోజనము లేదు. శాఖలవలెఁ బెద్ద పెద్ద భుజములు

గల నీ పుత్రునితోడను మాకేమియును బ్రయోజనము లేదు. నీ యిష్టమువచ్చిన చోటునకుఁ బోవచ్చును. ఉండిన నుండ వచ్చును." ఇట్లు పలికి రాజు మెదలకుండెను

అంత నేడ్చుచు శకుంతల యిట్లనెను - "రాజా! ఇట్లు తెలియనివానివలె నటింపకుఁడు. ఆశ్రమమందలి ఆ విషయము లను మీరు మఱవఁజాలరు. నిద్రించినవానిని లేపవచ్చును; కాని మేల్కొనియు నిద్రను నటించువాని నెట్లు లేపఁగలము? మీరు మఱచియుండిన జ్ఞాపకము చేయువచ్చును. మీరెఱిఁగియు నెఱుఁగనివానివలె నటించుచున్నారు. రాజా! నేను మీకు భార్యను మీరు నా యుదరమున వీర్యమును స్థాపించితిరి. ఈ పుత్రుఁడు మీవాఁడే! పురుషుఁడు తన వీర్యరూపమున స్త్రీ గర్భమున బ్రవేశించునని ఋషుల వచనములు. అందువలననే పుత్రవతియగు స్త్రీకి జాయా యను పేరు వచ్చినది. పుత్రవతి యగు స్త్రీని నెన్నఁడును నవమానమొనర్పరాదు. ఆమె నెల్ల ప్పుడును దల్లితో సమానముగ నాదరమొనర్పవలయును. మహారాజా! మీరు నాకులమునుగూర్చి దోషమేల నెన్నెదరు! కుశికవంశము క్షత్రియ వంశములలో శ్రేష్ఠమైనది. విశ్వామి త్రుఁడు మునులందఱిలో శ్రేష్ఠుఁడు. స్వర్గమందా ఋగురే ముఖ్యులగు నప్సరసలు కలరు. ఊర్వశి, పూర్వచిత్తి, సహజన్య, మేనక, విశ్వాచి, ఘృతాచి. వీరిలో మేనక బ్రహ్మనుండి ఉద యించినది అందువలన నామె సర్వశ్రేష్ఠగా నెన్నఁబడుచున్నది. ఆమె ఉదరమునుండియే నేను బుట్టినాను. పూర్వజన్మమున

నేనేదో ఘోరపాపమును జేసియుందును. అందుకనియే మా తల్లి నన్ను హిమాలయపర్వతసానువునందు పరుల సంతానము వలె విడిచి స్వర్గమునకుఁ బోయినది. బాల్యకాలముననే నేను నా తల్లిదండ్రులచేఁ బరిత్యజింపఁబడినాను. ఇప్పుడు యువావస్థ యందు నన్ను నా పతియును ద్యజించినాఁడు. నా నొసట దుఃఖము వ్రాయఁబడియున్నది దానిని జీవితాంతమునఱకు భోగించెదను కాని మీరీ బాలుని స్వీకరింపుఁడు. వీనిని మీ రాజ్యమున కధికారిగా నొనర్పుఁడు."

రాజిట్లనెను:- "తాపసీ! నీవెంతో సిగ్గు లేనిదానవుగాఁ గనఁబడుచున్నావే. ఎవరి వీర్యమునకో పుట్టినవానిని మాటి మాటికిని నాపుత్రు డనుచున్నావే. నీకు సిగ్గుండవలసినది. నేను నీతో నొక్కసారి చెప్పితిని మాటిమాటికిని జెప్పితిని నాకు నీతోడను నీ పుత్రునితోడను నే ప్రయోజనమును లేదు. నీవిచ్చటినుండి వెడలిపొమ్ము."

ఆత్మగ్లాని కారణముగ శకుంతల శిరమును వంచుకొని నది. ఆమె నేత్రములనుండి నిరంతరమశ్రువులు ప్రవహించు చుండెను. శరీరము క్రోధ లజ్జాకారణమునఁ గంపించుచుండెను ఆమె రాజుయొక్క యీ దుర్వ్యవహారమును సహింపఁజాలక పోయెను. ఆమె యిట్లనెను:- "మహారాజా! నేను వెడలిపోవు చున్నాను. ఏ ముఖమును బెట్టుకొని నేనికఁ గణ్వాశ్రమము నకుఁ బోవుదును? నాకు బాధ కలుగుచున్నది. అయినను నాతఁడు నా తండ్రి. నన్ను బ్రతికియున్నంతవఱకు పోషింపఁ

గలడు. మీరీ పుత్రుని నేడు స్వీకరింపకున్నను నీ సమస్త భూమండలమునకీతఁడొకనాఁడు సామ్రాట్టు కాగలఁడు. దేవతల యొక్కయు ఋషులయొక్కయు వచనము లెన్నఁడును వ్యర్థములు కావు. మంచిది భగవంతుఁడు మీకు కళ్యాణమొనర్చుఁ గాక.” ఇట్లు పలికి శకుంతల వెడలిపోయెను.

సూతుఁడిట్లనెను :- “ మునులారా! శకుంతల పోఁగానే ఆకాశమునుండి ఒక శబ్దము వెలిగెను. ఆ వాక్కు ఎక్కడనుండి వచ్చుచున్నదో యెవరికినిఁ దెలియదు. ఆకాశవాణి యిట్లనెను:- “ రాజరాజేశ్వరా! దుష్యంతా! తల్లి ఒకవిధముగ చర్మపు సంచియే: ఎవరైనను చర్మపుపెట్టెలో ద్రవ్యమును బెట్టిన నా ద్రవ్యము చర్మపు పెట్టెదిగాక దానిలోఁ బెట్టినవానిదెట్లగునో అట్లే పురుషుడు తన పత్నియొక్క ఉదరమునఁ దన వీర్యమును స్థాపించి స్వయముగ నామె ఉదరమున నుత్పన్నమగును. అందువలన పుత్రవతియగు పత్ని జాయా యనఁబడినది. ఆత్మచే నుత్పన్నమగుటచేఁ బుత్రునకును దండ్రికిని భేదమేమి యునులేదు. తండ్రి నూతన రూపమును ధరించి పుత్ర రూపమున బరిణమించును. ఈ పుత్రుఁడు నీవాఁడే. నీవితనిఁ బోషించుము. సతీసాధ్వియగు నిట్టి సతళ ధర్మపత్నినిఁ బరిత్యజించుట సర్వదా అనుచితము. ఈతఁడు సాధారణ బాలకుఁడు కాఁడు. ఈతఁడు నీ తరువాత సమస్త భూమండలమునకు సామ్రాట్టు కాఁగలఁడు. రాజా! నీవు మాయాజ్ఞచే వీనిని భరణ పోషణము

కావించుచున్నారు కావున వీనిని భరతుఁడందురు. ప్రపంచ మందీతఁడు భరతుఁడను పేరఁ బ్రఖ్యాతినిఁ జెందును.'' ఇట్లు పలికి ఆకాశవాణి శాంతించెను!

అప్పుడు రాజు తన మంత్రి పురోహిత సభాసదులతో డను నితర ప్రజలతోడను నిట్లనెను:- "మీరందఱీ యాకాశ వాణిని వింటిరి. వీఁడు నా పుత్రుఁడేనని మీకిప్పటికి విశ్వాసము కలిగియుండవచ్చును. ఈతఁడు నా వీర్యముచేతనే యుద్భవించి నాఁడని నాకు బాగుగాఁ దెలియును.''

అంతఁ బురోహితుఁడిట్లనెను :- "మహారాజా! అయితే మీరు శకుంతలాదేవి నేల స్వీకరింపలేదు? నీ వడిలోనికి నీ పుత్రునిఁ దీసికొని నీవేల ముద్దిడుకొనలేదు?''

రాజిట్లనెను:- "నాకును శకుంతలకును వివాహము ఏకాంతమున జరిగినది. ఈ సంగతి నెవరును నెఱుఁగరు. నేను వెంటనే శకుంతలను, కుమారుని స్వీకరించినచో మీరందఱును నాపై సందేహమును జెందెడివారే. లోకులనేకములగు నపవా దములను బెట్టెడువారే. ఈ దృష్టిచేతను లోకదృష్టిచేతను నీ నా సంతానము శుద్ధముగ నెన్నఁబడదు. ఇప్పుడు మీయందఱి సమ్ముఖమున నాకాశవాణి సాక్ష్యమిచ్చినది.''

అందఱు నేక కంఠమున నిట్లనిరి:- "మహారాజా! శకుం తలా గర్భమున నుత్పన్నుఁడైన పుత్రుఁడు నిర్దోషి. నీవాఁడే. చూడఁగా మీరే బాలకుఁడైతిరని అనిపించుచున్నది.

ఈతని చేతిలోఁ జక్రచిహ్నము కలదు. ఈతఁడవశ్యమాసము ద్రాంతరము పృథివి నేలఁగలఁడు. మీరీతని స్వీకరించి యువ రాజు నొనర్పుఁడు."

అందఱి యంగీకారమును గమనించి సామ్రాట్టు శకుంతలా సహితముగ సర్వదమనుని వెంటనే బిలిపించెను. వానినిఁ వడిలోఁ గూర్చుండఁబెట్టుకొని వాని ముఖమును ముద్దుబెట్టుకొనెను. పుత్రస్పర్శచే నాతని రోమరోమములు నిక్కబొడిచెను. ప్రపంచమందెన్ని సుఖస్పర్శవస్తువులున్నవో వాని అన్నిటిలోను పుత్రాంగస్పర్శ సర్వశ్రేష్ఠమైనది. నేఁడు మహారాజు తాను కృతకృత్యుఁడననుకొనుచుండెను. ఆతఁడు తాను పితృఋణవిముక్తినిఁ జెందితిననుకొనుచుండెను. తరువాత నాతఁడు పురోహితునిఁ బిలిచి శాస్త్రోక్తవిధిచేఁ బితరులకు శ్రాద్ధాదుల నొనర్చెను. బ్రాహ్మణులు స్వస్తివాచనము లొనరించిరి. గంధర్వులు మంగళగానములొనరించిరి. సూత మాగధ వందీజనము స్తుతిపాఠములొనర్చిరి. వినయ వచనములు పలికిరి. మిక్కిలి యుత్సాహముతో రాజు పుత్రుని యువరాజపదమున నభిషిక్తునిఁ గావించెను."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఆ సర్వదమనుఁడే ప్రపంచమున భరతుఁడను పేరఁ బ్రసిద్ధినిఁ జెందెను. భరతునిఁ బోలిన దాత, యశస్వి యింకొక చక్రవర్తి యెవఁడు కలఁడు? ఈతని నామముననే యీదేశము భరతఖండమనఁబడెను.

# దుష్యంత పుత్రుఁడు భరతుఁడు.

౨౨౮

శ్లో॥ భరతస్య మహత్కర్మ న పూర్వే నా పరే నృపాః।
నైవా పుర్నైవ ప్రాప్స్యంతి బాహుభ్యాం త్రిదివం యథా॥
శ్రీభాగవతము 9 స్కం. 20 అ. 29 శ్లో॥

కం॥ రెండవ హరికిప్రియ ధరణీ
మండల భారంబు నిజ సముంచిత బాహా
దండమున నిలిపి తనకును
ఖండనమున నెదురు లేక భరతుం డొప్పెన్॥

శ్రీమదాంధ్రభాగవతము,

ధార్మిక సంస్కారము సంగముచేతనే పడుచుండును. బాల్యకాలమం దెట్టి వాతావరణమునఁ బెరుగునో అట్టి ప్రభావమే సాధారణముగ వాని జీవనమందు పడును. తల్లి దండ్రుల యొక్క ఆలోచనములు పరిసరములందలి సంస్కారముద్ర బాలకుని కోమల స్వభావమున నశింపకుండ పడిపోవును. అది జీవితాంతమునఆరిపోదు. అందుకనియే బాల్యకాలమునుండియే పూర్వకాలమునఁ బుత్రుని గురుకులమునకు వదలివచ్చెడువారు. దానిమూలమున నచ్చటి ధార్మికతయు నిర్మల వాతావరణము నిరాడంబరత్వముయొక్క ప్రభావము పడును. ఏ మహాపురుషు లరణ్యములందును గ్రామములలోను బుట్టిరో వారు బాగుగాఁ బరపీడ నెఱుఁగుదురు; ఏలననఁగా దానిని వారు సహించిరి. వారి కాయనుభవము కలదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఆకాశవాణిని వినియు ప్రజలయొక్క అభిప్రాయము ననుసరించియు దుష్యంతుఁడు శకుంతలను గ్రహించెను. ఆమెను సామ్రాజ్ఞిగానొనర్చి పుత్రుని యువరాజపదమున నభిషిక్తుఁ గావించెను. శకుంతల రాణి కాఁగానే ఆమె ఒకదినముం రాజుతో నిట్లనెను:- "మహారాజా! మీరు నిజముగ నా విషయములను మఱచితిరా? మీకును నాకును జరిగిన వివాహము స్మరణమునకు రాలేదా?"

రాజు నవ్వుచు నిట్లనెను:- "ఎక్కడనైన వివాహ విషయమును మఱచెదరా? నాకన్ని విషయములును బాగుగా జ్ఞాపకమున్నది. నేను నీతోఁ జేసిన ప్రతిజ్ఞయును అక్షరశః జ్ఞాపకమున్నది."

శకుంతల యిట్లనెను :- " అయితే మీరెఱిఁగియును నెఱుఁగనివానివలె నుంటిరేల? మీరు నన్ను నా పుత్రునిఁ దిరస్కరించితిరేల!"

అత్యంత స్నేహముతో రాజిట్లనెను:- "ప్రియా! సంభావిత పురుషులందఱు సమ్మతిని సహయోగమును సహానుభూతిని వెంటఁ గొనిపోవలెను. నాకును నీకును వివాహమేకాంతమున జరిగినది. నేను నిన్నట్లే గ్రహించి యుండినచోఁ బ్రజలందనేక ప్రవాదములు బయలుదేరును. రాజునకీమె భార్య కాదు, ఈతఁడు పుత్రుఁడును గాఁడు; సుందరినిఁ గాంచి రాజెవతెనో యుంచుకొనినాఁడందురు. కొందఱు రాజునకీమెతో నసుచితమగు సంబంధము కలదు, ఈతఁడు వ్యభిచార జనిత సంతాన

మందురు. ఇంక నెన్నెన్నో విధములఁ ననుచుందురు. ఈ ప్రపం
చము బహుముఖమైనది. పరఛిద్రాన్వేషణమందు లోకులకు
స్వాభావికప్రవృత్తి యుండును. నా సత్యమెట్లు ప్రకటమగునా
యని నేను యోచించుచుంటిని. ఇప్పుడండఱ సమ్ముఖమున
నాకాశవాణి పలికినది. మన యిద్దర సంబంధము ధార్మిక సంబం
ధమేననియు నీ పుత్రుఁడు ధర్మతః నాకును దనయుఁడనియు
నందఱును గ్రహించిరి. ఇప్పటికి నీవు నేను ఇద్దరమును నిర్దో
షులమని తేలినది. ఇట్లు చేయకుండినచో నాకును నీకును నిద్ద
రకును లోకమున నపవాదము వ్యాపించెడిది. అందువలన నేను
నీయెడల నిట్టి స్నేహహీనమగు తుచ్ఛవ్యవహారమును జరిపితిని
నీవు నాకు ధర్మతః మిక్కిలి ప్రియపత్నివి. నాయొక్క యిట్టి
దుర్వ్యవహారముపై నీవు దృష్టి నుంచకుము. నేను నీ మేలు
కొఱకే యిట్టి కఠోరత్వమును బూనితిని.

ఇది వినఁగానే శకుంతలయొక్క రెండు నేత్రములు
ప్రేమాశ్రువులచే నిండిపోయెను. ఆమె తన పతి పాదముల
మీఁదఁ బడి యేడ్చుచు నిట్లనెను — "ప్రాణనాథా! మీరిది
యంతయును నాహితముకొఱకే యొనర్చితిరి; కాని మందమతి
నగు నబలనగుటచే దీనిని నేను గ్రహింపఁజాలకపోయితిని. నేను
కోపమున మిమ్మనరాని మాటలనంటిని. నేను నా ప్రాణనాథ
పరమేశ్వరున కవమానమును గావించితిని దీనిచే నేనే నరకము
లకుఁ బోవలసివచ్చునో?"

ప్రియమగు దన పత్నిని బలపూర్వకముగఁ బాదముల నుండి లేవఁదీసి కౌగిలించుకొని మహారాజిట్లనెను:- ప్రియా! నీవు పలికినదంతయును సతీసాధ్వుల కనురూపముగ నేయున్నది. ఇంతటి కఠోరత కిట్టి వాక్యములు పలుకుటకు నీ కధికారము గలదు ఇంకను నీకు దుఃఖము కలుగుచుండినచో నేను నీయా వాక్యముల నన్నిటిని హృదయపూర్వకముగ క్షమించుచున్నాను. నీవు ప్రసన్నవగుము. ఆమాటలన్నిటిని మఱచిపొమ్ము ఆ వాక్యములు యదార్థములు కావు. నాటకమునందువలె నభినయమే. అది స్వప్నములోని సంవాదమువంటిది. ఇప్పుడు నీవు నా వెంటనుండి సమస్త సాంసారికసుఖములను భోగింపుము. నీపుత్రుఁడు యువరాజపదమున నభిషిక్తుఁడగుటను గాంచుము."

ఈవిధముగ వారిద్దరును ప్రేమ విషయములను గూర్చి మాటలాడుకొనఁగా నిద్దర హృదయములానందముచే నిండిపోయెను. ఇద్దరును సుఖపూర్వకముగ సాంసారిక భోగములను భోగింపసాగెను. ఒక్కొక్కప్పుడు రాజు శకుంతలను రథము మీఁదఁ గూర్చుండఁబెట్టుకొని కణ్వాశ్రమమును జూపింపఁబోవుచుండును. ఆశ్రమమునకుఁ బోయి శకుంతల ఇదివఱకువలెనే అందఱను స్నేహపూర్వకముగఁ గలిసికొనెడిది. ఆమెకు రాణినైతినను నభిమాన మిసుమంతైనను లేదు. ఒక్కొక్కప్పుడు రాజు కణ్వమహర్షినిగూడ పిలుచుచుండును. కాలాంతరమున భరతుఁడు పెద్దవాఁడు కాఁగానే మహారాజు రాజ్యమునంతను నాతనికప్పగించి శకుంతలతోఁగూడ తపంబొనర్చుటకై వన

మునకుఁ బోయెను. అచ్చట వానప్రస్థ నియమములను పాలిం చుచుఁ బరమపదమును బొందెను.

దుష్యంతమహారాజు తరువాత నీ సప్తద్వీపవతియగు వసుంధరను దుష్యంత పుత్రుఁడగు భరతుఁడు రాజయ్యెను. అతఁడు గొప్ప ధర్మాత్ముఁడు. అతనిని ఋషులు భగవంతుని అంశావతారముగఁ జెప్పిరి.

భరతమహారాజు కుడిచేతియందు చక్ర చిహ్నమును చరణములందు పద్మకోశ చిహ్నములను సుశోభితములై యుండెను? అతనినిఁ బృథివియందలి సమస్త రాజులును బ్రాహ్మణులును విద్యుక్తముగ రాజాధిరాజపదమందభిషిక్తుఁగావించిరి. అంగిరుని పుత్రుఁడగు మమతను నాతని ధర్మపత్నియగు మమతకును బుట్టిన దీర్ఘతమమహర్షిని నాతఁడు తన పురోహితునిఁగ నొనర్చుకొనెను. సమస్త భూమండలమాతని యధీనమున నుండెను ఇప్పుడాతఁడు తన వైభవము నెట్లు ప్రకాశింపఁజేయఁ గలఁడు. ఎవరిమీఁద తనశక్తినిఁ జూపఁగలఁడు! ఇట్లనుకొని ఆతఁడు ధర్మోత్సాహ మొనర్చుటయే తన కర్తవ్యమనుకొనెను. ఆతఁడు యజ్ఞము తరువాత నింకొకయజ్ఞమును జేయుచుండెను మొదటగా నాతఁడు గంగాతటమందశ్వమేధయజ్ఞము నారం భించెను. మొదట నొకటి చేసెను, తరువాత రెండవది, తరు వాత మూఁడవది. ఈవిధముగ నాతఁడేఁబదియైదు యజ్ఞములు నొనర్చెను. గంగాతటమున యజ్ఞముల నొనర్చిన మీఁదట నాతఁడు యమునాతటమున యజ్ఞవిస్తారమును గావించెను.

డెబ్బది యెనిమిది యజ్ఞముల నాతఁడు కాళిందీ కులమునందొనర్చెను. ఈ యజ్ఞములందెంత దాన మొసంగినదియు, నెంత ధనమును బంచినదియు లెక్క లేనే లేదు. ఆతని యగ్ని చయనము మిక్కిలి వైభవముగ జరుగుచుండెడిది. అగ్ని చయన కర్మమందు సర్వప్రథమమున బ్రాహ్మణులకు గోదాన మొసంగఁబడెను. ఆతఁడు యజ్ఞములలో వేలకొలఁది బ్రాహ్మణులను వరించి, అందఱకును నొక్కొక్కనికి నొక్కొక్క బద్వగోవుల నొసంగు చుండెడివాఁడు.

శౌనకుఁడిట్లడిగెను :- "సూతా ! ఒక బద్వమందెన్ని గోవులుండెను."

సూతుఁడిట్లనెను :- స్వామీ! పదునాలుగు లక్షల గోవులలో నూట యేడవ వంతునకు బద్వమని పేరు. దానిలో పదుమూఁడు లక్షల యెనుబది నాలుగు వేల గోవు లుండును. ఒక్కొక్కచోట నిట్లుకూడ చెప్పఁబడినది. గోవుల మంద మీఁదకు వేగమున నొక కఱ్ఱను విసరిన నది యెన్ని గోవులను దాటునో దానికి బద్వమని పేరు. స్వామీ! ఆదినములలో గోవులే ధనము. ప్రతి కర్మమందును బ్రథమమున గోదానము చేయఁబడుచుండెడిది. తరువాతనే మిగిలిన కర్మలొనర్పఁబడు చుండెడివి. భూమండలములోని రాజులందఱును నాతని యైశ్వర్యమును గాంచి ఆశ్చర్యచకితులగునట్లుగ భరతుఁడు యజ్ఞములందు తన యైశ్వర్యమును బ్రదర్శించెను దేవతల

యజ్ఞములందును నిట్టి యైశ్వర్యము కనఁబడలేదు ఆతఁడు తన యజ్ఞ యూపములందు ముప్పదిమూఁడు వందల గుఱ్ఱములను గట్టి అందఱను విస్మితులఁగావించెను. సోమయజ్ఞమందాతఁడు మష్ణారమను యజ్ఞకార్యమందాతఁడు బ్రాహ్మణులకు పదు నాలుగు లక్షల గజములను దానమొనర్చెను. ఆ యేనుఁగు లట్టిట్టివికావు, అవి పర్వతములవలె బలసి యుండెను. అవి నల్లగ నుండెను. దంతములు తెల్లగ నుండెను. అవి సువర్ణాభరణములచే నలంకరింపఁబడి యుండెను. వానిపైన సువర్ణముతోఁ బనిచేసిన పట్టు గవిసెనలు వేయఁబడియుండెను. అవి బంగారు గొలుసులచేఁగట్టఁబడి యుండెను. అవి నడచుచుండఁ గదలుచుండిన పర్వతములవలె నుండెను. ఆతని కర్మలన్నియు నద్భుతములు. యజ్ఞములలో నాతఁడొసంగిన దాన ధర్మముల నింకెవఁడును నొసంగలేదు.

ఆ సమయమునఁ బృథివియందు ధర్మ విరోధులును, బ్రాహ్మణ ద్వేషము కలవారునగు కిరాత, హూణ, యవనాంధ్ర, కంక, ఖశ, శకాది రాజులు చాలమంది యుండిరి. వారి నందఱను భరతుఁడు నాశనమొనర్చెను. ఈ విధముగ నాతఁడు పృథివిని ననార్యాధిపత్యము నుండి యున్ముక్తులనొనర్చెను ఆతని రాజ్యమందెవరును ధర్మవిరోధులు, నాస్తికులు, నీచరాజులులేరు. ఆతని రాజ్యకాలమున వసువులు పృథివిని వదలి పాతాళమునకుఁ బోయిరి. పాతాళ

మున వారు స్వర్గములో వలె సుఖభోగము లనుభవించుచు సుఖముగ నివసించుచుండిరి. భరతునకుం బూర్వము అసురులు దేవతల మీంద దండెత్తి చాలమంది దేవాంగనలను స్వర్గము నకు బట్టుకొనిపోయి రసాతలమునకుం గొనివచ్చిరి. పాపము వారు బందీలవలె రసాతలమందు దినములను గడుపుచుండిరి. భరతుండు రసాతలమునకు దండెత్తి వారిని జయించి ఆ దేవాంగనలను దిరిగి తీసుకొనివచ్చెను.

మహారాజగు భరతుండు యథేచ్ఛముగ సాంసారిక సుఖముల ననుభవించెను. ఇచ్ఛానుసారముగ దాన ధర్మము లొనర్చెను. సమస్త యాచకుల మనో వాంఛలను నెరవేర్చెను దివ్యైశ్వర్యయుక్తములగు ననేకములగు ననుపమ యజ్ఞముల నొనర్చెను; దేవతలను హవ్యములచేతను, పితరులను గవ్యములచేతను, అతిథి, అభ్యాగత, విప్ర, గురుజనాశ్రితులను దాన మానములచేతను సత్కారములచేతను సంతుష్టులను గావించెను. లోకపాలురవలె ననుపమైశ్వర్యముల నుపభోగించెను. ఆ సార్వభౌమ సామ్రాట్టు సమస్త సుఖసామగ్రులను సంగ్రహించి, వానిని యథాయోగ్యముగ వితరితము కావించెను. ఈ విధముగ నాతండిరువది యేడు వేల వర్షముల వర కాతండు వసుంధరను ధర్మపూర్వకముగం బాలించెను చివర కాతనికి విషయవైరాగ్యము కలిగెను. ఆతనికి సార్వభౌమ సామ్రాట్టుయొక్క సమస్త సుఖసంపత్తియును, అప్రతిహత

అ[illegible] శాసనమును, ప్రియపదార్థముల కంటెను ప్రియమైన వ[illegible]ు నాతనికి మిథ్యగను, నశ్వరముగను, క్షణభంగురము[illegible] గనఁబడెను. ఆతఁడిట్లనుకొనెను :- "విషమోపభోగ[illegible] సుఖము లేదు." అని యిట్లు నిశ్చయించుకొని ఆతఁడు [illegible]మస్త సాంసారిక సుఖముల నుండి యుపరతినిఁ బొందెను

సూతుఁడిట్లనెను :- "మునులారా! భరతుని తరువాత నాతని దత్తపుత్రుడు వితథుఁడు రాజయ్యెను."

శౌనకుఁడిట్లనెను :- "సూతా! ఈ వితథుఁడెవఁడు? ఎవని పుత్రుఁడు? భరతుఁడాతని దత్తపుత్రునిఁగా నేలఁ గైకొనెను? కృపతో మాకీ సమాచారమంతయును జెప్పవలయును."

ఇది విని సూతుఁడు వినవట్లిట్లనెను :- "స్వామీ! పెద్దలకు పెద్దవిషయములుండును. వితథునిఉత్పత్తి విషయమును మీరడుగకుండుట మంచిది. ఆతని యుత్పత్తి అస్తావిస్తముగ నైనది. మంచిది. నేను భరతవంశ కథను జెప్పవలెను గదా! ఆ ప్రసంగమున భరత పుత్రుఁడగు వితథుని యుత్పత్తియును సంక్షేపముగఁ జెప్పెదను. ఇప్పుడు మీరు భరత వంశము కథను వినుఁడు."

# భరతవంశకథ

## ౭౭౫

శ్లో॥ వితథస్య సుతో మన్యుర్బృహత్క్షత్రో జయస్తతః ।
మహావీర్యో నరో గర్గః సంకృతిస్తు నరాత్మజః ॥

(శ్రీభాగ. ౯ స్కం. ౨౧ అ. ౧ శ్లో॥)

వితథంబైన భరత వంశంబునకు నా భరద్వాజుండు వంశకర్తయగుటం జేసి వితథుండ నంబరఁగె నా వితథునికి మన్యువు, మన్యువునకు బృహత్క్షత్రజయ మహావీర్య నర గర్గులను వారేవురు సంభవించి రందు నరునకు సంకృతి యుదయించెను.

(శ్రీమదాంధ్ర భాగవతము)

దేవత కానిండు, మనుష్యుఁడు కానిండు, ఋషి, మును లలో, నెవ్వరైనఁగానిండు కామవేగము కలిగినచోఁ గర్తవ్యా కర్తవ్య వివేకమాతని కుండదు. ఎవనివద్ద విశేషముగ భోగ్య సామగ్రియుండునో, వానికి లేమి సంగతి సహజముగఁ దెలి యదు. ఖాద్యవస్తువులు విపుల పరిమాణమున నున్నప్పుడు మందాగ్ని యుండును. ఆకలి యుండదు. అన్నక్షయను కలిగిననాడు జఠరాగ్ని పెరుగును. ఆకలి యెక్కువగును. ధనికులు నిర్ధనులస్థితి నెఱుఁగజాలరు విషయాసక్తులు, రాత్రిం దివములు విషయలిప్తులైనవారు కామవేగము నేమి నెరుగగలరు వారు కుక్క, పంది, పావురము మొదలగు వానివలె రాత్రిం దినములు విషయభోగములందే సంలగ్నులై యుందురు.

విషయములకు దూరముగ నుండి ఇంద్రియములను జయించు టకుఁ బ్రయత్నించువారు మాత్రమే విషయ సాన్నిధ్యవాసన యొంతటి ప్రబలముగా నుండునో యెఱుఁగఁగలరు. క్షుద్రులు తమ పాపములను దాచుకొందురు. మహాపురుషులు తమ నిర్బలతను సందర సమ్ముఖమునఁ బ్రకటించెదరు, ఇదియే వారి మహత్త్వము.

శ్రీసూతుండిట్లనెను :- "మునులారా! దుష్యంతుని పుత్రుఁడగు రాజర్షి భరతునకు ముగ్గురు భార్యలుండిరి. వారు ముగ్గురును విదర్భ మహారాజు పుత్రికలు. రాజు వారిని మిక్కిలి ప్రేమించుచుండెను. వారి ముగ్గురకును ముగ్గురు ముగ్గురు పుత్రులుదయించిరి. కాని వారందఱను రాజు తన కనురూపులుగ భావింపలేదు. ఎందులకో తెలియదు కాని వారు తన పుత్రులు కారని ఆతనికి సందేహము కలిగెను. రాజునకు తమ మీఁద సందేహము కలుగకుండ వలయునని రాణులకు మిక్కిలి భయము కలిగి తమ పుత్రుల నందరను వధించిరి. ఇప్పుడు రాజనపత్యుఁడయ్యెను. ఆతనికి సంతానము లేకుండెను. వంశపరంపర అక్షుణ్ణముగుటకు, ఆతఁడు మరుద్గణము నుద్దేశించి గొప్ప యజ్ఞమొనర్చెను. సంతానాపేక్షచే మరుత్తుల నాతఁడు యజించెను. మరుత్తులొక సుందర పుత్రునిఁ దెచ్చి రాజున కొసఁగెను. ఈ పుత్రుఁడు బృహస్పతి యన్న యగు ఉతథ్యుని పత్నియగు మమతా గర్భమున బృహస్పతి

వీర్యమున నుద్భవించెను. మమతకుఁ దనపతియగు నుతథ్యుని వలనఁ బుట్టిన పుత్రుఁడు బృహస్పతి శాపముచే నుదరము నుండియే యంధుఁడై పుట్టెను. అందువలన నాతని దీర్ఘతము డనిరి. బృహస్పతులకు బుట్టిన తనయుఁడిద్దరకేఁ గలుగుటచే ద్వాజుడనఁబడెను. మమత బృహస్పతితో నిట్లనెను:- "బృహస్పతీ! నీవీ ద్వాజుని భరించి పోషించుము." బృహస్పతి యిట్లనెను :- "నీవే ఆ ద్వాజుని భరించుము – అనఁగా భరణ పోషణమొనరించుము." ఇద్దరును నా పుత్రుని భరణ పోష ణము కావింపలేదు. పుత్రుఁడు మిక్కిలి సుందరుఁడు, పరమ తేజస్వి. అమోఘవీర్యుఁడగు దేవగురు బృహస్పతి వీర్యముచే నుత్పన్నమైనవాఁడు. ఇద్దరును భరణ పోషణము కావింప లేదు. ఇద్దరును నాద్వాజుని నరణ్యమున వదలిపోయిరి. మరుత్తులు వానిని భరించి పోషించిరి. అందువలన నాతఁడు భరద్వాజుఁడను పేరఁ బ్రసిద్ధినిఁ జెందెను.

మరుత్తులు సంతోషించి భరద్వాజునిఁ గొనిపోయి భరతున కొసంగిరి. రాజర్షియగు భరతుఁడిట్టి సుందర, తేజస్వి యగు సుతుని గాంచి పరమ ప్రముదితుఁడయ్యెను. అతఁడా తనినిఁ దన పుత్రునిఁగాఁ జూచుకొనెను, ఆతనికి వితథుఁడను నామమును గలదు. అన్యాయముగ జన్మించిన వానిని వితథుఁడందురు. ఇచ్చట భరతవంశము వితథము అనఁగా సముచ్ఛేదమగుచుండెను. ఆ సమయమున నీ పుత్రుఁడు

ప్రాప్తించెను. అందువలన నీతఁడు వితథుఁడను పేర బ్రసిద్ధిఁ గెంచెను. మహారాజగు భరతుఁడాతనినే రాజ్యాధికారిగా నొనర్చి యువరాజ్యాభిషిక్తు నొనర్చెను. ఆ పుత్రుని బొంది మహారాజు హర్షితుఁడయ్యెను, తరువాత నాతనికి రాజ్యము నొసంగి వనమునకుఁ బోయెను.

మహారాజగు వితథుఁడు తన పితృ పితామహుల నుండి వచ్చుచున్న రాజ్యమును ధర్మముగఁ బాలించెను. ఆతనికి మన్యువను పుత్రుఁడుదయించెను శరీరమునకు పంచేంద్రియము లట్లు మన్యువున కైదుగురు పుత్రు లుదయించిరి. వారు బృహత్క్షత్రి, జయ, మహావీర్య, నర, గర్గులనువారలు. ఈ యైదుగురిలో నాల్గవ వాఁడగు నరునకు సంకృతియను సుతుఁడు దయించెను. సంకృతికి గురు, రంతిదేవులను నిద్దరు పుత్రులుద యించిరి. వీరిలో మహారాజగు రంతిదేవుఁడు పరమ ధార్మికు డును, యశస్వుఁడు నయ్యెను. ఈ రాజర్షి యొక్క కీర్తి యిప్పటికినిఁ ద్రిలోకముల వ్యాపించుచుంటటి ధర్మాత్ముఁడీతఁడు ఈతనికి వచ్చిన రాజ్యములో నీతని నెవఁడేమి యడిగిన దాని నొసంగు చుండెడువాఁడు. ఈతని సోదరుఁడగు గురుఁడీతఁడు రాజ్యమునకుఁ దగఁడనియు. నీతఁడు నిరతము దానమొసంగు చుండుననియుఁ దెలిసికొని యీతనికి నెల జీతము నేర్పఱచెను. ఈతని జీవిక కెంత ధనము బాగుగ సరిపోవునో అంతటి ధనము నీతఁడు నియత సమయమున కిచ్చుచుండెడువాఁడు. కాని ఈతని కీశ్వరునిమీఁద విశ్వాసము, ఏ ప్రయత్న మొనర్పక యే

యేది లభించిన దానిమీఁదనే జీవింపవలయునని యీతని ప్రతిజ్ఞ. ఎవరిని యాచించను యాచింపఁడు. భోజన జలము లను సంపాదించు కొనుటకు పరిశ్రమయును నొనర్పఁడు. దైవయోగమున నీతఁడు తన కఠోర వ్రత కారణముననే ఒకసారి నలుబది యెనిమిది దినము లన్న జలములు లేక యుండవలసి వచ్చినది.

ఇదివిని శౌనకుఁడిట్లనెను :- "సూతా! మహారాజగు రంతిదేవుఁడు నలుబది ఎనిమిది దినము లన్న, పానీయములు లేక యెట్లు గడపవలసి వచ్చినది. కృపతో నీకథను నీవుమాకు విస్తారముగఁ జెప్పవలయును."

ఇదివిని సూతుఁడిట్లనెను :- "మంచిది, స్వామీ! నేను పరమ యశస్వియును, మహా భాగ్యవంతుఁడునగు రంతిదేవుని చరిత్రమును జెప్పెదను. మీ రందఱును దత్తచిత్తులరై యీ పరమపుణ్యప్రదమును బావనమునగు నాఖ్యానమును బ్రేమ పూర్వకముగ శ్రవణ మొనర్పుఁడు."

# రంతిదేవుని కథ

౨౨౬

శ్లో॥ రంతి దేవస్య హి యశ ఇహాముత్ర చ గీయతే।
వియద్విత్తస్య దదతో లబ్ధం లబ్ధం బుభుక్షత: ॥
నిష్కించనస్య ధీరస్య సకుటుంబస్య సీదత: ।
వ్యతీయురష్టచత్వారింశద హాస్యపిత! కిల ॥

శ్రీ భాగ. ౯ స్కం. ౨౧ అ. ౨-౩ శ్లో॥

సీ॥ రాజవంశోత్తమ రంతిదేవుని కీర్తి
యేల చెప్పఁగ వినుమిందునందు
నా రాజు దైవసంచితార్థంబు లన్నియు
నెడపక దీనుల కిచ్చి యిచ్చి
సకుటుంబుఁడై ధైర్యసంయుతుండై పేద
యై కూడు నీరు లేకదవ వృత్తి
నొందేని నలుబది యెనిమిది దివసముల్
చరియింప నొక దివసంబు రేపు

శ్రీమదాంధ్ర భాగవతము॥

అన్నిటియందు భగవానునిఁ గాంచుటయు, నన్నిటియందు భగవద్బుద్ధినుంచుటయే భగవత్ప్రాప్తి కేకైవమగు నుపాయము. భేదభావముచే భగవత్ప్రాప్తి కలుగదు. నిష్ఠావంతుఁడే భగవత్ప్రాప్తి కధికారి. ఎచ్చటనైనను సరియే, యేసాధన చేతనైనను సరియే నిష్ఠ కలిగినచో నచ్చటనే భగవానుఁడు ప్రకటమగును, అర్చా విగ్రహమందును, తల్లిదండ్రుల యందును, గురువు నందును, జడ చైతన్యములందును. పశు, పక్షి,

వృత్తాతిథి, అభ్యాగతులందును - ఎచ్చటనైనను - మనస్సేకా గ్రమగుచోఁ జిత్త వృత్తి స్థిరమగును; దానమందును, ధర్మమందును, పూజయందును, అతిథి సేవయందును, యోగమందును, జ్ఞానమందును, ఇతర వివిధ సాధనములందును వీనిలో దేనియందు చిత్తము స్థిరమైనను దానిద్వారా భగవంతుఁడు లభించును. కాని ఆ సాధనమందు దృఢత్వముండవలెను విచలితుఁడు కారాదు. తన సత్తను వేఱుగనుంచి పరమార్థ సాధనమును వృత్తిగా నొనర్చుకొనకున్నచో వానికా సాధనము ద్వారానే భగవత్సాక్షాత్కారము కలుగును. రంతిదేవ మహారాజు శక్తి యున్నంతవరకు దీనుల దుఃఖములను దూర మొనర్చుటకై వ్రతమును స్వీకరించెను. ఆ వ్రతాధారమునసే ఆతనికి భగవద్దర్శనమయ్యెను. ఆతని యుజ్జ్వల ధవళకీర్త్యాదుల నిచ్చటనే వదలి ఆతఁడు పరమపదమున కధికారి యయ్యెను.

సూతుఁడిట్లనెను :- మునులారా! రంతి దేవుని కడకెవరు వచ్చినను నాతఁడు లేదనెడువాఁడు కాఁడు. ఇది ఆతని వ్రతము. ఆతని పరివారములోని వారును నంతే. దీని నాతని సోదరుఁడు కాంచి, యీ విధముగనైనచో నీతఁడు రాజ్యమును నంతయు నిచ్చివేయఁగలఁడు; ఈతనికేదైన గౌరవభృతి నేర్పాటు చేయుట మంచిదని తలఁచి, ఆతఁడు రాజ్యమును దనచేతిలోనికిఁ దీసికొని, యీతనికి కొంతదిగ్గ నియమిత ద్రవ్యము నొసఁగుచుండెను. ఈతనికది మిక్కిలి సంతోషముగనుండెను.

ఆతనికి బంధము వీడెను. ఆతన భృతిచేతనే కాలమును గడుపుచుండెను. మధ్యలో నెవ్వరైన యాచించినచో రెండు మూఁడు దినములీత్రఁడాఁకలితోఁడనే పస్తుండి మరల ద్రవ్యము వచ్చిననాఁడు మరల నిర్వహించుకొనుచుండెడివాఁడు.

ప్రపంచములోఁ గొందఱు పురుషప్రయత్నమే సర్వ శ్రేష్ఠమైనదందురు. వారిట్లు చెప్పెదరు :- "అంతయును బురుష ప్రయత్నమునచే ప్రాప్తించు చుండును. దైవముమీఁద నాధారపడునది నిర్వీర్యులును, సోమరిపోతులపని. కావున నదృష్టమునుగూరి చింతింపక నిరంతరము పురుష ప్రయత్న మొనర్పవలెను. పురుష ప్రయత్నము ముందదృష్టమేమియును లేదు. నిద్రించుచున్న సింహము నోటిలోనికి హరిణము స్వయముగనచ్చి దూరదు. ప్రయత్నమొనర్ప నంతవఱకదృష్ట మేమియును గాఁజాదు."

కొందఱిట్లందురు :- "ప్రారబ్ధమునకును బురుష ప్రయత్నమునకును మహాత్వముకలదు. ఎగురుటకుఁ బక్షికి రెండు రెక్కలావశ్యకమైనట్లును, నడచుటకు రథమునకు రెండు చక్రములావశ్యమైనట్లు, సంతతి కలుగుటకు స్త్రీ పురుషు లుండుట అనివార్యమైనట్లును ప్రారబ్ధము, పురుష ప్రయత్నము ఈ రెంటి చేతను బనినడచును. పురుష ప్రయత్నము లేకున్నఁ బ్రారబ్ధమేర్పడును? పూర్వజన్మ మందలి పురుషార్థకృతకర్మయే రాఁబోవు జన్మములకుఁ బ్రారబ్ధ

మగును. కావున నిరంతరము పురుషార్థ మొనర్పవలయును; కాని దానిఫలమును దైవాధీనమని భావించి ప్రారబ్ధమువీఁద వదలి వేయవలయును; అనఁగాఁ గర్మ చేయుటకే మన కధికారముగాని దానిఫలప్రాప్తియందు మనకధికారము లేదు.''

కొందఱు ప్రారబ్ధమునే సర్వముగ భావించెదరు. వారిట్లందురు "మా ప్రారబ్ధమున నేదికలదో, అదిమనమెచ్చట నున్నప్పటికిని నవశ్యము ప్రాప్తించును. మనకు సంభవింప వలసిన సుఖ దుఃఖ భోగములు మనకు లభింపవలసినదే. విధాత యీ జన్మలో వ్రాసిన సుఖ, దుఃఖ, విత్త, వయ, భోగాదులు కలవో, అవి మనమెచ్చట నున్నను బ్రాప్తించును. మన యదృష్టమున నెంతటి ధనము వ్రాయఁబడి యున్నదో అది మనకు సైకతమందు గూర్చుండినను లభింపఁగలదు. అది మన యదృష్టమున లేకున్నచో మేరుపర్వతమందు గూర్చుండి నను నది లభింపదు ప్రపంచమునందు అన్నములోని మెతుకు మెతుకునకును, జలముయొక్క బిందు బిందువు మీఁదను, వస్త్రముయొక్క ముక్క ముక్కను బ్రతివాని నామము లిఖింపఁబడినది. దేనిమీఁద నెవని నామము లిఖింపఁబడినదో వాఁడెచ్చటనున్న నచ్చటనే లభించును, దేనిమీఁద నీనామము లేదో, ఎంత ప్రయత్న మొనర్చినను నీకది లభింపదు. మామిడిచెట్ల నెవఁడు నాటుచున్నాఁడు, ఎవడు నీరుపోసి పెంచుచున్నాఁడు, ఎవఁడు ఫలములను గోయుచున్నాఁడు, ఎవఁడు తట్టలో నింపుకొని అమ్ముచున్నాఁడు! ఎంతమంది

"నా మామిడిపండ్లు, నా మామిడిపండ్లని అఱచుచున్నారు; కాని వానిమీఁద నెవని నామము వ్రాయఁబడి యున్నదో ఆతఁడే తినును. ఒక శెట్టికలఁడు ఆతని తోటలో లక్షల కొలఁది మామిడిపండ్లు కలవు. వైద్యులు మామిడిపండ్లును దినవలదనిరి, ఆతఁడొక్క మామిడిపండునైనఁ దినలేదు. దీనికి విపరీతముగ వానిమీఁద నెవరి పేరు వ్రాయంబడి యున్నదో, ఆతఁడు పరదేశియైననువచ్చి తిని పోవుచున్నాఁడు. విస్తరినిఁ బఱచి యెదుట వడ్డించినను ముఖమున నాతనికా భోజనము వ్రాయఁబడ కుండినచోఁ గుక్కయును బిల్లియునువచ్చి దాని నెంగిల చేయును. అదే సమయమున : కేదియో అత్యావశ్యకమగు కార్యమును గలుగును. ఎవరితోడనో పోట్లాట రాగలఁదు; కోపమువచ్చి, ఆ వడ్డింపబడిన విస్తరిని వదలి లేచి పోవును. కావునఁ బురుషార్థము వ్యర్థము. అది పిల్లలనవలసిన మాట. ముఖ్యమైనది అదృష్టము. భాగ్యవశమున సమ్ముఖము కేది వచ్చునో దానినిఁ బ్రభు ప్రసాదమని భావించి ప్రేమతోఁ గ్రహింపవలెను. ఏమియును రాకపోయినచో నేఁడు భగవదేచ్ఛ యిదియేనని భావింపవలయును."

ఈ విచారము కలవారేది వచ్చునో దానినిఁ గైకొని తినెదరు, ఎవరైన నాఁకలి దప్పికలను జెందినవారు వచ్చిరా వారికిచ్చివేయుదురు, ఇదియే వారుచేయు పురుషప్రయత్నము. ఇవికాక వారు భోగ సామగ్రులను బ్రోవుచేయుటకే ప్రయత్నమును జేయరు. అనుక్షణము నచ్యుతుని అనుకంపను

బరితీక్షించుచుందురు. రంతిదేవుఁడిట్టి యాలోచనము గల వ్యక్తి. అన్నము వలె జలమును బురుషార్థముఁచేఁ బ్రాప్తింపఁదగు మరుభూమియందే ఆతఁడు నివాసముచేసినట్లు తోచుచున్నది.

నిష్ఠావంతుల నిష్ఠనుండి పడవేయుటకు ఖలులు కారణముగఁ బ్రయత్న మొనర్చుచుందురు. సత్యవాదియున్న నబద్ధమాడించుటకును, బ్రహ్మచర్యవ్రతమును బూనిన దానినుండి చ్యుతునొనర్చుటకును. అనుష్ఠాన మొనర్చుకొను చుండిన దానిని భంగమొనర్చుటకును గొందఱు మనోవినోదము కొఱకు బ్రయత్నించుచుందురు. వారు నిష్ఠాచ్యుతులైనచోఁ గాంచి వారాత్మ సంతోషమును జెందుదురు. రంతిదేవుని గుణములను నితరులు పొందఁజాలరు. ఆతని ద్వేషించువారు ఆతని నిశ్చయము నుండి పడవేయుటకుఁ బ్రయత్నించెదరు.

అంత శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! తనసర్వస్వమును భగవంతున కల్పించిన వానిని దుష్టులు దుఃఖపెట్టుటెందులకు? భగవంతుఁడు వారినేల రక్షింపఁడు?"

సూతుఁడు నవ్వి యిట్లనెను:- "స్వామీ! భగవాను చన్ని లీలల నొనర్చును. భగవదేచ్ఛ లేక ఒక్క ఆకైనను గదలదు. స్వర్ణకారుఁడు స్వర్ణమును మాటి మాటికి నగ్నియందు గాల్చి యుజ్జ్వల మొనర్చునట్లు భగవానుఁడు భక్తులను దుఃఖరూపమగు నగ్నియందుగాల్చి వానినుజ్జ్వలము గావించి వారి మహాత్మ్యమును లోకమునకుఁ బ్రకటపరచును. భీష్ముని వంటి భగవద్భక్తుఁడు నెలల కొలది శరశయ్యమీఁదఁ

బడుండవలసి వచ్చినది. కాలిలో నొక్క ముల్లు గుచ్చు కొనినచో గిలగిల కొట్టుకొందుము. ఆతనికి రోమ రోమమున బాణములు గుచ్చుకొనినవి. ఆతని కెంతటి కష్టము కలిగినదో? ఇట్టి స్థితిలో భగవానుఁడాతని సమీపమునకుఁ గొనిపోయి యుధిష్ఠిరుని ప్రశ్నలకు జవాబీయవలసినదని చెప్పెను.

పితామహుఁడిట్లనెను:- "ప్రభూ! మీరు సర్వజ్ఞులు. సర్వవిదులు. సర్వ సమర్థులు, సర్వేశ్వరులు, ధర్మరాజగు యుధిష్ఠిరునకు మీ రేల నుపదేశింపరు.

భగవానుఁడిట్లనెను :- "నాకుపదేశ మొసంగుటకే యోపత్తియును లేదు, శ్రమయును లేదు, వేదములన్నియు నా నిశ్వాసములు. కాని నేను ప్రపంచమందు నీ మహత్వమును వృద్ధి చేయవలయును. త్రిలోకములందు నీకీర్తిని విస్తరింప వలెను." ఇట్లుపలికి ఆతఁడు భీష్మపితామహునిచే నుపదేశము చేయించెను-ఆ జ్ఞానము మహాభారతమందు శాంతిపర్వమందు చెప్పఁబడి ప్రసిద్ధ చెందిన సర్వోత్కృష్ట జ్ఞానము. ఉద్ధవున కుపదేశించుచు స్వయముగ భగవానుఁడును దానినుద్ధరించుచు స్పష్టముగ నిట్లనెను :- "నేనీజ్ఞానమును దేవవ్రతుఁడగు భీష్మ పితామహునికడఁ దెలిసికొంటిని" కావున మునులారా! భగవంతుఁడు భక్తులకే కష్టమును బెట్టినను నది వారిహితము కొఱకే. ఆతఁడెవరిని రక్షింపఁదలఁచునో ముందుగా వారి సర్వస్వమును హరించి, వానిని_రాజ్యాధికారిగా నొనర్చి

తన సర్వస్వమును నొసంగును. భగవంతుఁడు భక్తాధీనుఁ డగును. తాను విక్రీతదాసుఁడగును. తాను వారికమ్ముడు వోవును.''

శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఇప్పుడు నీవు రంతిదేవుని తరువాత చరిత్రమును జెప్పుము,''

సూతుఁడిట్లనెను:- "అయితే, వినుఁడు స్వామీ! దానికి భూమిక నేర్పరచుచున్నాను. ఈతని యన్న 'నీకేది భృతిగా లభించుచున్నదో దానితోడనే జీవన నిర్వాహ మొనర్చుకొనవలయును. నీకు లభించిన దానినడుగఁగానే యిచ్చి వ్యయమొనర్చు చుంటివి; అడిగినవారి కిచ్చుచుంటివి. నీవలన నీపరివారములోనివారును దుఃఖమును బొందుచున్నారు వీరిని బాధించుట తగదనెను.

మహారాజగు రంతిదేవుఁడిట్లనెను:- ''అందరకును వారి వారి ప్రారబ్ధము కలదు. ఎవరికెట్లు వ్రాయఁబడి యున్నదో వారికది దొరకును. నా భాగ్యమందును, ఎవరెవరి భాగ్య మందును నేమి వ్రాయఁబడి యున్నదో దానిని వారు కొని పోవుచుందురు. దీనిలో నేనిచ్చుచున్న దేమున్నది? "ఇది విని విని యీతని యన్న గుకుపూరకుండెను. ఆతఁడిచ్చునది, ఈతఁడు వ్యయమొనర్చు చుండును.

ఒకసారి ఆతనికొక మాసమునకు లభించిన దంత్రయును నొకని కెవరికో యొసంగెను. మరుసటి నెలకు తెలిసియూ

తెలియకయో గురువు ధనమును బంపలేదు అందువలన నీతఁడు నలుబదియెనిమిది దినములు అన్నాహారములు లేకయే యుండెను. మహారాజీ దుఃఖమునకు విచలితుఁడు కాలేదు. ఈతఁడు దీనియందును భగవదనుగ్రహమని భావించెను.

నలుబది దినములైన తరువాత తొమ్మిదవ దినమున నెవరో మిక్కిలి భక్తితో నీతనికి మంచి జీడిపప్పు, కలకండ, కుంకుమపువ్వు, యాలకులు, పచ్చకర్పూరము, సమృద్ధిగ నేయితోఁజేసిన క్షీరాన్నమును దెచ్చి యిచ్చెను. దీనికిఁ దోడుగా హల్వా, పూరీ, లడ్డు మొదలగు పిండివంటలును గలవు. ఆతఁడొక కడవనిండ జలమునుగూడ దెచ్చియిచ్చెను. ఇది భగవంతుని యనుకంపయని ఆతఁడు తలంచెను. మిక్కిలి ధైర్యముతో భగవానున కర్పించి తన పరివారములోని కన్ని వస్తువులను బంచెను. తన భాగమును దగ్గరకు దీసికొని, ఆచమించి ఆతఁడు ప్రసాదమును బొందఁబోవుచుండ నింతలో భోజన సమయమున నొక బ్రాహ్మణ అతిథి, ఆతని కడకు వచ్చెను. అతిథికిఁబెట్టక ధర్మాత్ముఁడగు రాజు ప్రసాదము నెట్లు తినఁగలడు? అందువలన నాతఁడు బ్రాహ్మణునిఁ బ్రసాదమును గైకొనుఁడని యాహ్వానించెను బ్రాహ్మణుఁడు వచ్చినదే యిందులకు. కాళ్ళు చేతులను గడిగికొని వచ్చి పీటమీఁదఁ గూర్చుండెను రాజందఱను. నన్నిటియందును సర్వాంతర్యామి యగు ప్రభువే విరాజమానుఁడైనట్లు కాంచుచుండెను.

అత్యంత శ్రద్ధతో నాదర పూర్వకముగ నాయన్నమునుండి కొంత భాగము బ్రాహ్మణునకు ముందుగాఁబెట్టెను. తిని రాజున కాశీర్వాదము నొసఁగి బ్రాహ్మణుఁడు వెడలెను. "అతిథి కేమిపని, తిని అతఁడు వెడలిపోయెను.

బ్రాహ్మణుఁడు వెడలిపోఁగానే అతఁడు మరలఁ బ్రసాదమును గొనఁబోవుచుండ నొక శూద్రుఁడచ్చటికి వచ్చి రాజుతో నిట్లనెను:- "రాజా! ఆఁకలి జెందియున్నాను. నాకు కొంచెమన్నమొసఁగుఁడు. నా ప్రాణములు నిలుచును."

రాజందఱియందును భగవంతునిఁ జూచుచుండెను. కావున నాతఁడు మిక్కిలి ఆదరముతో నాశూద్రునకునుగడుపు నిండ భోజనమును బెట్టెను. దాహమొసంగెను. శూద్రుఁడు తిని రాజును బ్రశంసించి వెడలిపోయెను.

ఇప్పుడు మిగిలి నన్నమును యథా యోగ్యముగ విభాగ వితరణమొనర్చి, రాజు పరివార సహితముగఁ దినుటకు గూర్చుండఁగానే ఒక అవధూత చాలకుక్కలను వెంటఁబెట్టు కొని దీనవాక్కులతో నిట్లనెను:- "రాజా! నేను మిక్కిలి ఆఁకలి చెందియున్నాను. నాకుక్కలకును నాకును దినుటకే మైనఁ బెట్టుఁడు"

రాజు తత్త్వజ్ఞాని, అతఁడు కుక్కయందును, విద్వాంసునందును, బ్రాహ్మణునియందును, చాండాలుని యందును-

సర్వత్ర తన స్వామియగు శ్రీహరినే గాంచుచుండెను. కావున నాతఁడా యవధూతకుఁ బ్రణామమును గావించి, అందఱకును భోజనమిడి, నీరుఁ బోసి, ఆదరముతోఁ బంపివైచెను.

ఇప్పుడు రాజుకడ కొంచెము జలము మాత్రము మిగిలెను. ఆజలమైనను నొక్కఁడు మాత్రము తృప్తిగాఁ ద్రాగునంతయే యుండెను. రాజా జలమునే పంచి త్రాగఁబోయెను. ఇంతలో మిక్కిలి దప్పికను గొనిన చాండాలుఁడు పరుగెత్తుకొనివచ్చి, అత్యంత కాతరవాక్కులతో నిట్లనును:- "రాజా! నేను మిక్కిలి దప్పికజెందియున్నాను. ఇప్పుడీక నాకు జలము దొఱకనిచో నేను నిశ్చయముగఁ దన్నుకొని చావఁగలను. నాకు జలమొసంగుఁడు"

ఇది వినఁగానే మహారాజు జలమును ద్రాగుట నాపివైచెను. నలుబది దినములనుండి యాతఁడు జలమునైనను త్రాగలేదు; కాని చండాలుని కాతరవాక్కులనువిని యాతఁడు తనయొక్కయుఁ, దన పరివారము యొక్కయు దుఃఖమును మఱచి యిట్లనెను:-"నేను భగవానుని నష్టైశ్వర్యయుక్తమగు పరమగతినిఁగోరను, మోక్షేచ్ఛయును నాకులేదు. నేను సమస్తదేహధారుల అంతఃకరణమందుండి వారి దుఃఖములను సహింపఁగోరుచున్నాను. ప్రపంచమందలి అందఱకు బదులుగా నాకే దుఃఖములుండవలెను. మిగిలినవారి దుఃఖము

లన్నియును బోవలయును. ఓహో! ఈచాండాలుఁడు బ్రదుకఁ దలఁచుచున్నాఁడు. జీవనమును గాంక్షించుచున్నాఁడు. ఈతని జీవిత మీజలమున నాధారపడియున్నది. ఈజలరూపమగు జీవనము నొసంగుటచే నాక్షుధా, పిపాసా, శ్రమలు, శరీరశిథిలత దీనత్వము, గ్లాని, శోకము, విషాదము, మోహము మొదలగు వృత్తులన్నియును నివృత్తిఁ జెందినవి”

సూతుఁడిట్లనెను:- “మునులారా! ఇట్లు పలికి ఆతఁడా జలమును గూడ సంతోషముతో నాచాండాలున కొసంగెను. చాండాలుఁడు జలమును ద్రాగఁగానే ఆకాశమునుండి పుష్ప వర్షముకురిసెను. అందఱును రంతిదేవునకు జయజయధ్వానము లొనర్చిరి. క్షణములోనే ఆచాండాలుఁడు దేవతా స్వరూపమున నాతని సమ్ముఖమున నిలుచుండి యిట్లనెను:- ‘రాజా! నేను సాక్షాత్తుగ ధర్మమును. నీవు నీధర్మమందిట్టి సంకటమందును నవిచలుఁడవైతివి. దీనికి నేను నీయెడల మిక్కిలి ప్రసన్నుఁడనైతిని. నీవు నీకు కావలసినవరమును నన్నడుగవచ్చును’

రాజు చేతులను జోడించుకొని యిట్లనెను:- “ధర్మదేవా! మీదర్శనమైనది నాయదృష్టము. నాబుద్ధిసదా ధర్మమందే నిలిచియుండవలయును, నేను ధర్మపథమునుండి యెన్నడును చ్యుతినిఁజెందరాదు. ఇంతకుతప్ప నేనింకేమియును గోరను.”

ఆతఁడిట్లనుచుండగ గరుత్మంతుని వీపుమీఁదనెక్కి చతుర్భుజుఁడగు విష్ణువు ఆతని సమ్ముఖమునఁ బ్రత్యక్షమై యిట్లనెను:- "రాజా! బ్రాహ్మణవేషమును ధరించి నేనే నీసమీపమునకు వచ్చితిని. ఆఁకలితో నున్నను నీవు నాయెడల నశ్రద్ధను జూపలేదు ఉపేక్షాభావమును బ్రదర్శింపలేదు. అత్యంతము క్షుధాబాధితుఁడవై యుండియును నీవు ధైర్యమును వీడలేదు. ఇదియే నీగొప్పదనము. నీయెడల నేను బ్రసన్నుఁడనైతిని. నీకు గావలసినది నన్నుఁ గోరుకొనుము. నీవు నీపుణ్యప్రభావముచే సమస్తపుణ్యలోకములను జయించితివి. నీకిష్టమువచ్చిన లోకములకు నీవు పోవచ్చును."

రాజు పుణ్యముచేఁ బ్రాప్తించిన నీలోకముల పరిణామము నెఱుఁగును. వానిలోఁగల సాతిశయదోషమును పతన భయమును బాగుగా నెఱుఁగును. అందువలన నాతఁడు పుణ్యలోకములకు వెళ్ళుట కంగీకరింపలేదు. కేవలమిట్లనెను:- "నాకు మీచరణకమలములందు భక్తి ప్రాప్తింపవలెను."

తదనంతరము హంసమీఁదనెక్కి కమండలువును బట్టుకొని వేదగర్భుఁడగు చతుర్ముఖబ్రహ్మ ఆతని సమ్ముఖమునఁ బ్రత్యక్షమై యిట్లనెను:- "రాజా! శూద్రరూపమున నీకడకు వచ్చినది నేనే. నీవు అతిథియగు బ్రాహ్మణు నెట్లాదరించితివో శూద్రుఁడనై వచ్చిన నన్నును నట్లే ఆదరించితివి. నీబుద్ధి సమత్వమున నున్నది. నీవు నాలోకమునకురమ్ము."

రాజిట్లనెను:- "చతురాననా! నాకు స్వర్గసుఖము లక్కఱలేదు నేను బృథివియందే భగవద్ధ్యానమును జూడఁ గోరుచున్నాను. నామనస్సున నిసుమంతైన ద్వైతభావన రారాదు సర్వత్ర శ్రీహరినే చూడవలయును. నాకిట్టి యాశీర్వాదము నొసంగినఁ జాలును."

రాజటులనుచుండఁగనే వృషభ వాహనారూఢుఁడై త్రిపుండ్రమును ధరించి, చేతఁ ద్రిశూలమును గ్రహించి త్రినేత్రుఁడగు త్రిపురారి అచ్చటకు వచ్చెను. అతఁడు వ్యాఘ్ర చర్మమును ధరించెను. చేతిలో డమరుకముండెను. మస్తకమునఁ జంద్రుఁడు వెలుఁగుచుండెను. జడలలో గంగాదేవి యుండెను. అతఁడు రుద్రాక్షమాలను ధరించి, శరీరమంతటను జితాభస్మమును బూసికొని. కర్పూరసమానమగు ద్యుతిచే దశదిశలను బ్రకాశింపఁజేయుచు సువాసిత మొనర్చుచుండెను, రాఁగానే అతఁడిట్లనెను:- "రాజా! కుక్కలతో నేనే అవధూత వేషమున నీసమ్ముఖమునకు వచ్చినాను. నీవు నాకును నాకుక్కలకును భేదభావము నెంచక, అంతటి ఆఁకలితో నున్నను కుక్కలతో నన్నుఁ దృప్తిగావించితివి ఇప్పుడు నీకు కావలసిన వరమును గోరుకొనుము మేము నీధైర్యమును బరీక్షించుటకై ఆ రూపములను ధరించి వచ్చితిమి కాని. నీవు నీవ్రతమందు దృఢముగ నుంటివి కావున నీకుఁగావలసినది కోరుకొనుము"

ఇదివిని రాజు త్రిమూర్తులకు భక్తితో సాష్టాంగ నమస్కారమొనర్చి గద్గద వాక్కులతో నిట్లనెను:- "త్రైలోక్య వందితులగు దేవతలారా! మీ యుగ్రదర్శనమైనది ఇది నా యదృష్టము. సాంసారికులకు మీదర్శనము దుర్లభమైనది. మీదర్శనముచేతనే నేను సమస్తమును బొందితిని. మీదర్శనమైనతరువాతను నేనీ సాంసారిక భోగములను గోరినచో( గల్పవృక్షము క్రింద(గూర్చుండి తాలును యాచించినట్లగును. విషయభోగము నరకమును నందును బ్రాప్తించును. అట్టియెడ వానిని నేను మెచ్చుకొనగలను? మీరు ప్రసన్నులరైనచో నానందకందుడును భగవానుడునగు వాసుదేవుని చరణారవిందములందు నాకవిచలమగు నహైతుక భక్తి కలుగునట్లాశీర్వదింపుడు. బ్రహ్మలోకమువఱకును గల భోగములందు నాకు స్పృహయుండకుండునుగాక! నామనస్సు సదా శ్రీహరిచరణారవిందములందే లగ్నమగుగాక!"

రంతిదేవుని యిట్టి యవిచల సద్భక్తిని నిష్ఠనుగాంచి ధర్మసహితముగ త్రిమూర్తులు పరమ ప్రముదితులైరి. వారు రాజున కవిచల భక్తి కలుగునట్లాశీర్వదించి, రాజు చూచుచుండగనే వారందఱును అంతర్ధానమైరి.

సూతు(డిట్లనెను:- "మునులారా! అత్యంత ప్రలోభనమొనర్చినను మహారాజు ఈశ్వరభక్తి తప్ప యింకొక ఫలమును గోరలేదు. ఆతని చిత్తము నిరంతరమనన్య భావముతో

నా యచ్యుతునియందే లగ్నమైయుండెను. ఆతఁడు సర్వత్రి సమస్త స్థానములందును, సమస్త కాలములందును, సమస్త ప్రాణులయందును దన యిష్టదేవమగు శ్రీహరినే చూచుచుండెను. ఆతని భేదభావము నశించెను. ఆతఁడు త్రిగుణాతీతుఁడై జీవన్ముక్తుఁడయ్యెను.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఆతని పరివారమును ఆతని వెంట నున్నవారును నేమైరి?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఉప్పునీటి ప్రవాహములోని కేపదార్థము పోయినను నుప్పునీరే కాఁగలదు. చందన వన సమీపముననుండు నితర కంటకవృక్షములును సుగంధితములగును. ఇదే విధముగ రంతిదేవుని సంసర్గమున నున్న వారందఱును నాతని సాంగత్యప్రభావముచే యోగులుగను, నారాయణ పరాయణులుగను భగవద్భక్తులుగనున్నైరి. ఇది నేనత్యంత సంక్షేపముగ మన్యువునకుఁ బ్రిపౌత్రుఁడును. నరునకుఁ బౌత్రుఁడునగు మహారాజు రంతిదేవుని కథను జెప్పితిని. ఇప్పుడు నరుఁడుగాక మిగిలిన మన్యునిపుత్రులు బృహత్క్షత్ర, జయ, మహావీర్య, గర్గులను నలుగురయొక్క వంశవర్ణనముచు మీరు వినుఁడు."



# బృహత్క్షత్రవంశవర్ణనము.

౨౨౨

శ్లో॥ బృహత్క్షత్రస్య పుత్రోఽభూద్ధస్తీ యద్ధస్తినాపురమ్।
అజమీఢో ద్విమీఢశ్చ పురుమీఢశ్చ హాస్తినః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౧ అ. ౨౦ శ్లో.

వ......బృహత్క్షత్రునికి సుహోత్రుండు సుహోత్రునకు హస్తియు జన్మించి రాహస్తి దనపేర హస్తినాపురంబు నిర్మించె. ఆహస్తికి నజమీఢుండును, ద్విమీఢుండును, బురుమీఢుండును ననుమువ్వురు జనియించిరి.

శ్రీమదాంధ్ర భాగవతము.

యోగి తనయోగశక్తిచే నొకఁడే అనేక రూపములను ధరింపవచ్చును. అనేకరూపములచే ననేక కార్యములొనర్ప వచ్చును. ఆతఁడు నవీన సృష్టినొనర్పఁగలఁడు. జడమును జేతనము కావింపఁగలఁడు. ఆతనికే కార్యమును గఠినమైనదికాదు. ఏకార్యమును నసంభవముకాదు. ఏవిషయమును దెలియనిది కాదు. ఆతఁడు సర్వసమర్థుఁడు. వానిచేష్టలు లోకబాహ్యములుగ నుండును. కావున వానియెడల నాశ్చర్యమును బ్రకటింపరాదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! నేను దుష్యంత పుత్రుఁడగు భరతుని వంశమునుగూర్చి వర్ణించుచున్నాను. ఆతని నామముచే నీవంశము భరతవంశమను పేరఁ బ్రఖ్యాతినిఁ జెందినది భరతమహారాజు పుత్రుఁడు వితథుఁడని నేనిదివఱకే చెప్పితిని వితథునకు మన్యువుపుట్టెను. మన్యువునకు బృహత్క్షత్రుఁడును, జయుఁడును, మహావీరుఁడును నరుఁడును, గర్గుఁడు నను నైదుగురు పుత్రులుదయించిరి, వీరిలో నరునివంశములో రంతిదేవునివఱకు నేను వర్ణించితిని. ఇప్పుడు మిగిలిన నలుగుర వంశమును గూర్చియు శ్రవణమొనర్పుఁడు. ముందుగా నేను సంక్షేపముగ మిగిలిన ముగ్గురు తమ్ముల వంశములను గూర్చి చెప్పి, చివరకందఱికంటెఁ బెద్దవాఁడును రాజర్షియునగు బృహత్క్షత్రుని వంశమునుగూర్చి వర్ణించెదను.

మన్యుమహారాజుయొక్క అయిదవపుత్రుఁడగు గర్గుని సుతుఁడు శిని. శిని వలన గార్గ్యుఁడుదయించెను. గార్గ్యుఁడు క్షత్రియుఁడైనను నీతని సంతతి మరల బ్రాహ్మణులైరి. తరువాత నిది బ్రాహ్మణకులమయ్యెను.

ఇప్పుడు మన్యుని మూఁడవ కుమారుఁడగు మహావీర్యుని వంశమును గూర్చి వినుఁడు. మహావీర్యుని సుతుఁడు దురితక్షయుఁడు. ఆతనికిఁ ద్రయ్యారుణి, కవి, పుష్కరారుణి యను ముగ్గురు పుత్రులుదయించిరి. వీరు ముగ్గురును బ్రాహ్మణ గతినిఁబొందిరి. అనఁగా వీరి వంశమునకునుగర్మచే

బ్రాహ్మణత్వము ప్రాప్తించెను. ద్వితీయ పుత్రుఁడగు జయుని వంశము సంభవతయా నడువలేదు.

మన్యువునకుఁ బెద్దకుమారుఁడగు బృహత్క్షత్రుని పుత్రుఁడు హస్తి. అతఁడే హస్తినాపురమును నిర్మించెను.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! హస్తినాపురమిదివఱకే కలదుగదా హస్తి నిర్మించిన దేమున్నది."

సూతుఁడిట్లనెను:- "స్వామీ! మొదటినుండియు నేది లేదు? ప్రపంచములోఁ గ్రొత్తవస్తువేమియున్నది? కేవలము నామరూపములందే పరివర్తనము కలుగుచుండును. భూమి యెల్లప్పుడును గలదు. మధుకైటభుల మేదస్సుచే నేర్పడుటచే దీనికి మేదినీ యను పేరువచ్చినది. ఇది కశ్యపుని ఊరువునందుండుటచే నుర్వియనియు పృథు చక్రవర్తి దోహనమొనర్చుటచే బృథివి యనియు, వసువు (ధనము) ండుటచే 'వసుమతి'యను నామముచే విఖ్యాతినిఁ జెందినది. ఈవిధముగనే నగరములు, బజారుల విషయములలోను, నగరమునకు నేఁడొక పేరుండినఁ గొంతకాలమైన తరువాత నింకొక ప్రభావశాలివలన. వాని పేరుతో వ్యవహరింపఁబడును. నేఁడొక శౌనకుని శాసనము కలదు. అతని యధికారములోనివారి పేరులతోడను నాతని పేరుతోడను బజారుండును. రేపు మరియొకరధికారములోనికి వచ్చినచో నింకొక పేరువచ్చును. ఈసంసారచక్రమిట్లే నడుచు

చుండును. ఆనగరమిదివఱకే కలదు, హస్తి నామముచే నది హస్తినాపురమను పేరఁబరగెను.

హస్తికి ముగ్గురు పుత్రులు. అజమీఢుఁడు, ద్విమీఢుఁడు, పురుమీఢుఁడు అజమీఢుని వంశజులు ప్రియమేధాది బ్రాహ్మణ గణములైరి. అజమీఢుని ద్వితీయ పుత్రుఁడు బృహదిషువు. బృహదిషుని పుత్రుఁడు బృహద్ధనువు. బృహద్ధనుని పుత్రుఁడు బృహత్కాయుఁడు. ఆతనికి జయద్రథుఁడు జయద్రథుని పుత్రుఁడు విశదుఁడు. విశదునకు సేనజిత్తను యశస్వియగు పుత్రుఁడుదయించెను సేనజిత్తునకు రుచిరాశ్వుఁడును దృఢహానువు, కాశ్యుఁడు వత్సుఁడను నల్గురు పుత్రులుద యించిరి.

రుచిరాశ్వుని పుత్రుఁడు పాటుఁడు. పాటున కిద్దరు పుత్రులు– ఒకనిపేరు పృథుసేనుఁడు, రెండవవానిపేరు నీపుఁడు నీపునకు నూర్గురు పుత్రులుండిరి. నీపుఁడే శ్రీశుకదేవుని కూఁతురగు కృత్వియందు బ్రహ్మదత్తునిఁగనెను. ఆతఁడు ప్రసిద్ధయోగీశ్వరుఁడు.

ఇదివిని శౌనకుఁడిట్లనెను:– "సూతా! వ్యాసపుత్రుఁడగు శుకదేవుఁడు జన్మచేతనే పరమహంస. ఆతని వివాహము సంగతి యెందులకు? ఆతనికి యజ్ఞోపవీత సంస్కారమును జేయఁబడలేదు, అట్టియెడ నాతనికిఁ బుత్రిక యెట్లుకలిగినది"

ఇదివిని సూతుఁడునవ్వి యిట్లనెను:- "స్వామీ! యోగు లకసంభవమును, నాశ్చర్యమును నేమియునుండదు. యోగు లందఱకును సంతానము కలదు; వారు జగత్పితలు. మాగురు దేవుఁడు వివాహమును జేసికొనని విషయమది సత్యమే; కాని మాగురువు తనవలెనే ఒక ఛాయాశుకుని నిర్మాణము కావించెను. అతఁడే వివాహమొనర్చుకొనెను. పురాణములలో శుకదేవుని వంశమని చెప్పఁబడునదీ ఛాయాశుకుని వంశమే."

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! ఛాయాశుకుని శుకదేవుఁడెప్పుడు కావించినాఁడు?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! శుకదేవుఁడు విరక్తుఁడై తల్లిదండ్రులను బరిత్యజించి వనమునకుఁ బోవుచుండఁగా నాతని వెంట పుత్రవియోగముచే దుఃఖితుఁడగు వ్యాసుఁడు "హా పుత్రా! హా పుత్రా!" అనుచు నాతని వెనుక పరుగిడెను. శ్రీశుకుఁడు సమస్త ప్రాణులందును వ్యాప్తుఁడై 'ఓ' అను శబ్దము వినఁబడెను. అయినను వ్యాసుఁడు విరహశోకులుఁడయ్యెను. అప్పుడు సర్వసమర్థుఁడును, మహాయోగీశ్వరుఁడు నగు మాగురుదేవులు తనవలెనే ఒక ఛాయాశుకుని రచించి, ఆతని నచ్చటనే వదలి తానుముందుకుఁ బోయెను. వ్యాసుఁడు పుత్రశోకముచే విమూర్ఛితుండయ్యెను. ఛాయశుకునిబొంది ఆతఁడు పరమ ప్రసన్నుఁడయ్యెను. ఆతఁడాతనిఁ దీసికొని యింటికివచ్చి ఆతనికి విధ్యుక్తముగ వివాహ మొనరించెను.

ఆమెయందు కృత్వియను గన్యకనుగనెను. ఆమెయే నీపునకుఁ బత్నియయ్యెను. ఆమెయందు యోగీశ్వరుఁడగు బ్రిహ్మదత్తుఁ డుదయించెను. ఈబ్రిహ్మదత్తుఁడాత్మ విద్యావిశారదుఁడు. ఈతని భార్యపేరు సరస్వతి. ఆమె గర్భమున నాతఁడు విష్వ క్సేనుఁడను బుత్రినిఁగనెను. ఈతఁడును మహాయోగీశ్వరుఁడే. ఈతఁడు జైగీషవ్య మహర్షి యుపదేశముచే యోగశాస్త్రి మును రచించెను యోగాచార్యులలో విష్వక్సేనునియొక్క లెక్కకూడ కలదు.

విష్వక్సేనుని పుత్రిఁడు దక్స్వనుఁడు. ఆతనికి భల్లా దుఁడను పుత్రుఁడుదయించెను. నేను హస్తిపుత్రుఁడగు నజ మీాఢుని వంశమునంతయును సంక్షేపముగఁ జెప్పితిని.

హస్తియొక్క ద్వితీయ పుత్రిఁడగు ద్విమీాఢుని కుమారుఁడు యవీనరుఁడుఁ యవీనరునకుఁ గృతిమానుఁడు, ఆతనికి సత్యధృతి, సత్యధృతికి దృఢనేమి, ఆతనికి సుపార్శ్వుఁడు పుత్రుఁడయ్యెను. సుపార్శ్వునకు సుమతి, సుమతికి సన్నతి మానుఁడు, ఆతనికిఁ గృతి. కృతి హిరణ్యనాభునివలన యోగ విద్యను బొందెను. దీనివలన నీతఁడు ప్రాచ్య సామములచల లోని ఆఱు సంహితలను జెప్పెను. ఈతని పుత్రుఁడు నీపుఁడు నీపునకు గ్రాయుధుఁడు, ఆతనికి క్షేమ్యుఁడు. క్షేమ్యునకు సువీరుఁడు. ఆతనికి రిపుంజయుఁడు, రిపుంజయుని పుత్రుఁడు బహురథుఁడు. ఇది నేనత్యంత సంక్షేపమున ద్విమీాఢుని వంశ

మునువర్ణించితివి ఈవిధముగ హస్తిపుత్రులలో నజమీఢుఁడు ద్విమీఢుఁడు, పురుమీఢులలో నిద్దరి వంశములే నిలిచినవి. మూఁడవవాఁడగు బురుమీఢునకు సంతానము కలుగలేదు. అందువలన నాతని వంశము నిలువలేదు.

పెద్దవాఁడగు నజమీఢునకుఁ జాలమంది రాణులుకలరు. ఒకరాణి వంశజులు బ్రాహ్మణులైరి. మిగిలినవారి వంశమును ఇదివఱకు జెప్పఁబడినవి. మూఁడవది నళినీయను పేరుగల రాణి కలదు. ఆమెకు నీలుఁడను వాఁడుదయించెను నీలునిపుత్రుఁడు శాంతి, శాంతికి సుశాంతి. ఆతనికిఁ బురుజుఁడు. పురుజున కర్కుఁడు అర్కునకు భర్మ్యాశ్వుఁడు, భర్మ్యాశ్వుని వలన ముద్గలాదులైదుగురు పుత్రులుదయించిరి. ఆయైదుగురు పుత్రుల నామములు ముద్గలుఁడు, యవీనరుఁడు, బృహదిషుఁడు కాంపిల్యుఁడు, సంజయుఁడు.

భర్మ్యాశ్వుని నీయైదుగురు పుత్రులును నైదు దేశములకు సమ్మిళిత రాజులైరి. తండ్రియిట్లనెను:- "నాయైదుగురు పుత్రులు పంచదేశములను శాసించుటయందు అలమ్ (చాలుదురు). కావున నీపంచదేశములకుఁ బాంచాలమను పేరు వచ్చెను. నాల్గవ పుత్రుఁడగుఁ గాంపిల్యుఁడు తన నామముచే గాంపిల్యనగరమును గంగాతటమున నిర్మించెను. ఏటాజిల్లా యందు గంగాతటమున నిప్పటికినిఁ గాంపిల్య నగరము కలదు.

ఇదియే పూర్వము పాంచాలదేశమునకు రాజధాని. అహిగధము దగ్గఱ కోలమనునది దక్షిణ పాంచాలమునకు రాజధాని. రాజు యొక్క పెద్దకుమారుఁడగు ముద్గలుని వలన మౌద్గల్యమను బ్రాహ్మణ గోత్రము ప్రవృత్తి జెందెను. మౌద్గల్యగోత్రీయ బ్రాహ్మణులు శిఖనుంచుకొనరు. ఈసంబంధమున నొక యితిహాసముకలదు.

భర్మ్యాశ్వుని పుత్రుఁడగు ముద్గలునివలన దివోదాసుఁడను బుత్రుఁడును అహల్యాయను గన్యకయును నుత్పన్నమైరి. వారిలో నహల్యా వివాహము గౌతమునితోనయ్యెను. ఈమెకు శతానందుఁడుదయించెను.

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఇదివఱకు నీవు బ్రహ్మసమస్తవస్తువుల సౌందర్యమును గైకొని ఒకస్త్రీని నిర్మాణ మొదర్చెననియు, నామెకు హల్య లేకపోవుటచే నహల్యాయను పేరు పెట్టఁబడెననియు, తరువాత గౌతమునిఁ బరీక్షించుటకై బ్రహ్మకుదువగ నామెనాతనికడ నుంచెననియు నంత నాతని సత్య, సంయమ, సదాచారములకు సంతోషించి బ్రహ్మ యామెను మునికిచ్చి వివాహ మొనర్చెననియుఁజెప్పి యిప్పుడు ముద్గలుని పుత్రికయని చెప్పుచుంటివి ఇదేమిటి?"

సూతుఁడిట్లనెను:- "అయ్యా స్వామీ! ఈసృష్టిఅనాదియైనది. ఒకానొక కల్పముననహల్యను బ్రహ్మ నిర్మించియుండ

వచ్చును, ఇంకొక కల్పమున నామె ముద్గలునకుఁ బుత్రికయై ప్రకటమై యుండవచ్చును. ఈవిషయమున శంకింపరాదు.''

శతానందుని పుత్రుఁడు సత్యధృతి, బ్రాహ్మణుఁడయ్యును నాతఁడు ధనుర్విద్యా పారంగతుఁడయ్యెను. ఆతనికి శరద్వంతుఁడు పుత్రుఁడయ్యెను. ఆతనికి కృప, కృపియను వారలు పుత్రుఁడును బుత్రికయునైరి.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! కృప, కృపి వీరిద్దరి యొక్క యుత్పత్తి యెట్లైనది, దయతో నీవు ప్రసంగమును మాకుఁ జెప్పవలయును."

సూతుఁడిట్లనెను:- "మంచిది. స్వామీ! ఇప్పుడు నేను మీకు కృపాచార్య, కృపీ విషయమును గూర్చినకథను జెప్పెదను, మీరు సావధానులరై శ్రవణ మొనర్పుఁడుఁ''



# కృప – కృపీ కథ.

(౭౭౮)

శ్లో॥ శరద్వాన్తస్యతో యస్యా దుర్వశీ దర్శనాత్కిల
శరస్తంబే ఽపతద్రేతో మిథునం తదభూచ్ఛుభమ్॥
తద్దృష్ట్వా కృపయా గృహ్ణచ్ఛంతనుర్మృగయా చరన్।
కృపః కుమారః కన్యా చ ద్రోణ పత్న్యభవత్కృపే।

శ్రీభాగవ. ౯ స్కం. ౨౧ అ. ౩౫-౩౬ శ్లో.

వ ....... సత్యధృతి ఒకనాఁడు వనంబున నూర్వశిం గనిన నతనికి రేతః పాతంబై తద్వీర్యంబు శరస్తంబంబునంబడి మిథునంబయ్యె.

క. చపలరతి శంతనుండను
నృపవరుఁ డడవికిని వేఁట నెపమునఁ జనుచుం
గృపతో శిశు యుగముం గని
కృపియుఁ గృపుండనుచుఁ దెచ్చి గృహమునఁ బెంచెన్.
వ. ఆ కృపిద్రోణునకు భార్యయయ్యె.

శ్రీమదాంధ్ర భాగవతము.

కృపను జెందుట శ్రేష్ఠ పురుషుల కార్యము. ఇతరులను గృపజూడక తన శరీరమునే సదా పోషించుకొనుచుండు నధమ పురుషులు చచ్చి యితరలోకములందు తమ శరీరమునే

తినుచుందురు. మతియెంతో గతియంత దేనినిఁ జేయుదుమో దానికిఁదగిన ఫలమునే అనుభవించుట ప్రపంచ నియమము. ప్రాణులపైఁగృపను జూపి, ఇతరుల దుఃఖములను గాంచి వారిదుఃఖములను దూరమొనర్చుటకుఁ బ్రయత్నించి యథాశక్తిగ వారికి సేవా శుశ్రూష లొనర్చినచో నాతఁడు పుత్రపౌత్రుల తోడను నైశ్వర్యముల తోడను భోగించి చివరకు ధర్మోపార్జన మొనరించి పుణ్యలోకములకుఁ బోవును.

సూతుఁడిట్లనెను :- మునులారా! మీరు కృపా, కృపీల ఉత్పత్తి కథనుగూర్చి నన్నడిగితిరి. దానిని నేను మీకు చెప్పెదను. గౌతమగోత్రీయుఁడగు శరద్వానుఁడను ముని తన తండ్రి వతధృతి వలెనే ధనుర్విద్యా పారంగతుఁ డయ్యెను. ఆతనికి వేదవేదాంగములందు ధనుర్విద్యయం దున్నంత ప్రేమలేదు. ఆతఁడు దర్భ దంటు పుల్లలతో బాణము లొనర్చి నిరంతము బాణవిద్య నభ్యసించెడువాఁడు. ఆతఁడు నైష్ఠిక బ్రహ్మచారి అరణ్యమందుండి ఆతఁడు లక్ష్యభేది నభ్యాసము చేయుచుండెను. ఇతర విద్యార్థులెట్లు బ్రహ్మచర్య వ్రతమును బాలించుచు వేదాధ్యయనము చేసిరట్లే యాతఁడు సమస్తేంద్రియములను సంయమ మొనర్చి అస్త్ర శస్త్ర విద్యను నేర్చుచుండెను. కొలఁది కాలములో నాతఁడు ధనుర్వేదమందు పారంగతుఁ డయ్యెను. దేవతలాతని తపమున కంతగాయమును కలిగించెను. ఎవరైన శుభకార్యము లొనర్చుచుండినచో దేవత

లాతని ధైర్యపరీక్ష నిమిత్తముగ సాధారణముగఁజాలవిఘ్నము లను గలిగించుచుందురు. ఆ విఘ్నములను దాటింపక నిరంతరము తన కర్తవ్యమందే నిలిచియుండు వారల కంపలకును సిద్ధిప్రాప్తించుచుండును.

దేవేంద్రుడు మహామునియగు శరద్వాసుని వ్రతమును భంగ మొనర్చుటకై ఊర్వశీ యను నప్సరసను బంపెను. ముని ఘోరవనమందేకాగ్ర చిత్తముతో బాణవిద్య నభ్యసించుచుండెను. అచ్చటికి సమీపమునకువచ్చి ఊర్వశి కామచేష్టలను జేయసాగెను. ఆమె తన హావభావ కటాక్షవీక్షణముల చేమునిని మోహింపఁజేయ యత్నించుచుండెను. ఒకొక్కప్పుడామె కందుక క్రీడనొనర్చుచు ముని సమీపమునకు వచ్చుచుండెడిది ఇంకొకసారి సుందర సంగీతమును బాడి ముని చిత్తము నాకర్షించుచుండెను. మఱొకసారి తన గుహ్యాంగమును నజాగ్రత్తచే వివస్త్రగనుండి కనఁబఱచు చుండెను యువకముని ధ్యాన మాసురలలన వైపునకు స్వతః ఆకర్షితమయ్యెను. ఆమె రూప, యౌవన, సౌందర్య, మాధుర్యములను గాంచఁగనే ఆతని మనస్సు మగ్ధమయ్యెను. ఆతని చిత్తము చంచలమయ్యెను. కరము కంపింపసాగెను. చేతినుండి ధనుర్బాణములు పడిపోయెను. ఆతఁడు తనను తాను మఱచెను ఆతని మనస్సు సర్గీయ వారవనితయొక్క రూపజాలమందుఁ బడిపోయెను. అయినను నాతఁడు ధైర్యమును వహించెను. శరీరమును నచ్చ

టనే కదలకయుంచెను. ఆతఁడు తన స్థానమునుండి విచలితుఁడు కాలేదు. శరీరము నాతఁడాపుకొనఁ గలిగినాఁడు గాని శుక్రమును నాపుకొనఁ జాలకుండెను. ఆతని రేతస్సు స్ఖలితమయ్యెను. తన యమోఘవీర్య మచ్యుతమయ్యెనని ముని గ్రహించెను. అందువలన నాతఁడచ్చటనే తన మృగచర్మమును, దండాదులను వదలి వెంటనే యింకొకస్థానమునకుఁ బోయెను. అతని రేతస్సు ఒక కుశపైఁబడెను. సంయోగ వశమున నది రెండుభాగములయ్యెను. ముని యొక్క అమోఘవీర్యమెన్నటికిని వర్థ్యముకాఁజాలదు. అది యెచ్చటపడినను ఫలించును. కావున వెంటనే అచ్చట నిద్దరు పిల్లలైరి. వారిలో నొకఁడు బాలకుఁడు, ఒకతె బాలిక.

ఆదినములలో హస్తినాపురమందు భీష్మపితామహుని తండ్రి శంతను మహారాజు రాజ్యమొనర్చుచుండెను. ఆతఁడు దైవ వశమున నావనమందే వేఁటాడుటకై వచ్చియుండెను. ఆతని సేవకులాసుందర శుభలక్షణములుగల బాలబాలిక లేడ్చుచుండుటను గాంచిరి. దండ కమండలువులు, మృగచర్మము. కుశ బ్రహ్మదండము మొదలగు వాటినిఁగాంచి వీరెవరో బ్రాహ్మణ సంతానమైయుందురని గ్రహించిరి. ఆతఁడిద్దర నెత్తి మహారాజునకొసంగెను. మహారాజిట్టి సుకుమార కుమారులను గాంచి పరమ ప్రముదితుఁడయ్యెను. ఆతఁడు తన పుత్రులవలె వారినిఁబాలన పోషణము కావించి, వారికి

బ్రాహ్మణోచితములగు సమస్త సంస్కారముల నొనర్చెను. రాజు కృపావశమున వారినిఁ బోషించెను కావునఁగుమారునకుఁ గృపుఁడనియు, కుమార్తెకి కృపియనియుఁ బెట్టిరి. వారు క్రమముగ రాజభవనమునఁ బెరుగుచుండిరి.

ఇచ్చట శరద్వానుఁడు వెళ్ళిపోయిన తరువాత నాయప్సరస కృతకార్యయై, స్వర్గమునకుఁబోయెను. ముని గంగాస్నాన మొనర్చి, వేదమాతయగు గాయత్రిని జపించి, జలములో మునిఁగి అఘమర్షణమంత్రము నుచ్చరించెను. ఆతఁడు మరలఁదన యాశ్రమమును వచ్చి ధనుర్వేదాభ్యాసము నొనర్చుచుండెను. తపఃప్రభావముచే నాతఁడు కృపీ కపుల జన్మమునుగూర్చి తెలిసికొనెను. ఆతఁడు శంతనుని సమీపమునకు వచ్చి, తన విషయమును బూర్ణముగఁ జెప్పికొని పుత్రుని, పుత్రికను బ్రేమించెను. ఇంతే కాక ఆతనికి వచ్చిన ధనుర్విద్యనంతను దన పుత్రుఁడగు కృపునకు నేర్పెను. మునియగు కృపుఁడు ధనుర్విద్యాపారంగతుఁడుఁ కాఁగానే ఆతఁడు తరువాతఁ గౌరవపాండవులకు ధనుర్వేద శిక్షణాచార్యుఁడుగ నియుక్తుఁడయ్యెను అందువలన నీతఁడు కృపాచార్యుఁడను పేరఁబరగెను.

కృపి వివాహయోగ్య యయ్యెను. శంతనుమహారాజునకు ఆమె వివాహచింత పట్టుకొనెను. కృపికి అనురూపముగ నెవఁడైనఁ దేజస్వియు, యశస్వియునగు మునిపుత్రుఁడుదొఱ

కినచో నట్టివానితో వివాహము చేయవలయు
నని యుండెను. ఆదినములందు భరద్వాజముని హరిద్వార
మునకు సమీపమున ఘోరతపస్సును జేయుచుండెను. దైవ
యోగమున ఘృతాచి అప్సరసవలన నాతనివీర్యమును స్ఖలిత
మయ్యెను దాని నాతఁడు ద్రోణమను యజ్ఞపాత్రమునం
దుంచెను. దానివలన ద్రోణుఁడను బుత్రుఁడుదయించెను
భరద్వాజ మహామునికి పుత్రుఁడగు ద్రోణుఁడకన్య బ్రహ్మ
చారులతోఁబాటుగ వేదవేదాంగములను జదివించెను.
మువాశ్రమమందు ఉత్తరపాంచాల దేశాధిపతి వృషదుని
పుత్రుఁడగు ద్రుపదుండును జదువుచుండెను. విద్యాభ్యాసకాల
మున రాజపుత్రులకును, మునిపుత్రులకును భేదభావముండనే
యుండదు. ద్రోణ ద్రుపదులు కలిసి చదువుకొనుచుఁ గలిసి
యాడుకొనుచుండిరి. ఇద్దరును మిత్రులై, ఒకరినొకరు మిక్కిలి
ప్రేమించుకొనుచుండిరి. ద్రోణుఁ ధనుర్విద్యయందద్వితీయుడు.
ఆతఁడు తన తండ్రిశిష్యుడగు నగ్నివేశుని వలన నాగ్నేయా
స్త్రమును నేర్చుకొనెను పరశురామునివలనగూడ ధనుర్వేద
శిక్షణను బొందెను. కాలాంతరమున వృషదమహారాజు పర
లోకవాసియయ్యెను. ద్రుపదుఁడు పాంచాలదేశ రాజసింహా
సనము నెక్కెను. భరద్వాజముని తరువాత ద్రోణుఁడు తన
తండ్రి యాశ్రమమున నుండి ధర్మాచరణ మొనర్చుచుండెను.
ఆతఁడు గృహస్థుఁడు కాఁదలఁచెను. ఆతఁడు శంతను మహా
రాజుకడకు కృపిని యాచించుటకై వచ్చెను. రాజు ఆతఁడు

యోగ్యవరుఁడని భావించి సహర్షముగఁ గృపిని ద్రోణున కొసంగి వివాహము కావించెను. కృపివంటి ప్రతివ్రతయగు పత్నిని బొంది ద్రోణాచార్యుఁడు పరమ ప్రముదితుఁడయ్యెను. ఆతఁడామెతోఁగలసి అగ్నిహోత్రాది సమస్త ధర్మాచరణ మొనర్పసాగెను. కొంతకాలమున కాతనికొక పుత్రుఁడుదయించెను. పుట్టఁగానే ఆతఁడు అశ్వమువలెనొక్క శబ్దము నొనర్చెను అందువలన నాతనికశ్వత్థామయను పేరిడఁబడినది. ముని కడ తపోధనము కలదు. ఇతర ఋషులవద్ద గోవులును నుండెడివి వారిపిల్లలావుపాలను త్రాగెడివారు. అశ్వత్థామ తండ్రియగు ద్రోణాచార్యునివద్ద గోవులులేవు. ముని పుత్రులను గాంచి అశ్వత్థామయును బాలుఁడుగనుండెను. కృపి పిండిని నీటితోఁగలిపి పాలని చెప్పి యిచ్చుచుండెడిది. అవి నిజముగు పాలుకావని తరువాత నశ్వత్థామునకుఁ దెలిసెను. ద్రోణాచార్యునకును దుఃఖము కలిగెను. తన మిత్రుఁడగు ద్రుపదుఁడిప్పుడు రాజయ్యెనని ఆతనికి స్మరణమునకు వచ్చెను. ఆతఁడు తప్పక సహాయ మొనర్పఁగలఁడని ఆతఁడు ద్రుపద రాజధానికిఁ బోయెను. ద్రుపదుని గలిసికొని ఆతండత్యంతానందమును ప్రకటించుచు నిట్లనను:- "రాజా! నీవు నన్ను గుర్తింపలేదా యేమి? నేను భరద్వాజ నందనుఁడను నీకు సుహృద సఖుఁడను, మిత్రుఁడవగు ద్రోణుఁడను నేను రాజైనప్పుడు నీవు నా యైశ్వర్యమును నాతో నుపభోగింపవచ్చునని నీవంటివి."

ఇది వినఁగానే ఐశ్వర్యమదమున మదాంధుడైన పాంచాల దేశాధీశుఁడగు ద్రుపదుఁడిట్లనెను:- "బ్రాహ్మణదేవా! నీవుచాలా అమాయకుఁడవు. ఐశ్వర్యశాలియగు రాజునకును, నొక దరిద్ర బ్రాహ్మణునకును నెక్కడమైత్రి! ఓయీ! నేనును నీవును నొక్కస్థితిలో నున్నప్పుడు మనకిద్దరకును బరస్పర స్నేహముకలదు. మైత్రి సమానగుణము కలవారితోనుండును. ఇప్పుడు నేను రాజునైతిని. నీవట్లుదరిద్ర బ్రాహ్మణుఁడవుగ నుంటివి. ఆమాటలను మఱచిపొమ్ము నీవైశ్వర్యభోగేచ్ఛను వీడుము. అవసరమైనచో నీకొక రోజునకుఁ గావలసిన బియ్యము నిప్పింపఁగలను."

సూతుఁడిట్లనెను:- "మునులారా! ద్రుపదమహారాజు యొక్క యిట్టి తిరస్కార పూర్ణములగు వచనములను విని ద్రోణాచార్యుఁడు పరమ క్రుద్ధుఁడై యుండెనుగాని అతఁడేమియునన లేదు దెబ్బనుదినిన త్రాచుఁ గ్రోధముతోఁ బోవునట్లాతఁడు లోలోన ద్రుపదుని యెడలఁ గసిదీర్చు కొనవలయునని నిశ్చయించుకొని అచ్చటినుండి హస్తినాపురమునకుఁబోయెను అచ్చటికిఁబోయి ఆతఁడు తన బావమఱఁదియగు కృపాచార్యుని యింటిలో నుండెను భీష్మ పితామహుఁడు కౌరవ పాండవుల శస్త్ర శస్త్ర విద్యలలో నధిక శిక్షణమొసంగఁగల యాచార్యుని కొఱకన్వేషించుచుండెను. ఆతనికి ద్రోణాచార్యుని రాక విషయము తెలియఁగానే ఆతఁడత్యంత హర్షితుఁడయ్యెను.

ఆతఁడు ద్రోణాచార్యుని వారికాచార్యుఁడుగ నియమించెను. అప్పటినుండి చివరవఱకు ద్రోణాచార్యుఁడును నాతని పత్ని యగు కృపియును, పుత్రుఁడగు నశ్వత్థామయును హాస్తినాపురమందే నివసించుచుండెను గురుదక్షిణగ నాతఁడు తనశిష్యులతో ద్రుపదునిఁబట్టి కట్టితెమ్మనెను. ఆతని యర్థరాజ్యమును తాను దీసికొని మరల నిచ్చివైచెను. కృపాచార్యుఁడు కౌరవులకు కులగురువేకదా! అతఁడు మహాభారతయుద్ధము నుండియు జీవితుఁడై రక్షించుకొనఁగలిగెను. చివరవఱకును ధర్మరాజగు యుధిష్ఠిరుని కడనుండెను. ఇది నేనత్యంత సంక్షేపముగ కృప. కృపీలయొక్క కథను జెప్పితిని. ఇప్పుడు మీరేమి వినఁదలఁచుచున్నారు?"

శౌనకుఁడిట్లనెను:- "సూతా! నీవు మత్స్యపుత్రుఁడగు బృహత్క్షత్రుని వంశమును గూర్చి వర్ణించితివి ఇప్పుడు మేము పాంచాలదేశపు రాజవంశమునుగూర్చి విన నుత్సహించుచున్నాము. కృపతో వారికథను జెప్పుడు."

సూతుఁడిట్లనెను:- "మంచిది స్వామీ! ఇప్పుడు నేను వారి వంశమునుగూర్చియే వర్ణించెదను."



ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! ద్రౌపదీదేవి యజ్ఞకుండమునుండి యెట్లు పుట్టినది? ధృష్టద్యుమ్నుఁడెట్లు యజ్ఞవేదినుండి యుదయించెను? కృపతో నీవృత్తాంతము మీరునాకుఁ జెప్పవలయును."

ఇది విని సూతుఁడిట్లనెను:- "మంచిది స్వామీ! వినుఁడు. నేనీపుణ్యప్రదమగు పరమపావన చరిత్రమును జెప్పెదను. కృప, కృపీకథాప్రసంగమున నేను ద్రోణాచార్యుని జన్మకథను గూర్చి చెప్పితిని. ఆతఁడు తనకు సహపాఠియును, బాల్యమిత్రుఁడునగు ద్రుపదునికడకు ధనమును యాచింపఁబోయెను. ఆసమయమున ద్రుపదుఁడవమానించెను. ఆతఁడు తిరస్కరించుచు నిట్లనెను:- "రాజునకు మిత్రుఁడు రాజైయుండవలయును."

ఈవిషయము ధనుర్ధరుఁడగు ద్రోణునకు హృదయమున గ్రుచ్చుకొనెను. ఆతఁడు లోలోనఁ బ్రతీకారమును జేయఁదలఁచెను. ఆతఁడు హస్తినాపురమునకుఁబోయి ధృతరాష్ట్ర పాండుపుత్రులకు ధనుర్వేద శిక్షణమున కాచార్యుఁడయ్యెను. ఆకుమారులందఱును ధనుర్వేదము నభ్యసింపఁగనే ద్రోణాచార్యుఁడు గురుదక్షిణ ప్రసంగము రాఁగానే యిట్లనెను:- "మీ రందఱునుబోయి ద్రుపదమహారాజును అతని మంత్రులతోఁ గూడఁకట్టి నాకడకుఁ దీసికొనిరండు. నాకీగురుదక్షిణ చాలును"

నంతవఱకు వారికనిష్ట మొనర్చుటకుఁ బ్రయత్న మొనర్చెదరు. స్వయముగఁ దానుజేయఁ జాలకుండినఁ బుత్రులచేత నైనను నిట్లు పలికెదరు:- "ఈతఁడు చేసిన నుపకారమునకు లేక అపకారమునకుఁ బ్రతీకారమొనర్ప వలయును." 



సూతుఁడిట్లనెను:- "మునులారా! నీవు నన్నుఁ బాంచాలదేశపు రాజవంశములను గూర్చి ప్రశ్నించితివి. దానిని నేను వర్ణించెదను. మహారాజగు భర్మ్యాశ్వునకైదుగురు పుత్రులుదయించినట్లును వారు పాంచాలు రనఁబడునట్లును నేనిదివఱకే చెప్పితిని. దీనివలననే ఆదేశమునకుఁ బాంచాలమను పేరువచ్చినది. ఆయైదుగురులో ముద్గలుఁడందఱకంటెఁ బెద్దవాఁడు ఆతనికి దివోదాసుఁడను బుత్రుఁడును, అహల్యయను బుత్రికయును గలిగెను అహల్యావంశ కథను నేనిదివఱకే చెప్పియుంటిని. ఇప్పుడు మీరు దివోదాసుని వంశవిస్తారమును వినుఁడు" 

మహారాజగు దివోదాసుని పుత్రుఁడు మిత్రేయుఁడు. మిత్రేయునకు నల్గురు పుత్రులు వారిపేరులు చ్యవన. సుదాస సహదేవ. సోమకులు. వీరిలో సోమకునకు నూర్గురు పుత్రులుద్భవించిరి. వారిలో జంతువందఱకంటెఁ బెద్దవాఁడు. పృషదుఁడందఱకంటెఁ జిన్నవాఁడు. పృషద పుత్రుఁడు మహారాజగు ద్రుపదుఁడు, ఆతని కగ్నికుండముచే ద్రౌపదియును, అగ్నివేదినుండి జ్యేష్ఠపుత్రుఁడగు ధృష్టద్యుమ్నుడు నుదయించెను.

# పాంచాల రాజుల వంశము.

(౭౭౯)

శ్లో॥ తస్య పుత్రశతం తేషాం యవీయాన్ పృషతః సుతః।
ద్రుపదో ద్రౌపదీ తస్య ధృష్టద్యుమ్నాదయః సుతాః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౨ అ. ౨ శ్లో.

వ......సుజన్మకృత్తునకు నూర్వురు గొడుకులుం గలి గిరి. వారిలో జంతువనువాఁడు జ్యేష్ఠుఁడు కడచూలు పృష తుండు, పృషతునకు ద్రుపదుండు, ద్రుపదునకు దృష్టద్యు మ్నాదులుదయించిరి.

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రతిశోధ భావన ప్రాణులకు స్వాభావికము ఒకచీమనుసివు వేలితో వత్తినచో నది వెంటనే కుట్టును. అదియును బ్రతికార మొనర్పఁ దలపడును. అందువలననే నీతికారులిట్లనిరి:— "చం పుటకు వచ్చినవానినిఁ జంపుటదోషముకాదు. గొప్పవారంద ఱును భగవదవతారములును నపకారులకుఁ బ్రతీకార మొన ర్చిరి- అపకార మొనర్చిన వారియెడలఁ బ్రతీకార మొనర్పక వానిని హృదయపూర్వకముగ క్షమించినవాఁడే సాధువు. ఆతఁడే వందనీయుఁడు. అట్లుకాని వారందఱును నపకార మొనర్చినవారి యెడలఁ గ్రోధముండనే యుండును చేతనై

ఇది వినఁగానే అందఱును వెంటనేపోయి, ద్రుపద రాజుయొక్క సేననోడించి, నిమిషములో ద్రుపదుని బంధించి ద్రోణాచార్యుని సమీపమునకు వచ్చిరి. తన యెదుట బంధితుఁడైన ద్రుపదునిఁగాంచి, పొడుగుపాటి గడ్డముమీఁదకి జేతితో నిమురుచు మందహాసమొనర్చుచు ద్రోణాచార్యుఁ డిట్లనెను:- "రాజా! బాల్యకాలమందు నీకును నాకును మైత్రి కలదు. నేను దానిని జ్ఞాపకమొనర్చుటకు నీయింటికిరాఁగా బాల్యకాలపు విషయములను మఱచిపొమ్మని నీవంటివి. ఆ సమయమునను మనమిద్దరమును నొకేస్థితిలోనుంటిమి. ఇప్పుడు నేను రాజనైతిని. నీవు భిక్షుకుఁడవైతివి. కావున నిప్పుడు నాకును నీకును మైత్రి యెట్లుపొసఁగును? రాజునకు మిత్రుడు రాజేయై యుండవలయును"

మహారాజా! నేను నీతో మరల మైత్రినిఁ జేయవలసి యున్నది ఇప్పుడు రాజునుగానిది మైత్రియెట్లు కుదురును? అందువలన నేను నిన్నుఁ బట్టి తెప్పించితిని, నీయొక్క విస్తృత రాజ్యము గంగకు ఉత్తర దక్షిణములందుకలదు, నేటినుండి నీవు గంగకు దక్షిణతటమున రాజ్యమొనర్పుము. నేనుత్తర తటమున రాజ్యమొనర్చెదను. అప్పుడు మనకిద్దరకును మైత్రి యేర్పడఁగలదు అంతేనా?"

ద్రుపదుఁడత్యంత లజ్జితుఁడయ్యెను, ఆతఁడోడిపోయెను ద్రోణునకుఁబైదీ. ఆధీనుఁడు. కావున నాతఁడు లజ్జించుచు

నత్యంత వినయముతో నిట్లనెను:- "స్వామీ! మీబుద్ధివిశాలమైనది మీవిద్యఫలించినది. మీగుణమువారమైనది. నేను మీకోడితిని. ఇప్పటినుండి మీ రెట్లాజ్ఞాపించిన నట్లే యొనర్చెదను"

ద్రుపదునియొక్క యీవినయవాక్కులను విని ద్రోణాచార్యుడు మరల బూర్వమువలె మైత్రిని స్థాపించుకొని ద్రుపదుని వదలివైచెను. ద్రుపదుడు ద్రోణాచార్యునకు గృతజ్ఞతను బ్రకటించుచు దన నగరమునకుబోయెను; కాని ద్రోణాచార్యునిచే నవమానింపబడుటచే నాతనికి మిక్కిలి ఆత్మగ్లానికలిగెను. ప్రేమచే బ్రేమయెట్లుపెరుగునో ద్వేషముచే ద్వేషమట్లుపెరుగును ద్రుపదుడును లోలోన నీయవమానమునకు ద్రోణాచార్యునకు బ్రతీకారమొనర్ప నాలోచించుచుండెను. ఆతండిట్లనుకొనెను:- "నేను ద్రోణు నస్త్రశస్త్రములలో నోడింపజాలను. మొదటగా నాద్రోణుడు స్వయముగ ధనుర్విద్యావిశారదుడు రెండవది పరశురామునికడ నాతడు దివ్యాస్త్రములను నేర్చినాడు పైగా గౌరవపాండవులాతనికి శిష్యులు! కావున యుద్ధమందాతని దేవేంద్రుడైన నెదుర్కొనజాలడు. ఏవిముగనైన దంత్రమంత్రములచే నేనాతనికి బ్రతీకారమొనర్పగలను; కాని యిట్టి అభిచారయజ్ఞమును జేయింపగల నాచార్యుడు నాకెచ్చట లభింపగలడు?" అనుకొని రాజు చింతతుడయ్యెను. ఆతడు

రాజ్యభారము నంతయును మంత్రుల పరమొనర్చి, స్వయముగఁదాను వనవనమున విద్వేషాగ్నితో మండిపోవుచు ద్రోణునకుఁ బ్రతీకారమొనర్చుటకై మున్యాశ్రమములందుఁ దిరుగు చుండెను.

ఒకసారి ఆతఁడు ఋష్యాశ్రమములందుఁ దిరుగుచు నొకసుందరమగు నాశ్రమమునకుఁ జేరుకొనెను. ఆతఁడచ్చటఁ దేజస్వులగు మునులను గాంచెను. వారి తపస్తేజస్సులను గాంచి, వారివలనఁ దనపని నెఱవేరునని ఆతఁడు తలంచెను. కావున నాతఁడు మిక్కిలి శ్రద్ధతో వారికి సేవాశుశ్రూషలొనర్చుచుండెను. ఆమునిసోదరులిద్దరపేళ్లు యాజ, ఉపయాజులనువారు. ఉపయాజుఁడు చిన్నవాఁడైనను దనయన్నకంటె మిక్కిలి తేజస్వి.

ఒక దినమున నేకాంతమున నాతఁడుపయాజునకు విధ్యుక్తముగఁ బూజనుగావించి యిట్లనెను:- "స్వామీ! నాకును ద్రోణాచార్యునకును బడుటలేదు. ఆతనివలన నాకవమానము జరిగినది. నేనవమానాగ్నిచే నహర్నిశలు మండిపోవుచున్నాను స్వామీ! నేను ద్రోణాచార్యుని యుద్ధమున జయింపఁజాలను. అందువలన మిమ్ముశరణు వేఁడితిని. నాకు ద్రోణఘాతియగు పుత్రుఁడుదయించి వారిచే ద్రోణుఁడు చచ్చునట్లుగ నొక యజ్ఞమును జేయింపుఁడు,"

ఇదివిని యుపయాజి మధురవచనములతో నిట్లనెను:- "రాజా! నీవు మమ్మిట్టి క్షుద్రులుగా భావించుచుంటివా యేమి? నావలన నిట్టి జఘన్యకార్యము నాశింపకుము."

ద్రుపదుఁడిట్లనెను:- "స్వామీ! నేను మీకు పదికోట్ల గోవుల నొసంగెదను. ఇంకనేది యడిగిన దాని నొసంగెదను"

అప్పుడుపయాజుఁ డిట్లనెను:- "రాజా! నీవు నన్ను లోభపెట్టకుము నేను లోభమునకు వశీభూతుఁడనై నీచ కార్యము నొనర్పఁజాలను"

ఇదివినఁగానే రాజునకు దుఃఖము కలిగెను, కాని అతఁడు నిరాశను జెందలేదు. అతఁడు మరల మిక్కిలి జాగ్రత్తగ నుపయాజుని సేవించెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! సేవచే భగవానుఁడైనను వశమగును ఎవడైన నేవిధముగను వశపడకుండినచో సేవాశుశ్రూషలచే వశమగును. సతీసాధ్వి తన సత్పతిని సేవ చేతనే వశమొనర్చుకొనును. సత్సేవకుఁడు స్వామిచే సేవచేతనే ఉచితానుచిత కార్యములను జేయించుకొనును సేవచేయు వాఁడు సేవను జేయుచుఁ జేయుచు స్వామియగును. స్వామి ఆతని కధీనుఁడగును. హృదయముతో సర్వసమర్పణమొనర్చి సేవను స్వార్థముతోఁ జేసినను నది యెన్నటికిని వ్యర్థము కాదు. ద్రుపదు సేవకులకు లొంగిపోయి ఒకదినమున నుపయాజుఁడిట్ల

నేను:- "రాజా! నీవింత శ్రద్ధగా నాకు సేవలొనర్చుచుండు టెందులకు? నీవు నావలన నీకార్యము జరుగునను నాశను వీడుము."

రాజిట్లనెను:- "స్వామీ! ఇప్పుడు నేనెచ్చటికిఁబోవుదును? నేను మీచరణములనే శరణు వేఁడితిని. ఇప్పుడు మీరు నన్ను స్వీకరించినను సరియే, త్రోసివేసినను సరియే. మీరు స్వయముగఁ జేయఁజాలకున్నచో దీని కేదైన నుపాయమును జెప్పుఁడు."

ఉపయాజి మహాముని యిట్లనెను:- "సరియే, మహారాజా! నేను నీకుపాయమును జెప్పెదను. మాయన్నయగు యాజుఁడీకార్యమును జేయింపఁగలఁడు. ఇంతగొప్ప దక్షిణ నొసంగినచో నాతఁడుచితానుచితములను విచారింపఁడని నా యనుమానము, ఒకసారి అన్నదమ్ములమిద్దర మెచ్చటికో పోవుచుంటిమి. దారిలో నొకఫలము పడియుండెను. నాసోదరుఁడు దానిని వెంటనే తీసికొనిపోయెను. ఆతఁడది పడియుండిన భూమి పావనమైనదా? అపావనమైనదా? ఈఫలము గ్రహింపఁదగినదా? గ్రహింపరానిదా? అనుసంగతిని విచారింపలేదు. ఈవిధముగ నాతఁడు పవిత్రతాపవిత్రలను విచారింపక, ఫలమును దీసికొనుటచే ఉచితానుచితములను జూడకయే రాఁగలఁడని నానమ్మకము బాల్యకాలమున మేమిద్దరమును జదువుకొన్నప్పుడు నాసోదరుఁడు ఇతరులయెంగిలి వస్తువులను మిక్కిలి

రుచితోఁదినెడువాఁడు. స్వాదిష్ట వస్తువులందాతఁడు ఉచ్ఛిష్టా నుచ్ఛిష్టమును విచారింపఁడు. ఈయన్ని విషయములను బట్టి ఆతఁడెవళ్యము నీయభిచారయజ్ఞమును జేయింపఁ గలఁడని యనుమానించు చున్నాను ''

యాజునియొక్క యీమాటలను వినఁగానే ద్రుపద మహారాజునకు ఆతనియెడల సేవగింపు కలిగెను. కాని, ఆతఁ డేమి చేయఁగలఁడు? స్వార్థులు దోషములను గాంచరు. వారేదోవిధముగ స్వార్థసిద్ధినిఁగావించు కొనఁజూచుచుందురు. ఉపయాజుని మాటనువిని యాతఁడు యాజుని సమీపమునకు వచ్చెను.

యాజుని సమీపమునకు బోయి రాజు మొదటనుండి చివరవఱకు వృత్తాంతమునంతను జెప్పుచు నిట్లుప్రార్థించెను:- "ప్రభూ! మీరు సర్వసమర్థులరు. ద్రోణునిఁజంపు పుత్రుఁడు కలుగునట్లు నాచే నొకయజ్ఞమును జేయింపుఁడు. నేను మీ కొక యర్బుదము గోవుల నొసంగెదను.''

మునివరుఁడగు యాజుఁడు ద్రుపదుని ప్రార్థనమును సహర్షముగ నంగీకరించెను ద్రుపదున కత్యంతానందము కలిగెను. యాజుఁడు చెప్పిన ప్రకారము సామగ్రుల నాతఁడల్ప కాలములోనే సమకూర్చెను కార్యము గొప్పదగుటచే నాతఁడుపయాజుని సహాయమునుగూడ కోరెను. ఉపయాజున కిష్టము లేకున్నను నన్నమీఁదఁగల గౌరవముచేతను. ద్రుప

దుని బలవంతముచేతను యాజుని కార్యమునందాతఁడు సహాక రించెను. మిక్కిలి విధివిధానము ననుసరించి యజ్ఞములోని సమస్త కార్యముల నొనర్చెను. యజ్ఞాంతమందు యాజమహాముని దుపదుని రాణినిఁబిలిచి యిట్లనెను:- "దేవీ! నీవాలస్య మొనర్పక నిచ్చుటకిరమ్ము. ఈయజ్ఞ శిష్టాన్నమును దినుము.

రాణీ యిట్లనెను:- "స్వామీ! నేఁడు నేనాలస్యముగ నిద్రలేచితిని ఇప్పటికింకను దంతధావన మొనర్పలేదు. రాత్రి పూసుకొనిన సంగరాగాదులింకను నాశరీరమునఁగలవు. ఇప్పుడు నేను శౌచనమునకుఁ బోవుచున్నాను. పండ్లు తోము కొని స్నానముచేసి మీసమీపమునకు వచ్చుటకు యోగ్యన య్యెదను. అప్పటివఱకు మీరుకనిపెట్టుకొని యుండుఁడు."

యాజమహాముని యిది తనకవమానమని భావించి యిట నెను:- "రాణీ. నేనత్యంత పరిశ్రమతో, నత్యంత విధి విధానము ననుసరించి యీహావిస్సును సిద్ధమొనర్చితిని. యజ్ఞ కార్యములలో విలంబమొనర్పరాదు. నీవాలస్య మొనర్పక యీహావిస్సును దీసికొనఁదలఁచిన దీసికొనుము. అక్కఱ లేకున్నచో బయటనిలుచుండి విచిత్రమును గాఁచుము"

ఇటు పలికి ముని అభిమంత్రితమగు హావిస్సునుసంతాన సంకల్పముచే వెంటనే అగ్నియందు హోమము గావించెను. దానిని హోమముచేయఁగానే అగ్నినుండి గొప్ప తేజస్వియగు

పుత్రుఁడు కవచమును ధరించి బయలుదేరెను. ఆతఁడు పరమ తేజస్వి. ఆతఁడు కోపమున నలుదిక్కులను నిర్భయుఁడై జూచుచుండెను. అంతనొక మిక్కిలి రూపవతియగు గన్యకను నుత్పన్నము కావించెను. ఆమెవర్ణము కృష్ణకమలమువలె నుండెను. ఆమె సౌందర్యమద్వితీయమైనది ఋషులు పుత్రునకు ధృష్టద్యుమ్నుఁడనియు, పుత్రికకుఁగృష్ణయనియుఁ బేరిడిరి. ద్రుపద పుత్రియగుటచే నీమె ద్రౌపదియనియుఁ బిలువఁబడుచుండెను. ధృష్టద్యుమ్నుఁడు పుట్టఁగానే ఆకాశవాణి యిట్లనెను:- "ఈతఁడు పాంచాలుర యశస్సును వృద్ధిపొందింపఁ గలఁడు. ద్రోణుని వధింపఁగలఁడు."

ద్రుపదుని భార్య యజ్ఞవేదినుండి మిక్కిలి సుందర సుకుమారులగుపుత్రికా పుత్రకులనుగాంచి మిక్కిలి యానందించెను. ఆమె చేతులను జోడించుకొని ఋషులతో నిటనెను:- "విప్రగణములారా! ఈయిద్దరు పిల్లలును నన్నే తల్లిగా భావించునటుగ నాశీర్వదింపుడు. ఇంక నితర స్త్రీలయెడ వీరు మాతృభావమును నెఱపకుందురుగాక!"

బ్రాహ్మణులిట్లనిరి:- "అట్లేయగుగాక!" అప్పటినుండి వారిద్దరును ద్రుపదుని జ్యేష్ఠపత్నినిఁ దనతల్లిగాఁ జూచుకొనిరి.

ధృష్టద్యుమ్నుఁడు పెద్దవాఁడయ్యెను. అప్పుడు ద్రుపదుఁడు వానినిఁదీసికొని ద్రోణాచార్యుని కడకుఁబోయి, వినీత

భావముతో నిట్లనెను:- "ఆచార్య ప్రవరా! వీఁడు నాబాలకుఁడు. వీనికి మీరు ధనుర్వేదమును విద్యుక్తముగ శిక్షణ మొసంగుడు."

ద్రోణాచార్యున కంతయును దెలియును. ఆతఁడుతనను జంపుటకే యజ్ఞవేదినుండి పుట్టినాఁడనుసంగతి ఆతనికిఁ దెలియనిది కాదు. అయినను నాతఁడు తన యాచార్య పదగౌరవమున వానికి ధనుర్వేద శిక్షణమునొసఁగెను. కృష్ణయగు ద్రౌపది పెద్దది కాఁగానే పంచపాండవులకుఁ బత్నియయ్యెను.

సూతుఁడిట్లనెను:- "ఋషులారా! నేనత్యంత సంక్షేపముగ మీకు ధృష్టద్యుమ్నునియొక్కయు, ద్రౌపదియొక్కయు యుత్పత్తి కథను జెప్పితిని. ఇప్పుడు మీరేమి వినఁగోరుచున్నారు? ధృష్టద్యుమ్నుని పుత్రుఁడు ధృష్టకేతువు. ఈవిధముగఁ బాంచాలవంశము వృద్ధియయ్యెను.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! మాకిప్పుడు నీవు కౌరవుల వంశమునుగూర్చి చెప్పుము కురుఁడెవఁడు?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! కురుడు భరతవంశమునను యుద్భవించెను. బృహత్క్షత్రుని పుత్రుఁడు హస్తి. ఆతని జ్యేష్ఠపుత్రుఁడు అజమీఢుఁడు ఆతనికిఁ జాలమంది భార్యలు కలరు. ఆతని పుత్రులలోఁ గొందఱియొక్క వంశవర్ణనము నిదివఱకే చెప్పియుంటిని. ఆతనికి ఋక్షుఁడను పుత్రుఁడొకఁ

డు దయించెను. ఋక్షునకు సంవరణుఁడను సుతుఁడుదయించెను ఈసంవరణుఁడు గొప్ప ధర్మాత్ముఁడును, యశస్వియునై యుండెను. ఈతఁడు సూర్యతనయయగు తపతిని వివాహమాడెను. కురుకులసంస్థాపకుఁడగు కురుమహారాజీమె గర్భమున నుద్భవించెను. సంవరణుఁడు సూర్యభగవాను నారాధించియే ఆతని పుత్రికయగు తపతినిఁబొందెను. అందువలనఁ గౌరవ పాండవులు తాపత్యులనఁబడిరి,

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! మాకు పరమ ధర్మాత్ముఁడగు సంవరణుని కథను విస్తారపూర్వకముగఁ జెప్ప వలయును. ఆతనికిని తపతికిని వివాహమెటు జరిగినది?"

సూతుఁడిట్లనెను:- "సరియే స్వామీ! ఇప్పుడు నేను తపతీ సంవరణుల కథను జెప్పెదను, మీరందఱును సావధానులరై వినవలయును."



# సంవరణమహారాజు కథ.

(౭౮౦)

శ్లో॥ ధృష్టద్యుమ్నా ద్ధృష్టకేతు ర్భా ర్మ్యాః పాంచాలకా ఇమే।
యోఽజమీఢ సుతోహ్యన్య ఋక్షః సంవరణస్తతః
శ్రీభాగవ. ౯ స్కం. ౨౨ అ. ౩ శ్లో.

వ॥ ధృష్టద్యుమ్ననకు ధృష్టకేతువు పుట్టె వీరలు పాంచాలరాజులని యెఱుఁగుము. మఱియు నయ్యజమీఢుని కొడుకు ఋక్షుండు ఋక్షునకు సంవరణుడుదయించె.

శ్రీమదాంధ్ర భాగవతము.

విపత్తు వచ్చినయెడల మనమధీరుల మగుచుందుము; హానికలిగినచో మనము దుఃఖితుల మయ్యెదము. కాని మంగళమయ ప్రభువెన్నటికిని తన పుత్రుల కమంగళ మెన్నటికినిఁ గావింపఁడను విషయమును మఱచిపోవుచుందుము. నిత్యసుఖరూపుఁడగు శ్యాముఁడెవరికిని దుఃఖమును గలిగింపఁడు. విపత్తు సంపత్తుకొఱకే వచ్చుచుండును, దుఃఖప్రాప్తి సుఖముకొఱకే; హాని లాభముకొఱకే వచ్చుచుండును. భగవానుఁడు మనకు దీనివలన నధికలాభము నొసంగుటకే మనకీహానిని గలిగించుచున్నాఁడని మనము హానియందును బూర్ణవిశ్వాసముంచవలయును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! మీరు నన్నుఁ బుణ్య శ్లోకుఁడగు సంవరణమహారాజు కథను జెప్పుమని. యడిగితిరి. ఋక్ష మహారాజు పుత్రుఁడగు సంవరణుఁడు మిక్కిలి సుందరుఁడు, ప్రియదర్శనుఁడు శరత్పూర్ణచంద్రునిఁగాంచి చకోరములు ప్రముదితములైనట్లు ప్రజలాతని దర్శనముచేఁ బ్రముదితులగుచుండిరి. ఆతఁడు ధర్మాత్ముఁడు, న్యాయప్రియుఁడు, సత్యవాది. దీనవత్సలుఁడు, రూపమందును, నుదారతయందును సమస్త గుణములందును, నాతఁడద్వితీయుఁడు మహారాజు మృగయాప్రియుఁడు. ఆతఁడప్పుడప్పుడు సైనికులతోడను, సేవకులతోడను మృగయానిమిత్తమై వెడలుచుండును.

ఒకదినమున నాతఁడు తన సచివులను, సైనిక సామంతులను, సేవకులను వెంటఁబెట్టుకొని ఒకరమణీయమగు పర్వత ప్రాంతమునకు వేటకొఱకై బయలుదేరెను. అచ్చట నతఁడనేక మేధ్యహింసక పశువులనుజంపి, ఆనందపూర్వకముగ సహచరులను వెంటనిడుకొని ఒకవనమునుండి యింకొక వనమునకుఁ దిరుగుచుండెను. కొంతదూరము పోఁగా మహారాజున కొక విశాలశరీరముకల శూకరము కనఁబడెను. రాజు తన గుఱ్ఱమును దానివెంట వదలెను. శూకరము మిక్కిలి శీఘ్రముగఁ బోవునది. అదివాయువేగమునఁ బరువిడుచుండెను. రాజు తన సంపూర్ణబలముతో గుఱ్ఱమునువదలెను. గుఱ్ఱమును దః పూర్ణబలమును జూపెను. అవి ఆకాశమునఁ బోవుచున్న

ట్లుండెను. ముందొక చెట్టు కనఁబడెను గుఱ్ఱమునకు గుద్దుకొని దెబ్బతగిలెను. గుద్దుకొనఁగానే మహారాజుమారమున నిసు కలోఁబడెను. గుఱ్ఱము పడఁగానే చచ్చెను.

దట్టమగు భీకరారణ్యమున రాజేకాకియయ్యెను దానికి తోడుగానున్న గుఱ్ఱము బంచత్వమును జెందెను. ఇసుకలోఁ బడుటచే రాజు శరీరమునకు దెబ్బతగులలేదు. గుఱ్ఱము నచ్చ టనేవదలి మహారాజటు నిటుఁ బర్వతప్రాంతమందు రమ్యమగు చోటులఁ బరిభ్రమించుచుండెను. వసంతఋతువు. వన శ్రీ సంపూర్ణ శృంగారమొనర్చుకొని తన ప్రియతముని సంతోషిం పఁజేయుటకై నిలువఁబడియుండెను. శీతలమందసుగంధిత పవ నము లివ్వన వీచుచుండెను. సెలయేరులు పారుచుండెను సరి త్తులు స్వచ్ఛశీతల సలిలముచేఁ బ్రవహించుచుండెను. వృక్ష ములమీఁదఁ గూర్చుండి విహంగములు భావతికి స్వాగత మొసంగుటకై గీతములాలాపించు చున్నట్లుండెను. ప్రకృతి యొక్క యిట్టి మనోహరమగు సౌందర్యమునుగాంచి రాజు మిక్కిలి హర్షితుఁడయ్యెను. అతఁడుల్లాసముతో ముందుకకుఁ బోయెను. ముందాతఁడు చూడఁగా నొక పర్వతముయొక్క సుందరమగు శిఖరము గోచరించెను. దానిమీఁదఁ జిన్నచిన్న పారిజాతవృక్షములు దట్టముగనుండెను. వానిమీఁదనుండి యెఱ్ఱతొడిమలుగల తెల్లని పారిజాతకుసుమములు వానికవే రాలి నేలమీఁదఁ బక్కపఱచినట్లుండెను. పచ్చనిగడ్డి మీఁద

నాచిన్న సుందర సుమములు పచ్చమఖమల్లు దుప్పటిమీఁద లతాపుష్పములను గుట్టినట్లుండెను. వృక్షముల సందుకుండా రాజు అచ్చట సువర్ణప్రతిమవలె నొకదివ్యసుందర సుకుమార శరీరిణియగుబాల కూర్చుండియుండునట్లు గాంచెను. ఆమె శరీరమునుండి ఒక దివ్యతేజము వెలువడుచుండెను. ఆమె సూర్య ప్రభవలెను, అగ్నిజ్వాలవలెను, ఘనీభవించిన తేజమువలెను వెలుఁగుచుండెను. ఆమె ముఖము కమలమువలె మృదువుగను స్నిగ్ధముగను నుండెను. ఆమె నల్లనికుంచితకేశములు భ్రమర పంక్తి వలె ముఖమండలమందు విఱియఁబడియుండెను. ఆమె మూర్తీభవించిన సౌందర్యమువలెఁ గనఁబడుచుండెను. ఆమె విశాల లలాటమందు తిలకము సువర్ణకమలమందు పీరవధూటి కూర్చుండినట్లు శోభించుచుండెను. వికసించిన కమలమువలె నున్న నామె విశాలనేత్రములు సరసాను రాగముచేఁబూర్ణమై యుండినట్లుండెను. కృష్ణసర్పమువలె నామెవీపుపై నున్న వేణి యూగుచుండెను. ఆమె నవ్యచంద్రబకృతిసౌందర్యమును నత్యం తానురాగభరిత దృష్టితోఁ గాంచుచుండెను. దృష్టి పడఁగానే సంవరణ మహారాజు తన్నుఁదాను మఱచెను. ఆమెకడకుఁ బోయి అత్యంత మధురస్వరముతో నిట్లనను:— "దేవి! నీవెవరు? ఇట్టిసౌందర్యమును నేనెన్నడును దేవతలలోఁగాని, కిన్నరులలోఁగాని, గంధర్వులందుఁగాని, విద్యాధరులందుఁగాని చూడలేదు. ఇఁక మానవులసంగతినిఁ జెప్పనేల?"

ఇదివిని యాసుందరి సంకోచముతో నిలుచుండెను. ఆమె నోటినుండి ఒక్కమాటయైనను మాటాడలేదు.

అంతరాజు అధీరుఁడై యిట్లనెను:- "వరవర్ణినీ! నీవు లజ్జించెదవేల? నాకు నీపరిచయము గొనుము. నేను భరత వంశమహారాజగు ఋక్షుని పుత్త్రుఁడను. నన్ను సంవరణుఁడందురు. నీదర్శనముచేతనే నాస్పృహ తప్పుచున్నది. నీవు నాపైఁ గృపను జూపుము. నేఁటివఱకెందరో యువతుల నేను గాంచితిని; కాని యిట్టిసౌందర్యమును, ఇంతటి మాధుర్యమును, నిట్టి అనుపమమగు కాంతిని నేను నేఁటివఱకెచ్చటను జూచియుండలేదు."

రాజునోట నిట్టి ప్రశంసావాక్యములను వినఁగానేసుందర దంతపంక్తిగల యాసుందరి నవ్వుచు నవ్వుచునే ఆకాశము వైపుగా నంతర్ధానమయ్యె, అట్టిరూపరాశియగు లలనాలలామ తనకన్నులయెదుట మాయమగుటను గాంచఁగనే రాజు మూర్ఛితుఁడై భూమి మీఁదఁబడెను. అతనికి శరీరస్పృహలేదు. ఆతఁడు శోకసంతప్తుఁడై దీర్ఘనిశ్శ్వాసములను విడువసాగెను.

కొంతసేపటికి మహారాజు నేత్రములను దెఱచెను. ఆతఁడు చూడఁగా ఆమెయే రతీదేవివలె సుందరముగ నాతని కెదుట నిలుచుండెను. ఆమె వీణావినిందిత సర్వరమున సంకోచమున మెల్లమెల్లఁగా నిట్లనెను.- "నరదేవా! నీవీ సప్తద్వీపవతియగు వసుంధరకేకైకాధిపతివి. నీవిట్లు మోహమునకు వశపడుట శోభింపదు."

ఆయువతియొక్క యీశబ్దములు రాజుయొక్క కర్ణకుహరములందు సుధారసమును గుమ్మరించినట్లుండెను. ఆమెయొక్క మధుమయ సంగీతమయ సరసశబ్దములను విని నవరుడిట్లనెను:- "దేవి! నేను నీసౌందర్య సుధాసాగరమందు మునిఁగి మూర్ఛితుఁడనైతిని. భామినీ! నీవు నాకు జీవనదానమొసంగెదవా? నీవునన్ను స్వీకరించి, నీయనుచరునిఁగఁ జేసికొనినచో నేనుజీవింపఁగలను. లేకున్న నేను నాజీవితాశను వదలుకొంటిని."

అంత నాతేజఃపుంజయగు రమణి యిట్లనెను:- "నరదేవా! నీవు ప్రపంచమున సమస్త పురుషులలో సుందరుఁడవు. నీయైశ్వర్యమపారము. నీవింత వ్యాకులుఁడ వయ్యెదవేల?"

రాజిట్లనెను:- "చంద్రాననా! నిన్నునిమిత్తముగఁ జేసికొని యీయనంగుఁడు దాగియుండి నామీఁద నిరంతరము బాణవర్షమును గురిపించుచున్నాఁడు. దీనిచే నాశరీరమంతయును క్షతవిక్షతమైనది. నీవు నాకు వశవర్తినివగుచో నేను విశ్వవిజయుఁడనుగ భావించుకొందును. నీవునాతో గాంధర్వవివాహ మొనర్చుకొనినచో నాశరీరమున నవజీవన సంచారము కాఁగలదు"

అంతనావారాంగన యిట్లనెను:- "పురుషోత్తమా! నేను నాశరీరము నెవరికిని స్వాధీనమొనర్ప స్వతంత్రినుగాను

నేనింకను కుమారిని. నాతండ్రి నన్నెవరికొసంగిన నేను వానితో నాజీవనమును గడుపవలయును."

రాజిట్లనెను:- "సుభ్రూ! నీవెవని పుత్రికవు? నీతండ్రి యెచ్చట నివసించును?"

కన్యక యిట్లనెను:- ప్రభూ! నేను సమస్త ప్రాణుల యొక్క కర్మలకు సాక్షియును, చరాచరములకు స్వామియును తేజోరాసియునగు సూర్యనారాయణుని పుత్రికను. సావిత్రి నాకు అక్క. నేనామెకంటెఁ జిన్నదానను. నన్నుఁ దపతి యందురు. మీరు నన్నుఁ బొందఁదలచినచో నాతండ్రికడకుబోయి యాచింపుము. మహారాజా! నీవు నన్నుఁగూర్చి యెట్లధీనుఁడవై యుంటివో నేనును నట్లే నీకొఱకు వికలనై యున్నాను. కాని పండితులు స్త్రీస్వాతంత్ర్యమును గూర్చినిందించిరి. బాల్యమున నామె తండ్రిలేక పోషకుని యధీనమున నుండవలయును యౌవనమునఁ బతి యధీనమున నుండవలయును. వృద్ధావస్థ యందు పుత్రులయిచ్ఛాను సారముగఁ బోవలయును. మీరు పూజా, వ్రత, తపో, పవాస, ప్రణామములద్వారా నాతండ్రిని బ్రసన్నుఁ గొనర్చుకొనుఁడు. అతఁడు ప్రసన్నుఁడై నన్నువశ్యము మీకొసంగఁగలఁడు.

ఇట్లు పలికి తపతి వెంటనే అచ్చటనే అకాశమున నంతర్థాన మయ్యెను. రాజు మరల మూర్ఛితుఁడై నేలమీఁదఁ

బడెను ఇంతలోనే రాజుయొక్క సైనికులును, మంత్రులును, సేవకులను వెదుకుచు వెదుకుచు నచ్చటకువచ్చిరి గుఱ్ఱము చచ్చుటను గాంచి వారందఱును భయపడి, వివిధాలోచనము లలోఁబడిరి. ఇంకఁ గొంచెము ముందునకుఁబోఁగానే రాజు మూర్ఛితుఁడగుటను గాంచి వారందఱును దుఃఖితులైరి. రాజు మూర్ఛనుండి తేరుటకై వారనేకములగు నుపచారము లను గావించిరి. ఆతని కిరీటమునుదీసి శిరస్సునందు శీతల సలిల ధారను విడిచిరి. కమలములను ముకుటముగనొనర్చి ఆతని శిర స్సున నుంచిరి. కాని యాకమలములు క్షణములో నెండిపో యెను. రాజునకిప్పుడు కొంచెము చైతన్యము కలిగెను. తన సైనికులను, అనుచరులను, సచివులను గాంచి ఆతఁడింకను నధీరుఁడయ్యెను, రాజు కామపీడితుఁడై యిట్టి చేష్టలొనర్చు చున్నాఁడని వృద్ధ మంత్రి అనుమానముచే గ్రహించెను కావున నాతఁడందఱి నావలకుఁబొమ్మని మెల్లమెల్లఁగా రాజును సమస్త విషయములడిగెను. రాజొక్కటొక్కటిగ సమస్త విష యములనుజెప్పెను. మంత్రి రాజాజ్ఞచే సైనికులందఱను వీడ్కొలిపెను. ఆతఁడు రాజుతోఁగూడ నొంటరిగా నావన మందుండెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! మహారాజగు సంవ రణుఁడు తనవృద్ధమంత్రి సమ్మతిచే సూర్యనారాయణుఁబ్రసన్ను నొనర్చుకొనుటకై తపోనుష్ఠానముల నొనర్ప సాగెను.

—(౦)—

# తపతీ సంవరణుల వివాహము.

(౭౮౧)

శ్లో॥ తపత్యాం సూర్యకన్యాయాం కురుక్షేత్రపతిః కురుః।
పరీక్షిత్సుధనుర్జహ్ను ర్నిషధాశ్వః కురోః సుతాః॥

శ్రీభాగ ౯ స్కం. ౨౨ అ. ౪ శ్లో.

వ......ఋక్షునకు సంవరణుం, డాసంవరణుండు తపతి యనియెడి సూర్యకన్యయందుఁ గురువుం గనియె, నాకురువు పేరం గురుక్షేత్రింబయ్యె; నాకురువునకుఁ బరీక్షిత్తు సుధనువు జహ్నువు నిషధుండు ననువారు నలువురుపుట్టిరి.

శ్రీమదాంధ్రిభాగవతముః

ఏకోరికయును లేనివాఁడు జీవుఁడుకానేకాఁడు. జీవసంజ్ఞ కామముచేతనే కలుగును. భగవానునకుఁ గోరికలేదు. ఆతఁడు జీవులకు సుఖమొసఁగు కోరిక కలిగియుండును. అందువలన నప్పుడు తన భగవత్వమును మఱచి భూమిమీఁద నవతరించును. జీవులవలెనే క్రీడింపుచుండును. జీవుఁడు తనకాతఁడే సుహృదుఁడనియు, సరస్వమనియు భావించి, ఆతనికే సమస్తవాసనలనుజెప్పి, తన సమస్త కోరికలను నాతనికర్పించినచో, నాతనికి సమస్తమును లభించును, ఇహలోక, పరలోక సుఖములు రెండును లభించును, ఇట్లుచేయకుండిన జీవి కామమున

కధీశుఁడగును. అప్పుడాతఁడెనుబది నాలుగులక్షల యోనులలో దిరుగుచుండవలయును. ధర్మార్థ కామమోక్షములందు మనస్సుతో దేనిఁగోరినను భగవానుని శరణు వేఁడవలయును. ఆతనికొఱకే జప, తప, ఉపవాసాదు లొనర్పవలయును. వాంఛాకల్పతరువగు భగవానుఁడు జీవులయొక్క సమస్త కోరికలను అవియైహికమైనవి కానిండు, పారలౌకికమైనవి కానిండు నెఱవేర్చును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! కామసంతప్తుఁడగు సంవరణునకు తపతి సూర్యనారాయణుని శరణువేఁడుమని చెప్పఁగా రాజు తన సమస్తాను చరసమూహమును వీడ్కొలిపెను. ఆతఁడొంటరిగాఁ బర్వతశిఖరము మీఁదఁ గూర్చుండి సూర్యదేవు నారాధింపసాగెను. శుద్ధుఁడై ఆతఁడు జగత్పతియగు సూర్యనారాయణునకుఁ బ్రణామము కావించి, ఆతఁడు నిరాహారుఁడై ఒంటికాలిమీఁద నిలిచి తపస్సును జేయసాఁగెను. ఆతఁడు తనకులగురువగు వశిష్ఠభగవానునిస్మరించెను. పండ్రెండవ దినమునకు బ్రహ్మర్షి యగు వశిష్ఠుఁడు రాజు సమ్ముఖమున నుండెను ఏకాంతమందు తన గురువునుగాంచి సంవరణుఁడు పరమ ప్రముదితుఁడయ్యెను. ఆతఁడు భూమిమీఁదఁ బడి గురువుయొక్క పాదపద్మములకుఁ బ్రణామము కావించి, ఆతనిని యథోపలబ్దములగు నుపచారములచేఁబూజించెను.

రాజు పూజను స్వీకరించి మునియిట్లనెను:- "రాజా! నేను యోగబలముచే నీయొక్క సమస్త మనోగతభావముల నెఱిఁగితిని. నేను వివస్వంతుఁడగు సూర్యనారాయణుని కడకుఁ బోవుచున్నాను. ఆతని నీకొఱకు ఆతని కన్యకను యాచించెదను. భువనభాస్కరుఁడు నన్ను నిరాశగాఁబంపఁడని నానమ్మకము. ఆతఁడవశ్యము నీకొఱకు పరమసుందరియును, సుకుమారియు, సుందరియునగు నాకన్యకను దప్పక యీయఁగలఁడు."

రాజు చేతులను జోడించుకొని వినీతభావముతో నిట్లనెను:- స్వామీ! నాకాధారము మీరొక్కరే."

రాజుయొక్క వాక్యములకు ముని ప్రసన్నుఁడయ్యెను. ఆతఁడాకాశ మార్గమున నెగిరి యోగప్రభావముచే సూర్యలోకమునకు వచ్చెను. అచ్చట నాతఁడు తన దివ్యరథముపై విరాజిల్లుచుండిన ప్రభాపతియగు సూర్యునిఁగాంచెను. చేతులను జోడించుకొని వశిష్ఠుఁడిట్లనెను:- "ప్రభూ! నేను వశిష్ఠుఁడను. నేను బ్రహ్మమానస పుత్రుఁడను. నేను మీకు శ్రద్ధాభక్తులతోఁ బ్రణామమొనర్చుచున్నాను."

వశిష్ఠుని పరిచయమునుబొంది సూర్యదేవుఁడత్యంత ప్రసన్నుఁడై యిట్లనెను:- "వశిష్ఠా! నీవు వచ్చితివి. బాగున్నది నీకు స్వాగతము. రమ్ము, నాదగ్గఱగా నీయాసనమునఁ గూర్చుండుము."

ఇట్లు పలికి సూర్యదేవుఁడు సత్కారపూర్వకముగ వశిష్ఠునిఁ దన సమీపమునఁ గూర్చుండఁ బెట్టుకొని యిట్లు నను:- "వశిష్ఠా! నీవు వచ్చుటకేదైన విశేష ప్రయోజనమున్నచో నీవు నాకు నిస్సంకోచముగఁ జెప్పుము."

సూర్యునిచే సత్కృతుఁడై బ్రహ్మర్షి ప్రవరుఁడగు వశిష్ఠుఁడిట్లనెను:- "స్వామీ! ఈకాలమున భూమియందు ఋక్షుని పుత్రుఁడగు సంవరణుఁడున్నాఁడు. అతఁడు గొప్ప సుశీలుఁడు. ధార్మికుఁడు. ప్రజావత్సలుఁడు. భూమిపై నాతని బోలిన సుందరుఁడును. తేజస్వియు ధర్మాత్ముఁడునగు వాఁడింకొకఁడు లేఁడు. అందువలన నాతనికొఱకు మీ తపతియను కన్యను యాచింపవచ్చితిని."

ఇదివిని సూర్యదేవుఁడు మిక్కిలి యానందమును బ్రకటించుచు నిట్లనెను:- "మునివరులారా! నేను నాచిన్నకూఁతురగు తపతికొఱకై మిక్కిలి చింతితుఁడనైయున్నాను ఏలననఁగా నామెయెట్టి సుందరియో సుశీలయో ఆమెకట్టియోగ్యుఁడగు పతి లభించుట అత్యంతదుర్లభము. ఋక్షకుమారుఁడగు సంవరణుఁడు నరపతులందఱిలో శ్రేష్ఠుఁడు అతనిఁబోలిన సుశీలుఁడును, సుందరుఁడును, సర్వగుణ సంపన్నుఁడునగు వాఁడికొకఁడెచ్చట తపతికి లభింపఁగలఁడు? పైఁగా నీవంటి బ్రహ్మజ్ఞానియును, ఋషిశ్రేష్ఠుఁడును నన్ను యాచింపవచ్చినాఁడు. ఇది నాకును తపతికిని అదృష్టము. స్వామీ! ఈమె

నీపుత్రిక నీకిష్టమువచ్చినవాని కొసంగుము. అనిపలికి సూర్య భగవానుఁడు తపతిని వశిష్ట మహాముని వెంటఁబంపెను. వశిష్ట మహాముని సూర్యప్రభవలె వెలుఁగుచున్న నాకన్యను దీసి కొని ఆకాశమార్గమున నవనిపైకి దిగెను

ఇచ్చట సంవరణుఁడు తపతికొఱకేమియును దిసక త్రిగక మౌనధారణమొనర్చి ఘోరతపంబొనర్చు చుండెను. పండ్రెండు దినములాతఁడాహార పానీయములను గైకొన కుండెను ద్వాదశాదిత్య భగవానుఁడగు సూర్యుఁడాతని గుణ ములనుగాంచి యాతనికి దన కన్యకనొసంగెను. దూరమున నుండఁగనే రాజు వశిష్ఠునితోఁగూడ విద్యుత్తువలెను, మూర్తీ భవించిన తపస్సిద్ధివలెను నాలలనాలలామ అవనిపైకి దిగుటను గాంచెను. రాజుకన్నులు వికసించెను. ఆనందమును బ్రకటిం చుచు రాజు ముని పాదపద్మములకుఁ బ్రణామమును గావిం చెను. అప్పుడు వశిష్ఠుఁడు తపతిని సంవరణునకిచ్చి విధ్యుక్త ముగ వివాహమును గావించెను.

తపతినిఁ బత్నిరూపమునఁబొంది మహారాజు పరమ ప్రముదితుఁడయ్యెను. అతఁడు తన హృదయమును, సర్వస్వ మును దపతికి అర్పించెను. తపతియును రాజు చరణములకుఁ దన్నర్పించుకొనెను. ఇప్పుడు రాజునకుఁ దపతితప్ప యింకేమి యును నచ్చుటలేదు. రాజ్యము, పురము, పరివారము వీని యెడల నాతఁడుదాసీనుఁడయ్యెను: వృద్ధుఁడగు ప్రధానమంత్రి

ఆతని దగ్గఱనేయుండెను. రాజ్యము నాతనికప్పగించి తపతితోఁ గూడ ఆతఁడు వనమందే వాసముచేయుచుండెను ఆతఁడా మెను సుందరములగు వనోపవనములకుఁ గొనిపోవుచుండెను. వివిధములగు బుష్పములనుగోసి ఆతఁడామెకు హారమును గట్టును. ప్రేమభరితమగు హృదయముతో దాని నా మె కు వేయును. పుష్పములతో శృంగారించును. జడవేసికొను నప్పుడు రంగులరంగుల పూలనాతఁడు గ్రుచ్చును. సారాంశ మేమనఁగా సిప్పుడాతనికాలము నంతయును దపతికి ఆనంద మును గూర్చుటయందే గడుపుచుండెను. ఆతఁడు ప్రజాపాలన రూపమగు క్షత్రియధర్మము నెడలఁ బరాఙ్ముఖుఁడయ్యెను. దీనివలన సకాలమున వర్షములు కురియుట లేదు. పంటలుపండు టలేదు. ఆఁకలిచేఁ బ్రజలాహాకారములొనర్చి యేడ్చుచుండిరి. పండ్రెండు సంవత్సరములవఱకు రాజువనమందే యుండెను. అంతవఱకు ననావృష్టివలనను గాటకమువలనను బ్రజలంద ఱునుదుఃఖితులైరి. జనులందఱునుగలిసి వశిష్ఠ భగవానునికడకు బోయి యిట్లనిరి:– "స్వామీ! మీరు మారాజు నెచ్చట వదలి వచ్చితిరి? మేమన్నములేక ఆఁకలిచేఁ జచ్చుచున్నాము. మీ రవిలంబముగా నేదైన నుపాయమును గావింపవలయును"

ఇదివిని వశిష్ఠుఁడిట్లనెను:– "ప్రజలారా! మీరు చింతిం పకుఁడు. నేను మీదుఃఖములనన్నిటినిఁ బోఁగొట్టెదను"

ఇట్లుపలికి వశిష్ఠ భగవానుఁడు తపతి సంవరణులఁ బిలిపించెను. ఆతఁడు నగరమునకు రాఁగానే దైవము వర్షింపసాగెను. అంతరాజు పండ్రెండు వత్సరములు తపతితో యజ్ఞమొనర్పఁగాఁ బ్రజలందఱును బరమసుఖులైరి. రాజు మరలఁ బ్రజలను ధర్మముగఁ బాలింపసాగెను. కాలాంతరమున దపతి గర్భమున మిక్కిలి తేజస్వియును, ప్రభావశాలియునగు కురువను పుత్రుఁడుదయించెను, ఆతని నామమునఁ దరువాత నీవంశము కౌరవ వంశమను పేరఁ బ్రసిద్ధిఁ జెందెను

సూతుఁడిట్లనెను:— "మునులారా! కురువునకుఁ బరీక్షిత్తు, సుధన, జహ్ను, నిషధాశ్వులను నల్గురు పుత్రులుదయించిరి. వీరిలో సుధనువుచే సుహోత్రుఁడును, సుహోత్రునకుఁ జ్యవనుఁడును, చ్యవనునకుఁ గృతి. ఆకృతికి ఉపరిచర వసువు ఉదయించెను. ఈతఁడు గొప్ప ధర్మాత్ముఁడగు రాజు. ఈతఁడు విమానమునఁ బైకెగిరెడువాఁడు. అందువలన నీతనికుపరిచరుఁడను పేరువచ్చెను. నేను మీకీధర్మాత్ముఁడగు రాజుకథను జెప్పెదను "



# ఉపరిచరవసు చరిత్రము.

(౭౮౨)

శ్లో॥ సుహోత్రో ఒభూత్సుధనుషశ్చ్యవనో౽థ తతః కృతీ
వసుస్తస్యోపరి చరో బృహద్రథ ముఖాస్తతః॥

శ్రీభాగ ౯ స్కం. ౨౨ అ. ౫ శ్లో॥

వ......సుధనువునకు సుహోత్రుం. డతనికిఁ జ్యవ నుండు, చ్యవనునకుఁ గృతి, కృతికి వసువు, వసువునకు బృహద్రథ కుసుంభ, మత్స్య ప్రత్యగ్ర చేదిపాదులు పుట్టిరి;

శ్రీమదాంధ్ర భాగవతము.

ప్రపంచమందు శ్రీమన్నారాయణుని భక్తియే సారము నారాయణ నామమే భవభయ బంధనమును ఛిన్న భిన్న మొనర్పఁగలదు. నారాయణుఁడే పరమతత్త్వము. వాయురోగ ముల నన్నిటిని నారాయణ తైలము నశింపఁజేయునట్లును, ఉదర వికారముల నన్నిటిని నారాయణచూర్ణమే పరమౌషధి, యైనట్లు సంసార సాగరమును దాటించుటకై నారాయణ నామమను నౌకయే సమస్తవిధముల సమర్థమైనది. ప్రాణుల న్నిటియందును దనస్వామియగు నారాయణునే కాంచువాని కిని, జీవములందు దయగలుగు వానికిని, నేప్రాణిని హింసిం పనివానికిమాత్రమే శ్రీమన్నారాయణుని దర్శనమగును. ఏకా

రణము చేతనైనఁ బతనమైనచో, మరల నారాయణ నామము చేతనే మరల నుత్థానము కలుగును. నారాయణుని శరణు జొచ్చినచో సమస్తాశుభములు నశించును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! కురుకులమందు కృతి పుత్రుఁడు ఉపరిచరవసువు మిక్కిలి ధర్మాత్ముఁడును, భగవద్భక్తుఁడునై యుండెను. ఈతఁడు బృహస్పతినిఁ దన పురోహితునిఁగా నొనర్చుకొనెను. ఈతఁడు గొప్ప అహింసకుఁడు. అశ్వమేధయజ్ఞమందును నీతఁడు పశుహింసను జేయలేదు. అంగిరా పుత్రుఁడు బృహస్పతితో నీతఁడిట్లనెను:-"స్వామీ! ఫలమూలములతోడను, అన్యసామగ్రులతోడను మహాయజ్ఞముకాదా"

బృహస్పతి యిట్లనెను:- "అట్లెందులకుఁగాదు? యజ్ఞమందు హింస ఆవశ్యకముకాదు."

అప్పుడు రాజిట్లనెను:- "ప్రభూ! పశుబలి లేకుండ నాచే యజ్ఞమును జేయించుఁడు."

ఇదివినఁగానే బృహస్పతి యజ్ఞ సామగ్రిల నన్నిటిని సూచించెను. రాజు వెంటనే ఆవస్తువుల నన్నిటినిఁ బ్రోవుచేసెను యజ్ఞమారంభమయ్యెను. ఇందులో బృహస్పతి హోత ప్రజాపతి పుత్రులగు ఏకత, ద్వీత, త్రిత ఆయజ్ఞమందు సదస్సులు. ధనుషాఖ్య, రైభ్య, అర్వావసు, పరావసు, మేధాతిథి, తాండ్య. శాంతి, వేదశిర, కపిల, ఆధ్య, కఠ, తైత్తిర,

కణ్వ, దేవహోత్రులను నీపదునాలుగురు సుప్రసిద్ధ మహ ర్షులా యజ్ఞమందు దీక్షితులైరి. ఆయజ్ఞములోని విశేషత దానిలోఁ బశుహింస లేకపోవుటయే. ఫల, పుష్పాంకుర, బీజ ములచేతనే విష్ణుభగవాను నారాధించెను.

ఉపరిచరవసువు యొక్క యిట్టి భక్తిచే రమారమణుఁ డగు శ్రీమన్నారయణుఁడు ప్రసన్నుఁడయ్యెను. ఆతఁడు రాజు నకుఁ బ్రత్యక్ష దర్శన మొసంగి యజ్ఞీయ పురోడాశమును స్వయ ముగ గ్రహించెను. ఆతఁడింకెవరికిని దర్శనమీయలేదు, అదృ శ్యరూపము చేతనే ఆతఁడు హవిర్భాగమును స్వీకరించెను

బృహస్పతి క్రుద్ధుఁడై యిట్లనెను:- "నే నెన్నినాళ్ల నుండియో దేవతలను యజ్ఞభాగములకొఱకు పిలుచుచున్నాను. దేవతలు నాయెదుట ప్రత్యక్ష మేలఁగారు?".

రాజిట్లనెను:- "స్వామీ! విష్ణువు మీరిచ్చిన హవి ర్భాగమును గ్రహించినాఁడు."

బృహస్పతి యిట్లనెను:- "నేనట్లంగీకరించు వాఁడను గాను. నేను దేవతల కొఱకీపురోడాశమును సిద్ధమొనర్చితిని. దేవతలు ప్రకటమైదీనినిఁ దీసికొనవలయును. విష్ణుభగవానుఁ డందఱ సమ్ముఖమున స్వయముగ దీనిని గ్రహింపవలయును. అదృశ్యరూపముతో భగవానుఁడు దీనినేల గ్రహించినాఁడు. ఇట్లుపలికి బృహస్పతి స్రువమును పైకెగురవైచెను.

అప్పుడత్యంత మధురస్వరమున బృహస్పతికి సచ్చుఁ జెప్పుచు నిట్లనెను:- "స్వామీ! మీరు క్రోధ విషయమును జెప్పుచున్నారే? కృతయుగమున నెవరును గోపపడెడువారు కారు. ఇది అన్యయుగములలోని భావము. స్వామీ! మీరు కోపించి దేవాధిదేవుని బ్రత్యక్ష మొనర్చుకొనఁజాలరు. వారు జితక్రోధులు. క్రోధరహితులై ఆతనిఁ బ్రేమచే తఁ బొందఁదగును"

రాజుయొక్క యీమాటను సమర్థించుచు మహర్షులగు ఏకత, ద్విత, త్రితలు తమ యనుభవములో నొకమాటను జెప్పిరి వారిట్లనిరి:- "మాకును నొకసారి భగవద్దర్శన మొనర్పవలయునను బలవత్తరమగు నిచ్ఛ జనించెను. అప్పుడు మాకాకాశవాణి యిట్లు వినఁబడెను. "మునులారా! మీరు క్షీరసాగరమున కుత్తర తటమునయున్న మహాప్రభావంతమగు శ్వేతద్వీపమునకుఁబొండు. అచ్చట నాయొక్క ప్రత్యక్షరూప ముండును. ఆలోకమందు నారాయణ పరాయణులును, చంద్రమువలెఁ గాంతికలవారును, పరమైకాంతికులునగు భగవద్భక్తులు నివసించుచుందురు. వారిందిన్ద్రియరహితులు, నిరాహారులు,కను ఱెప్పలార్పరు. దివ్యగంధయుక్తులు."

ఈ యాకాశవాణిని విని మేమందరమును శ్వేతద్వీపమునకుఁబోయితిమి. అచ్చట తేజమువలన మాకన్నులు మిఱుమిట్లు గొలుపఁగా నందఱమును నంధులమైతిమి అచ్చటికి

వెళ్ళినను మేము శ్రీమన్నారాయణుని దర్శనమును జేయఁజా లకపోయితిమి. మేము తపోరహితులమనుకొని ఘోరతపో నిర తులమైతిమి! మేము నూఱు సంవత్సరములచ్చట నుండి తప మును జేయుచుండఁగా మాకా లోకముననుండు భగవద్భక్త మహాపురుషుల దర్శనమైనది. వారందఱును జంద్రునివలెఁదెల్ల గను భగవన్నారాయణులై యుండిరి. వెంటనే ఒక దినమున నచ్చట భగవద్భక్తులందఱును మిక్కిలి యుత్కంఠతతోఁ బరు విడి అనేక పూజాసామగ్రులను దెచ్చి, చేతులను జోడించు కొని అందఱు నిట్లనిరి:- "పుండరీకాక్షా! విశ్వోత్పాదకా! హృషీకేశా! జనార్దనా! నారాయణా! మీకు జయమగుఁగాక! జయమగుఁగాక!

వారియొక్క స్తుతి, పూజా, చేష్టలను ముఖాకృతినిఁగాంచి మేమచ్చటికి భగవంతుఁడు వచ్చినాఁడని గ్రహించితిమి, కాని మాకాతని దర్శనము కాలేదు. ఆద్వీపమున నుండు నితరులా తనిఁ బ్రత్యక్షముగ దర్శించుచునే యుండిరి. కొంచెము సేప టికి పూజ సమాప్తమయ్యెను; కాని అచ్చటవారు మాతోఁ జెప్పనైనఁజెప్పలేదు. అంతమేము మరల ఘోరతపంబొనర్చు చుంటిమి. తపస్సును జేసి చేసి మేము కృశులమైతిమి. అప్పుడు మాకు మరల నాకాశవాణి వినఁబడెను:- "భగద్భక్తులకు భక్తులుకానివారికి మాదర్శనము దుర్లభము. మీకింకను నీ లోకమున నుండుటకధికారములేదు. మీరింకను బృథివిపై

నుండి చాలకార్యములు చేయవలసియున్నది. చాలమందిని భగవద్భక్తుల నొనర్పవలసియున్నది. మీకిచ్చటి మహాపురుషుల దర్శనమైనది. అదియే గొప్ప పేరియందు భక్తినుంచుడు మరల మీరు మరల నీలోకమునకు వచ్చినచో మీకు నాదర్శనము కాఁగలదు. మీ రేదారిని వచ్చితిరో మరల నాదారినే పొండు.''

ఏకత ముని యిట్లనెను: ''బృహస్పతీ! ఈయాదేశమును విని మేమందఱమును దిరిగి వచ్చితిమి. మేముతపము నొనర్చితిమి. అయినను నేము శ్వేత ద్వీపమునకుఁబోయినను భగవద్దర్శనము కాలేదు భగవానుఁడు హవ్యకవ్యములకుఁ దృష్టను జెంది యుండలేదు! ఆతని దర్శనమాతని కృపచేతనే కావలయును. ఆతఁడు సాధన సాధ్యుఁడుకాఁడు. కృపాసాధ్యుఁడు. కావున మీరుక్రోధమును జెందకుఁడు. భగవంతుని కృపకలిగిననాఁడు మీకాతని దర్శనము లభింపఁగలదు.''

ఏకతముని యీమాటలను బలుకఁగా ద్విత త్రితులాతనిని మోదించిరి. అప్పుడు బృహస్పతి క్రోధమును బరిత్యాగమొనర్చెను. ఆతఁడు భగవద్భక్తుఁడగు ఉపరిచరవసువు యొక్క యజ్ఞమును విధ్యుక్తముగ సమాప్తము కావించెను మహారాజుపైన భగవానుఁడు ప్రసన్నుఁడయ్యెను కాలాంతరమున నాతఁడు స్వర్గగామి యయ్యెను. మరల ఋషుల శాపముచే భూమిపైకి వచ్చెను.

ఇది విని శౌనకుఁడిట్లడిగెను:–"సూతా! ఇంతటి గొప్ప భగవద్భక్తుఁడగు రాజునకుఁ బతనమేల కలిగినది? ఋషుల యెడల మహారాజగు నుపరిచరవసు వేమి యపరాధము నొనర్చినాఁడు?"

సూతుఁడిట్లనెను:– "స్వామీ! ఎవరెవరి కపరాధ మొనర్చును? అంతయును భగవంతుని క్రీడయే. ఆతఁడెవరిచేత నే కార్యము నొనర్పఁజేయునో ఆతని కట్టిమతియే యొసంగును. భగవద్భక్తుల కెల్లప్పుడును భగవత్స్మృతినిఁ గలిగియుండవలయును. నిరంతరము నోట నామోచ్చారణ మొనర్పవలయును ఇటుండినవానికి స్వర్గ, నరక, పృథివ్యాది యితర ఉచ్చనీచలోకములన్నియును సమానములే. వారికి బేదబుద్ధి నశించును. ఉపరిచరవసువు భగవద్భక్తుఁడు. కాని, కాని పక్షపాత పూర్ణములగు వచనములను బలుకుటచే నాతనికి స్వర్గమునుండి పతనము సంభవించినది. ఈప్రసంగమును నేను మీకుఁజెప్పెదను"

ఒకసారి దేవతలు ఋషులతో నిట్లనిరి:–"ఋషులారా! మీరు యజ్ఞమందు అజమును హవన మొనర్పవలయును! ఇతర పశువులను హవనమొనర్పరాదు"

ఋషులిట్లడిగిరి:– "అజమనఁగా నర్థమేమి?"

దేవతలిట్లనిరి:– "అజమనఁగా మేఁక."

ఋషులిట్లనిరి:- "పశువులను జంపి హావన మొనర్చుటది సత్పురుషుల కార్యముకాదు. శ్రుతియొక్క ఆజ్ఞ - బీజధాన్యాదుల పురోడాశము నేర్పరచి విధిపూర్వకముగ హావన మొనర్పవలయుననియే. ఆపరిపక్వ బీజముయొక్క నామమే అజ మనునది."

దేవతలిట్లనిరి:- "అట్లుకాదు, అజమనఁగా మేఁక. యజ్ఞ మందు మేఁకను బలి యీయవలయును."

ఈవిధముగ దేవతలును, ఋషులును వాదవివాదములను గావించుకొనిరి. ఇంతలో నచ్చటకు ధర్మాత్ముఁడగు నుపరిచరవసువు వచ్చెను. ఆతఁడు తన తపఃప్రభావముచే నాకాశమందు విమానముమీఁదఁ దిరుగుచుండెను దేవతలును ఋషులును నిట్లనిరి:- "ఈ యుపరిచరవసువు ధర్మాత్ముఁడు. ఈతఁడెన్నడును నబద్ధమాడఁడు ఈతనినే యీవాద వివాదమున మధ్యవర్తిగా నెన్నుకొనుఁడు."

ఇద్దరును రాజుయొక్క మధ్యవర్తిత్వము నంగీకరించిరి. ఇద్దరమాటలను విని రాజు దేవతాపక్షపాతమును వహించి యిట్లనిరి:- "యజ్ఞమందు మేఁకనే హోమమొనర్పవలయును"

ఇది వినఁగానే తేజస్వులగు ఋషులకుఁ గోపము వచ్చెను. వారాతనికి శాపము నొసంగిరి:- "రాజా! నీవుపక్షపాతమున నీముఖమోటమి మాటలను బలికితివి, కావున నేఁటి

నుండి నీకంతరిక్షమున భ్రమించు శక్తి నశించిపోవుగాక! నీవు స్వర్గచ్యుతుఁడవై పృథ్వీవివరమందు వాస మొనర్పఁగలవు ”

ఋషులశాపము తగులఁగానే రాజు స్వర్గభ్రష్టుఁడై పృథ్వీవివరమందుండెను. కాని ఆతనికిఁ దన పూర్వజన్మస్మృతి యుండెను. తమ పక్షమును వహించుటచే రాజునకిట్టి స్థితి కలిగెనని దేవతలు తెలిసికొని, రాజు కడకుఁబోయి యిట్లనిరి:– “రాజా! నీవు చింతింపకుము, శ్రీమన్నారాయణుఁడు మంగళ మొనర్చుఁగాక! శాపమొసంగినను నీవు బ్రాహ్మణులను ద్వేషింపలేదు. యజ్ఞములందు మేము నీకుఁ బూర్ణాహుతి సమయమున వసుధార నిప్పించెదము. దానిఁద్రాగి నీవు సంతుష్టినిఁ జెందుము.” ఇట్లు వరమునొసంగి దేవతలునుఁబోయిరి. ఇప్పుడు రాజగు వసువు పృథివీ వివరమందుండి దేవతలు చెప్పిన యజ్ఞమందలి వసుధారను ద్రావి కాలయాపన మొనర్చుచుండెను.

ఇప్పుడు రాజు భగవదారాధనమున నిమగ్నుఁడై యుండెను; ఏలనఁగా హరిస్మృతియే సమస్త విపత్తులను నశింపఁజేయఁగలదని ఆతనికి బాగుగాఁదెలియును. శ్రీమన్నారాయణుని స్మరణ కీర్తనములే సమస్త శాప సంతాపములను స్వాహా మొనర్చుటకు సమర్థములైనవి. ఇట్లనుకొని ఆతఁడు నిరంతరము నారాయణ మంత్ర జప మొనర్చుచుండెను. ఆతఁడు భగవత్పూజనమును నిత్య నియమముతోఁ జేయుచుండును,

నారాయణ నామకీర్తనమును, నారాయణమంత్ర జపమును, శ్రీమన్నారాయణుని పూజార్చనలు మొదలగు వానియందే తన కాలమును గడుపుచుండెను. దీనికి తోడుగా నాతఁడు బ్రాహ్మణులను సత్కరించుచుండెను. అతనికి బ్రాహ్మణుల యందెన్నడును ద్వేషబుద్ధి కలుగలేదు. దీనిచే శ్రీమన్నారాయణుఁడు మిక్కిలి సంతుష్టుఁడై యుండెను. రాజును మరల నుపరిచరునిఁగ నొనర్పుమనియు, అతని కంతరిక్షమందు భ్రమించు శక్తిని మరల యథాప్రకారముగ నుండునట్లొనర్పు మనియు శ్రీమన్నారాయణుఁడు గరుత్మంతున కాజ్ఞాపించెను.

ఇది విని గరుత్మంతుఁడు పృథివీ వివరములోనికిఁబోయి రాజు నెగురవైచి, అతని నాకాశమున వదలివైచెను. అప్పటి నుండి అతఁడు మరల నుపరిచరుఁడయ్యెను. అతఁడు పూర్వము వలెనే ఆకాశమున భ్రమించుచుండెను. అతఁడు సశరీరుఁడై బ్రహ్మలోకమునకుఁ బోయెను.

సూతుఁడిట్లనను:- "మునులారా! ఇట్టిది, భగవద్భక్తి యొక్క ప్రభావము- మహారాజగు నుపరిచరవసువు దేవతల యెడలఁబక్షపాత మొనర్చుటచే, వాగ్దోషముచే దూషితుఁడై య్యెను, బ్రాహ్మణులు శాపమును బెట్టిరి, శ్రీమన్నారాయణుని భక్తియొనర్చుటచే, మరల సశరీరుఁడై బ్రహ్మలోకము నకుఁబోయెను. మునులారా! నేనుమీకు సంక్షేపముగ నుపరిచర వసువు కథను జెప్పితిని. ఇప్పుడుమీరేమి వినఁగోరుచున్నారు?"

శౌనకుఁడిట్లనెను:- "మహాభాగా! సూతా! ఇప్పుడు మాకు నీవు కౌరవ వంశములోని ముఖ్య ముఖ్య రాజుల చరిత్రములను జెప్పుము."

సూతుఁడిట్లనెను:- "మంచిది, స్వామీ! ఇప్పుడు మీకు కౌరవ వంశమందలి తరువాత రాజుల వృత్తాంతమును శ్రవణ మొనర్పుఁడు."



# చేదిరాజుల కథ.

(౭౮౩)

శ్లో॥ అన్యస్యాం చాపి భార్యాయాం శకలే ద్వే బృహద్రథాత్।
తే మాత్రా బహిరుత్సృష్టే జరయా చాభి సంధితే।
జీవ జీవేతి క్రీడన్త్యా జరా సంధోఽభవత్సుతః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౨ అ. ౮ శ్లో॥

సీ॥ ఆబృహద్రథునకు నన్యభార్యా గర్భ
మున రెండు తను ఖండములు జనించె;
దునుకలు గనితల్లి తొలఁగంగ వైచిన
సందించె నొకటిగా జరయనంగ
నొకదైత్య కాంత; వాఁడొప్పె జరాసంధుఁడన

శ్రీమదాంధ్రభాగవతము:

భగవద్విధానమును జీవుఁడు గ్రహింపఁజాలఁడు. ఆతఁడట్లు గ్రహింపఁగలిగినచో నాతనికి జీవసంజ్ఞ యుండెడిది కాదు. ఆతఁడు శివరూపుఁడయ్యెడు వాఁడే. ఏ వస్తువును మనము వ్యర్థమనుకొని పారవేయుదుమో కాలాంతరమున నదియే అమూల్యమైనదగును; బహుమూల్యమైనదని దేనిని మనము జాగ్రత్తగఁ గాపాడుకొందుమో, సమయము రాఁగానే అది రెండు గవ్వలైనను జేయదు. విధివిధానముచే మరణించినవాఁడు జీవించును, భగవదేచ్ఛచే జీవితుఁడు క్షణములో మృతుఁడగును. కావున దైవబలమే యథార్థమగు బలము.

సూతుఁడిట్లనెను:-"మునులారా! ఇప్పుడు నేను మీకు కౌరవ వంశమందలి తరువాత రాజులను గూర్చి చెప్పఁగలను: మహారాజగు సుపరిచర వసువునకు బృహద్రథ, కుశాంబ, మత్స్య, ప్రత్యగ్రులను నలుగురు పుత్రులుదయించిరి. వీరందఱును చేదిపురులనఁబడిరి. వీరిలో బృహద్రథుఁడందఱికంటెను పెద్దవాఁడు. ఆతని పుత్రుఁడు కృశాగ్రుఁడు. కృశాగ్రునకు ఋషభుఁడు, ఆతనికి సత్యహితుఁడు, సత్యహితునకు పుష్పవానుఁడు పుష్పవానునకు జహ్నువులుదయించిరి.

బృహద్రథునకు జరాసంధుఁడను నింకొక పుత్రుఁడును గలండు. ఆతఁడు రెండు భాగములుగ వేఱు వేఱుగ నుదయించినాఁడు."

ఇది విని శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! జరాసంధుఁడు రెండు భాగములుగ వేఱు వేఱుగ నెట్లుద్భవించినాఁడు? పైగా నాతఁడెట్లు జీవింపఁగలిగెను? ఇది యెంతో ఆశ్చర్యకరమగు విషయము! ఈతని చరిత్రమును దయతో మాకుఁ జెప్పవలయును."

సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఇది చాల అద్భుతమగు నితిహాసము. వినుఁడు, నేనీ కథను మీకుఁజెప్పెదను. మగధ దేశాధిపతియగు బృహద్రథుఁడు గొప్ప ధర్మాత్ముఁడును, న్యాయప్రియుఁడునై యుండెను. ఈతని వివాహము కాశీరాజ పుత్రిక లిద్దరతో నయ్యెను. ఆ యిద్దరకవలపిల్లలు అత్యంత సుందరులును, సర్వగుణ సంపన్నులై యుండిరి. వారిద్దరి యం

దును పరస్పరము మిక్కిలి ప్రేమకలదు. వారిద్దరిలో నెవరి యెడలను బక్షపాతమొనరింపని రాజకుమారునే పెండ్లాడవల యునని వారి ప్రతిజ్ఞ. ఇద్దరను సమాన భావముతోఁ బ్రేమింప వలయును. బృహద్రథుఁ డిట్లు ప్రతిజ్ఞను గావించెను:- "నేను మీ యిద్దరి యెడలను సమాన భావముతో వ్యవహరించెదను. ఏవిధమగు బక్షపాతము నొనర్పను." ఇది వినఁగానే వారి ద్దరికిని మిక్కిలి సంతోషమయ్యెను. కాశీరాజు తనయిద్దరి పిల్ల లను బృహద్రథునకొసంగి వివాహమొనర్చెను. రాజు తన ప్రతిజ్ఞను బాలించుచు నిద్దరయెడల సమానముగ వ్యవహ రించుచుండెను. ఇద్దరు రాణులతో రాజెన్నోదినములు కాపుర మొనర్చెను, కాని సంతానమేమియును గలుగలేదు. దీనివలన రాజును, రాణులును సదాదుఃఖితులుగను, చింతితులుగను నుండిరి. రాజునకు వృద్ధావస్థయును వచ్చుచుండెను.

ఒకదినమునఁగాక్షీవాన గౌతమఋషి పుత్రుఁడును, బరమతేజస్వియునగు చండకౌశిక మహర్షి తిరుగుచుఁదిరుగుచు మగధదేశమునకు వచ్చెను ఆతఁడు నగరమునకు దూరముగ నొక మామిడిచెట్టుక్రింద నిలిచెను. చాలమందిజనులు ముని దర్శనమునకు వచ్చిరి, బృహద్రథుఁడును ముని యాగమమును విని, తన మంత్రి, పురోహితులను రాణులను వెంటబెట్టుకొని ముని దర్శనమునకు వచ్చెను. అది ఆషాఢ మాసము. దట్ట మైన వృక్షముక్రింద దర్శకులతోఁ జుట్టుకొనఁబడిన ముని

మూర్తీభవించిన తపమువలె గోచరించుచుండెను. రాజు ముని చరణములమీఁద విధ్యుక్తముగఁ బ్రణామమును గావించెను. అంత సిగ్గుతోఁ గంఠమున నంజలిని బంధించుకొని రాణియును మునిపాదములను బట్టుకొనెను. రాణితోఁగూడ రాజు మునికి షోడశోపచారములను గావించెను. ముని శాస్త్రము విధిచే రాజు చేసిన పూజలను స్వీకరించెను. పూజానంతరము మిక్కిలి కరుణాస్వరమున రాజు మహర్షిని స్తుతించెను. పూజాస్తుతులకుఁ బ్రసన్నుఁడై మహర్షి యిట్లనెను:— "రాజా! నేను నీపూజాస్తుతులకు మిక్కిలి సంతుష్టుఁడనైతిని నీవు నన్నే దైన వరమును గోరుకొనుము."

రాజిట్లనెను:— "స్వామీ! నేను వరములు గైకొని యేమిచేయఁగలను? నాపితరులు స్వర్గమున నేడ్చుచున్నారు, నేను రాణితోనిచ్చట నేడ్చుచున్నాను. చూడుఁడు. నాకు వెంట్రుకలు నెఱసినవి. నేనిప్పుడు వనమునకుఁబోవ యోచించుచున్నాను."

సర్వజ్ఞుఁడగు ముని రాజుయొక్క అంతర్వేదనను గ్రహించెను. అతఁడు ధ్యానమగ్నుఁడయ్యెను. అదే సమయమునను చక్కని మామిడిపండొకటి ముని వడిలోఁబడెను. ఆ ఫలమును గైకొని మునియిట్లనెను:— "రాజా! నీవీఫలమును నీభార్యకొసంగుము. దీనివలన నీకుసంతానము కలుగఁగలదు.

ఫలములభింపఁగనే రాజునకు మిక్కిలి సంతోషము కలిగెను. అతఁడింటికివచ్చి నియమానుసారముగ ఫలమును రెండుభాగములొనర్చి తన రాణులిద్దరకొసంగెను. ఫలమును దినఁగానే యిద్దరును గర్భవతులైరి. దీనివలన రాజునకును, బ్రజలందఱకును మిక్కిలి యానందము కలిగెను. సమయము రాఁగానే యిద్దరును బ్రసవించిరి. ఇద్దర గర్భములనుండియును నొక్కదేహమందలి సగము సగము భాగములుగ నుత్పన్న మైరి. ఒకచేయి, ఒకకాలు, ఒకకన్ను, ఒకచెవి, సారాంశమే మనఁగా సరిగా సగము సగము భాగములుగ వారిద్దరి గర్భము నుండి యుద్భవించెను. ఇట్టి పుత్రుని వారేమిచేసికొందురు. అందువలన వారిద్దరును దాదితో నిట్లనిరి:- "ఈరెండు శరీర ములను నీవు మన రాజ భవనము వెనుక పారవేసిరమ్ము"

దాది వాని నొకపాత్రలోనికిఁ దీసికొని ఒకశూన్యస్థాన మందుంచెను. ఆ సమయమున జరయను రాక్షసి ఆచ్చటికి వచ్చెను. ఆమె ధ్యానముచే నా ఖండములు రెండును జీవించి యున్నవని తెలిసికొనెను. ఆ రెంటినిఁ దీసికొని ఒక్కటిగాఁ గలిపి, ఆటగా 'జీవించుము, జీవించు'మనెను.

ఆ రెండును నొక్కటిగా నతుకుకొని కలిసిపోయి ఒక శిశువుగా నైనటామె తెలిసికొని ఆశ్చర్య చకితయయ్యెను. ఆశిశువు రోదనముచేయసాగెను. జరఒక సుందరస్త్రీవేశమును ధరించి, యాపిల్లవానినిఁ దీసికొని రాజభవనము లోనికిఁబోయి

యిట్లనెను:- "రాణీ! నీవీ పుత్త్రుఁడు చచ్చెనని భావించి పారవైచితివి; కాని దైవము దీనిని రక్షించినాఁడు. నీవు గోడమీఁద నాచిత్రమును వ్రాసి నాకు పూజలొనర్చితివి; దానికి బదులుగా నేను నీకీయుపకార మొనర్చితిని."

పుత్త్రునిఁగాంచి రాజును, రాణియును మిక్కిలి హర్షించిరి వారు బ్రాహ్మణులకు విధ్యుక్తముగ దానము లొసంగిరి; యాచక, అభ్యాగత, ఆశ్రితులయొక్క మనోవాంఛలను నెఱవేర్చెను. జరా రాక్షసిచే సంధితుఁడగుటచే నాతనికి రాజు జరాసంధుఁడను పేరునుబెట్టెను. అప్పటినుండి రాజా మగధదేశమందింటింట నారాక్షసియొక్క పూజనారంభింపఁజేసెను.

ఈజరాసంధుఁడు గొప్ప శూరవీరుఁడు, అభిమాని, బలవంతుఁడు ఈతఁడు పృథివియందలి సమస్తరాజులను జయించెను మహారాజు వానప్రస్థాశ్రమమును ధరించి రాణులతో వనమునకుఁబోఁగానే జరాసంధుఁడు మగధదేశమునకు రాజయ్యెను. దీపము కడకువచ్చి మిడుతలు మాడిపోవునట్లే తని కడకువచ్చి శత్రువులు శ్రీహీనులగుచుందురు: ఆసమయమున భూమండలమున నీతనికీడువచ్చు వాఁడెవఁడునులేఁడు. శ్రీకృష్ణ భగవానునిపైఁగూడ యీతఁడు పదునెనిమిదిసారులు దండెత్తినాఁడు. చివరకు శ్రీకృష్ణుఁడు తన వంశమువారితోఁగూడ, యీతని భయమునఁబాఱిపోయి ద్వారకానగరమున నివసించు

చుండెను ఈతని వధను భగవంతుడు భీమునిచేఁ జేయించెను. ఈవిషయమును గూర్చిన వర్ణనమును నేను ముందు చేయఁగలను."

సూతుఁడిట్లనెను:- "మునులారా! చేదిరాజు బృహద్రథుని పుత్త్రుఁడగు జరాసంధుని సుతుఁడు సహదేవుఁడు. ఈతఁడును గొప్పబలవంతుడే ఇప్పుడిఁక తరువాతరాజుల వంశ వర్ణనమును వినుము."

—(o)—

# శంతను మహారాజు కథ.

(౭౦౮)

శ్లో॥ అభవచ్ఛంతనూ రాజా ప్రాజ్ఞ్యమాభిష సంజ్ఞితః।
యంయం కరాభ్యాం స్పృశతి జీర్ణం యౌవనమేతి సః॥
శాంతి మాప్నోతి చైవాగ్ర్యా కర్మణా తేన శంతనుః॥
సమా ద్వాదశ తద్రాజ్యే న వవర్ష యదావిభుః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౨ అ. ౩.౪ శ్లో.

వ......తమ్ముండు పూర్వజన్మమందు మహాభిషుఁడని యెడువాఁడు శంతనుఁడయ్యె; వాఁడె యీధాత్రినెల్ల నేలుచుఁ గరములనే వృద్ధుముట్టిన, వాఁడెల్లనిండు జవ్వనము నొందు; నతఁడు శాంతిప్రాప్తుఁడై యున్న దానఁ బండ్రెండేండ్లు వజ్రి వర్షింపకున్న —

శ్రీమదాంధ్ర భాగవతము.

పెద్దలను సన్మానించుట ఆర్యసంస్కృతిలోని సర్వశ్రేష్ఠ మగు సదాచారము. పెద్దల సమ్ముఖమున నుచ్చాసనమున గూర్చుండకుండుటయును, పెద్దలయెదుట గర్వముతోఁగూర్చుండకుండుటయును, పెద్దలతో శిష్టాచార రహితమగు వ్యవహారమును గావింపకుండుటయును, పెద్దలుండఁగఁ దాను సమ్మానమును గ్రహింపకుండుటయును నిట్టిది ప్రాచీనమగు

పరిపాటి, అన్నకు సంస్కారము కానంతవఱకు చిన్నవారికి సంస్కార మొనర్చుట విధానముకాదు. పెద్దవానికి వివాహమును అగ్నిహోత్ర సంబంధమును గలుగకయే చిన్నవాఁడట్టిసంస్కారము నొనర్చుకొన్నచో వానిని శాస్త్రకారులు 'పరివేత్త' అనిరి, అన్నను 'పరివిత్తి' అనిరి. అన్నయుండఁగా జిన్నవాఁడు తండ్రి సింహాసనమునఁ గూర్చుండుట కధికారము లేదు. అన్న అయోగ్యుఁడైనను, మహావ్యాధిగ్రస్తుఁడైనను, సదాచారహీనుఁడైనను జిన్నవాఁడు రాజగుటలో నేవిధమగు దోషమును లేదు.

సూతుఁడిట్లనును:- "మునులారా! నేను చేదిరాజగు బృహద్రథుని పుత్రుఁడగు జరాసంధుని జన్మకథను గూర్చి చెప్పితిని. ఇప్పుడాతని తరువాత వంశమును గూర్చి వినుఁడు. జరాసంధుని సుతుఁడు సహదేవుఁడు. ఆతనికి సోమాపియును, సోమాపికి శ్రుతశ్రవుఁడును జన్మించిరి. ఇది నేను సంక్షేపముగ చేదివంశపురాజుల వంశావళిని గూర్చి చెప్పితిని. ఇప్పుడు కురువంశమందలి యితరరాజుల వంశములనుగూర్చి విస్తారముగ శ్రవణమొనర్పుఁడు.

హస్తిపుత్రుఁడగు కురునకుఁ బరీక్షిత్తు, సుధను, జహ్ను, నిశధాశ్వులను నల్గురు పుత్రులుండిరని నేనిదివఱకే చెప్పియున్నాను. వారిలో సుధనుని వంశవర్ణనమును నేనొనర్చితిని. మీఁదు మిగిలిన ముగ్గురినిగూర్చి వినుఁడు. కురుయొక్క ప్రథమ

పుత్రుఁడగు పరీక్షిత్తు సంతానహీనుఁడయ్యెను. ఆతని వంశము జరుగలేదు. ఇప్పుడుమీరు జహ్నువంశమునుగూర్చి వినుఁడు.

జహ్నుని పుత్రుఁడు సురథుఁడు. ఆతని సుతుఁడు విదూరథుఁడు. విదూరథునకు సార్వభౌముఁడు, ఆతనికి జయసేనుఁడు జయసేనునకు రాధికుఁడు. అతని కయుతుఁడు పుత్రుఁడయ్యెను అయుతునకుఁ గ్రోధనుండును క్రోధనునకు దేవాతిథియు నాతనికి ఋష్యుఁడును. ఋష్యునకు దిలీపుఁడును, దిలీపునకుఁ బ్రతీపుఁడునుదయించిరి. ప్రతీప మహారాజునకు ముగ్గురు పుత్రులు. వారు దేవాపి, శంతను, బాహ్లికులనువారు. వీరిలో రెండవ వాఁడు రాజయ్యెను. ఈతఁడు గంగను బెండ్లాడెను.

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:– "సూతా! ప్రతీప మహారాజు జ్యేష్ఠకుమారుఁడగు దేవాపికి రాజ్యమీయక శంతనునేల రాజుగా నొనర్చెను? పైఁగా శంతనుఁడు మానవుఁడు, ఆతనికిని గంగకును వివాహమేల జరిగినది? దయతో నీకథను నీవు మాకు చెప్పవలయును."

ఇదివిని సూతుఁడిట్లనెను:– "మంచిది స్వామీ! పుణ్యశ్లోకుఁడగు శంతనుని చరిత్రమును నేనుమీకు జెప్పెదను. మీరు సమాహితచిత్తులరై దానిని శ్రవణ మొనర్పుఁడు. పూర్వకాలమందీతఁడు మహారాజగు మహాభిషుఁడు. బ్రహ్మశాపముచే బ్రహ్మలోకమునుండి చ్యుతుఁడై, చంద్రవంశపు రాజగు ప్రతీపునకుఁ బుత్రుఁడై జన్మించెను."

శౌనకుఁడిట్లనెను:— "సూతా! నీవు కథనుండి వేఱొక కథాబీజమును వెల్లగించుచుందువు నీవుమాకుప్రతీప పుత్రుఁడగు శంతను చరిత్రమును దరువాతఁ జెప్పవచ్చును. ముందుగా గమలోద్భవుఁడగు బ్రహ్మ యేల మహాభిషుని శపించెనో మాకు జెప్పవలయును? ఈతఁడు బ్రహ్మలోకమునుండి యే యపరాధమునఁ జ్యుతుఁడై నాఁడు?"

అంత సూతుఁడిట్లనెను:— "స్వామీ! పూర్వకాలమందు ఇక్ష్వాకు వంశమునఁ బరమ ధర్మాత్ముఁడును, తేజస్వియును, తపస్వియును, యశస్వియునగు రాజుండెను ఆతఁడు గొప్ప గొప్ప దక్షిణలొసంగి యజ్ఞముల ననేకములొనర్చెను. వివిధ ములగు బుణ్యకర్మలొనర్చెను. సుయోగ్యులగు పాత్రులకు వివిధ ప్రకారములగు దానములొసంగెను. చివరకీపాంచభౌతిక శరీరమునువీడి, తన పుణ్యకర్మముల ప్రభావముచే బ్రహ్మ లోకమునకుఁ బోయెను. అచ్చటికిఁబోయి బ్రహ్మలోక సుఖ ముల ననుభవించు చుండెను. ఒక దినమున బ్రహ్మ సభ తీరి యుండెను. అందులో గొప్పగొప్పబ్రహ్మర్షులును, దేవతలును సిద్ధులును, చారణులును, గంధర్వులును, ఇతర సుకృతి జన మును నుండిరి. ఆసమయమున గంగా దేవి అత్యంతసుందరి యగు నొకయువతి రూపమును ధరించి బ్రహ్మ సభలోనికి వచ్చెను. వాయుదేవుఁడామెయొక్క అతి యులిపిగిగానుండు పైట చెఱఁగును వక్షస్థలమునుండి తొలఁగించెను. దానిని

గాంచి సమస్త ఋషులును, మునులును, దేవతలును తమ తమ తలలను వంచుకొనిరి; కాని మహారాజగు మహాభిషుఁడు గంగవైపు కనుఱెప్పలార్పక తదేక భావముతోఁ జూచుచుండెను ఆతని యీయవినయ కారణమునఁ గమలాసనుఁడగు బ్రహ్మ క్రుద్ధుఁడయ్యెను. త్రికాలదర్శియగు వేదగర్భుఁడు రాజు యొక్క మనోభావమును గ్రహించెను. ఆతఁడు రాజుతో నిట్లనెను:- "రాజా! ఈ పవిత్రలోకమందును నీమనస్సునందు కామభావము జనించినది. కావున నిప్పుడు నీకీలోకము నుండి భూమిమీఁదకుఁ బతనము కావలయును. మానవుని సంకల్పము ననుసరించి జన్మలభించుచుండును. నారియందాసక్తినిఁ జెందుటయే నరుని పని. కావున నీవు నరుఁడుగాబుట్టవలయును. నీవేగంగనుగాంచి ఆసక్తినిఁ జెందితివో, ఆమెయే స్త్రీరూపమును ధరించినీకు పత్ని కాఁగలదు. కొన్ని దినములు నీతోఁగలిసియుండి చివరికామె నిన్ను వీడి రాఁగలదు. అప్పుడు మరల నీవు స్వర్గమునకుఁ దిరిగి రాఁగలవు."

బ్రహ్మనోట నీశాపమును విన్నను మహారాజునకంతగా దుఃఖము కలుగలేదు; ఏలననఁగా నాతఁడు గంగారూపమునందత్యంతాసక్తినిఁ జెందెను. ఇప్పుడాతఁడు పృథివిపై జన్మింపవలసియుండెను. అదినములలోఁ బ్రతీపమహారాజే యీపృథివీతలమందు పరమ ధార్మికుఁడును, మహాతేజస్వియును, నందఱికంటె మిక్కిలి యశస్వియునై యుండెను. అందువలన మహాభి

షుఁడాతనికే జన్మించెను. ఆతఁడే శంతనుఁడను పేరఁ బ్రసిద్ధినిఁ జెందెను. ఈతనికడ నొక విశేషము కలదు ఈతని చేతులతో నేవృద్ధునిఁదాకినను నాతఁడు యువకుఁడగును. ఆతనికి పరమ శాంతి లభించుచుండెడిది. ఈకారణమున నీతనికి శంతనుఁడను పేరువచ్చెను. ఈతనియన్నయగు దేవాపి గొప్పవిరాగి. ఈతని తండ్రి రాజ సింహాసనమునఁగూర్చుండి రాజ్యముచేయుచున్న ప్పుడే యీతని యన్న రాజ్యమును వీడి రాజ్యమును శంత నునకప్పగించి తపస్సును జేసికొనుటకు వనమునకుఁబోయెను. శంతనుఁడు ధర్మపూర్వకముగఁ బృథివీపాలన మొనర్చుచుం డెను. మహారాజు గొప్పమృగయాప్రేమి. ఆతఁడు వేటకై గంగాతీరమునకుఁ బోయెను; పర్వతములందును, కందరము లందును, వనోపవనములందును దిరుగుచుండెను.

ఒకదినమున మహారాజు గంగాతీరమునకు వేఁటకై పోయెను. ఆటవిక జీవులను వెంటాడి వెంటాడి ఆతఁడలసి ఒక సుందరమైన దట్టమైన వృక్షచ్ఛాయను సుఖపూర్వకముగ గంగాతటమునకు కొంచెము దూరమునకుఁబోయి కూర్చుం డెను. ఆసమయమున నాతనికొక అత్యంత రూపలావణ్యా యుక్తయగు లలన కనఁబడెను. ఆమె తన సౌందర్యముచేతను కాంతిచేతను నావనప్రాంతము నంతను బ్రకాశింపఁ జేయుచుం డెను. ఆమె ప్రకృతి సౌందర్యమునుగాంచి నవ్వునప్పుడామె ముఖమునుండి కుందపుష్పములు రాలుచున్నట్లుండెను. ఆమె

గంగాతరంగములనుండి నిర్భయమై వచ్చుచుండెను. సమీప మున నున్న ఉపవనమందాచాయపాసిని విలాసముగఁ గ్రీడించు చుండెను ఆమెశరీర వర్ణము గౌరవర్ణముగనుండెను. పదతల, కరతల, ఓష్ఠాధర, జిహ్వానఖముల రుణములగనుండెను. ఆమె నేత్రములు వికసించిన కమలములవలె పెద్దకన్నులుండెను. ఆమెజడ చీలమండవఱకును వ్రేలాడుచుండెను. ఆమె అత్యంత సుందరమగు నీలపు ఉలిపిరి పటుచీరెను ధరించియుండెను. ఆమె అంగములనుండి సౌందర్యము ప్లొంగిబికి తటప్రదేశమంత యును వ్యాపించెను హంసవలెఁగులుకుచుఁ గాలినూపురము లను మోగించుచు విలాసముగ మందగమనమున నామె నడుచుచుండెను మెల్లమెల్లఁగా వచ్చి ఆమె రాజు సమీప మున నిలుచుండెను.

శంతన మహారాజింతవఱకిట్టి సుందరస్త్రీని నెన్నడును గాంచనేలేదు. ఆతఁడామె రూప, యౌవన, అంగసౌష్ఠవమును గాంచి మంత్రముగ్ధునివలెఁ దదేక దృష్టితోనామెవైపు చూచు చుండెను. రాజు ప్రయత్నపూర్వకముగ నాతని దృష్టినటు నుండి మరల్చుకొనఁదలచెను, కాని దీనిలోనాతఁడు సఫలుడు కాఁజాలకపోయెను. ఆమెను జూచుచు నాతఁడు తృప్తిచెంద కుండెను. ఆమెయును నేమియు మాటలాడకక రాజుయొక్క రూపాసవమును ప్రేమపూర్వకముగఁ బానమొనర్చుచుండెను.

కొంచెము సేపటికి రాజిట్లనెను :- "భామినీ! నీవు నీ దర్శనము చేతనే నన్ను వశపఱచుకొంటివి. నేను నీకృపను గోరుచున్నాను. నీవు నన్ననుగ్రహింపుము. నాకు ధర్మపత్నివై నాతో సుఖోపభోగములనుభవింపుము. నేనీ భూమికి పరిపాలకుఁడను. నన్ను శంతనుఁడందురు. నారాజ్యమంతయును నీయధీనమునను౦డఁగలదు."

ఆ స్త్రీ రాజువాక్యములను విని యిట్లనెను :- "రాజా మిమ్ములను బతిగా గ్రహించుట నాయదృష్టమనుకొనుచున్నాను. కాని నాదొక నియమముకలదు. ఆనియమమును బాలించెదనని మీరు ప్రతిజ్ఞనొనర్చినచో నేను మీకు ధర్మపత్నినిగాఁగలను"

రాజత్యంతోత్సాహముతో నిట్లనెను :- "వరవర్ణినీ! సుందరీ! నీవు నీనియమము చెప్పుము. నీవేది చేసినను నేను దానినంగీకరించెదనని నేను ప్రతిజ్ఞనొనర్చుచున్నాను. నీకే విషయమునందానందమో దానిని బ్రాణపణముగ నేను బూర్తి గావించెదను"

ఇదివిని యాస్త్రీ యిట్లనెను :- "రాజా! ఉచితానుచితములతో నేనేది యొనర్చినను మీరు దానిలో జోక్యమును గలిగించుకొనరాదు. నాకెన్నడును నేవిధమగు కటువగుపనియును జెప్పరాదు. మీరు నాపనిలో దేనిలోనైనను జోక్య

ము కలుగఁజేసికొన్నను, నన్నుదిట్టినను, నేను నిశ్చయముగ మిమ్ములను వదిలిపెట్టి పోయెదను.

సర్వాంగ సుందరియగు నావనిత యొక్క యామాటలను నాతఁడంగీకరించెను. ధర్మసాక్షిగ నాతఁడు ప్రతిజ్ఞ నొసఁగెను. ఆమెతో ధర్మపూర్వకముగ వివాహమొనర్చుకొని, ఆతఁడు సుఖపూర్వకముగ నామెతో సాంసారిక సుఖములనుపభోగించుచుండెను.''

ఇదివిని శౌనకుఁడిట్లనెను.- 'సూతా! శంతనుఁడుచ్చవంశావతంసుఁడు, ధర్మాత్ముఁడు, నీతినిపుణుఁడు. కులగోత్రశీలము తెలియఁగనట్టియు, నామమును వంశమును నెఱుఁగనట్టియా స్త్రీని నాతఁడేల వివాహ మాడఁగలఁడు? అట్టివాఁడిట్టి కఠిన ప్రతిజ్ఞ కెట్లు కట్టుబడినాఁడు?''

సూతుఁడిట్లనెను :- "స్వామీ! కఠిన ప్రతిజ్ఞ యందు రాజామెయొక్క అనుపమరూపలావణ్యమును జూచియు, దివ్య తేజ ప్రభావముచేతను గట్టుబడి పోయెను. కుల గోత్రములను దెలిసికొనుట ఆతనికవసరమని తోఁచలేదు; ఏలననఁగా నాతనికి పూజనీయుఁడును దండ్రియునగు బ్రతీపుఁడు నీతో నేస్త్రీ యేకాంతమున వచ్చి వివాహప్రస్తావమును గావించునో ఆమెను స్వీకరింపవలయునని యిదివఱకే చెప్పియుండెను.''

అంత శౌనకుఁడిట్లనెను :- "సూతా! ప్రతీపమహారాజు తనపుత్రుఁడగు శంతనునకిట్టి యాజ్ఞ నేల యొసంగెను?"

సూతుఁడిట్లనెను :- 'స్వామీ! ఈ విషయమున నొక యితిహాసముకలదు దానిని నేను జెప్పెదను, ప్రతీపమహారాజున కేమియును సంతానము లేకుండెను. అందువలన నాతఁడు హరిద్వారమునకుఁబోయి సంతానము కొఱకు ఘోరతపంబు నొనర్పసాగెను మహారాజు గొప్పసుందరుఁడును, బలిష్ఠుఁడును దర్శనీయుఁడునై యుండెను ఆతనిఁ గాంచిన నందఱచిత్తము లాకర్షింపఁబడుచుండెడివి. ఒక దినమున మహారాజు సంధ్యావందన మొనర్చుకొని జపమొనర్చుకొనుటకు బోవునంతలో నాతని కుడి తొడమీఁద నొక యత్యంతసుందరియగు స్త్రీ వచ్చి కూర్చుండెను.

హఠాత్తుగా నొక దివ్య రూపలావణ్యయుక్తయగు సురసుందరి తన తొడమీఁదఁ గూర్చుండుటను గాంచి రాజు మధురవచనములతో నిట్లనెను .- "దేవీ! నీవెవరు? నీవేల వచ్చి నాతొడమీఁదఁగూర్చుంటివి? నీకేకష్టము కలదు? నీవు నాచేత నేదైన పనిని జేయించుకొనఁ దలఁచుచున్నావా? చెప్పుము, నేను నీకేమి ప్రియకార్యమొనర్ప వలయును?"

ఆ స్త్రీ యిట్లనెను :- "రాజా! నేను నీసమాగమమును గోరుచున్నాను'.

రాజిట్లనెను :- "దేవీ! నేను పరస్త్రీవిఁదల్లితో సమానముగఁ జూచుకొందును."

ఆలలన యిట్లనెను:- మహారాజా! నేనువరపత్నినిగాను. నేను ధర్మభార్యకముగ నీకుఁ బత్నినిఁగాఁ గోరుచున్నాను. నేను మానవ స్త్రీనిగాను. దివ్యకన్యను. నాపేరు గంగ. నేను జహ్నుతనయ నగుటచే నన్నందఱును జాహ్నవియందురు"

ఇదివిని ప్రతీపమహారాజిట్లనెను :- "దేవీ! నీవుచెప్పునది యథార్థమే; కాని పొరపాటుకానిండు, దైవయోగమననిండు, నీవు నాపత్నివగుటకయోగ్యవైతివి?

ఆదివ్యకన్యకయిట్లనెను :- 'అదేల? మహారాజా!"

రాజిట్లనెను :- "దేవీ! ఈకుడి తొడమీఁదఁ గూర్చుండుటకు పుత్రికా పుత్రులకే అధికారము కలదు. భార్య కూర్చుండుటకు బుజువులెడమ తొడయే యోగ్యమైనదని చెప్పిరి కుడి తొడమీఁద బుత్రికయైనను గూర్చుండ వలయును లేదాకోడలైనఁ గూర్చుండవలయును. కావున నేను నిన్ను వివాహమాడఁజాలను; కాని నాకు పుట్టు పుత్రుఁడు నీకు భర్త కాఁగలడు. నేను నిన్ను నాకోడలిగా గ్రహించెదను."

గంగాదేవి యిట్లనెను :- 'మంచిది, మహారాజా! ఇది నా కంగీకారమే. కాని నీవు నాపనిలో దేనిలోను జోక్యమును గలుగఁజేసికొన రాదని నీపుత్రునకుఁ జెప్పవలయును."

రాజిట్లనెను :- 'అట్లే జరుగఁగలదు. నాకు పుత్రుఁడు కలిగినచో నీవిషయమును గూర్చి ఆతనికిఁ జెప్పుచుందును.''

ఇదివిని గంగాదేవి అచ్చట వెంటనే అంతర్థానమయ్యెను. తదనంతరము మహారాజింటికి పోయెను ఆతనికి ముగ్గురు పుత్రులుదయించిరి. పెద్ద వాఁడగు దేవాపి వనమునకుఁ బోయెను. మహారాజు వృద్ధావస్థలో రాజ్యమును శంతనున కప్పగించి వనమునకుఁబోవుచు నాతఁడాతనితో నిట్లనెను.- 'పుత్రా! నీతో నే(స్త్రీ) యేకాంతమున వచ్చి వివాహప్రస్తావమును గావించినచో నామెను స్వీకరింప వలయును. ఆమెను వివాహమాడవలయునుగాని ఆమె పనులలో దేనిలోను జోక్యమును గలిగించు కొనరాదు. ఆమె యేమిచేయఁదలఁచిన దానినిఁ జేయనిమ్ము.''

సూతుఁడిట్లనెను :- ''మునులారా! శంతను మహారాజు పితాజ్ఞచేతనే గంగాదేవిని వివాహమాడెను. ఆమె కార్యములలో దేనిలోను జోక్యము కలిగించుకొనననిప్రతిజ్ఞ నొనర్చెను. ఆతఁడామెతో సుఖపూర్వకముగ నుండి ఆనంద విహారమొనర్చుచుండెను. ఆతడు ప్రజల దుఃఖములను గమనింప నంతగ నామెరూపము నందాసక్తిని జెందెను. ఇచ్చటఁ బండ్రెండు సంవత్సరముల వఱకింద్రుఁడు వర్షమును గురిపింప లేదు. దీని వలన ప్రజలందరలో హాహాకారము చెలరేగెను.

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను :—“సూతా! అతివృష్టి, అనావృష్టులు రాజు పాపము వలనఁగలుగుచుండును. ధర్మాత్ముఁడగు శంతనుని రాజ్యమందిన్ని దినములు ఘోరమగు ననావృష్టియేలఁ గలిగినది? అతని రాజ్యమందు కాటకమేల వచ్చినది?’

సూతుఁడిట్లనెను :— “స్వామీ! ఈ ప్రశ్ననే శంతను మహారాజు బ్రాహ్మణులనడిగెను. ఆతఁడు సమస్త బ్రాహ్మణులను బిలిచి వారినిట్లడిగెను :— ‘విప్రోత్తములారా! నారాజ్యమందు దేవేంద్రుఁడేల వర్షింపఁడు?”

బ్రాహ్మణులిట్లనిరి :— “మహారాజా! నీకు పరవేత్తృత్వ దోష మాపాదించినది నీయన్న దేవాపి జీవించియున్నాఁడు. ఆతఁడుండఁగా నీవు రాజవైతివి. ఆతనికింకను వివాహము కాలేదు. నీవు వివాహమును జేసికొంటివి. ఈ దోషముచే నిందుఁడు నీరాజ్యమున వర్షమును గురిపించుటలేదు.’

రాజిట్లనెను :— దీనికేమి యుపాయమొనర్పవలయును? బ్రాహ్మణులిట్లనిరి :— నీవు నీయన్నకు రాజ్యము నొసంగుము ఇదొక్కటే యుపాయము కలదు.’

ఇదివినఁగానే శంతనుఁడు తనయన్నకు రాజ్యమొసంగుటకై వనమునకుఁ బోయెను. దేవాపికి రాజ్యము నొసంగినచో నాతని రాజ్యమున నరాజకత ప్రబలునని మంత్రులు

యోచించి ఆతని కడకు వాపదూకులగు నాస్తిక బ్రాహ్మణులను బంపిరి. వారుపోయి దేవాపికి నానాయుక్తుల ద్వారా వేదముల యొక్క అపౌరుషేయత్వమును ఖండించెను దైవగతిచే రాజునకిది నచ్చెను శంతనుఁడు వనమునకు తన రాజ్యమును దనయన్న కీయఁబోఁగా బ్రాహ్మణులాతనితో నిట్లనిరి: రాజా! ఫలాని వేదము ఫలాని సూక్తమందీ విషయము చెప్పఁబడినది, నీవంగీకరించెదవా? లేదా?"

దేవాపియిట్లనెను:- నేను వేదమును గీదమును నమ్మను ఈతఁడు వేదవిరోధియనియు, రాజ్యమున కనధికారియనియుఁ దెలిసికొనఁగానే శంతనునకు న్యాయానుసారముగ రాజ్యముపై నధికారము సంభవించినది. అన్న సదాచారహీనుఁడును, నయోగ్యుఁడును. మహారోగగ్రస్తుఁడు నగుచో నాతని తమ్ముఁడు న్యాయపూర్వకముగఁ దండ్రిరాజ్యమున కధికారి కాఁగలఁడు. కావున శంతను మహారాజు రాఁగానే యింద్రుడు వర్షమును గురిపించెను. ఎండిపోయిన భూమి యంతయును బచ్చపడెను. సర్వత్ర ఆనందము వ్యాపించెను.

అంత శౌనకుఁడిటడిగెను;- సూతా! దేవాపి మహారాజిట్టి వేద విరోధ వాక్యముల నేలఁ బలికినాఁడు? ఆతఁడు నాస్తికుఁడైనాడా?

సూతుఁడిట్లనెను:- లేదు, స్వామీ! దేవాపి పరమాస్తికుఁడు. ఆతఁడు భవితవ్యవశమున దేవతలయొక్కమాయచేఁ

గొన్నిశతాబ్దముల పాటేల్లుచుండెను. ఆతఁడు మహాయోగి. ఇప్పటికిని ఆతఁడు శ్రీబదరీనారాయణకు ఆవలఁగలాప గ్రామమందు యోగసమాధిలో నున్నాఁడు. ఈకలియుగమైన తరువాతఁ గృతయుగము రాఁగలదు. దానిలో నీతఁడు మరల నుచ్ఛిన్నమైన చంద్రవంశమును స్థాపింపఁగలఁడు.''

అంత శౌనకుఁడిట్లడిగెను:– ''అయితే. సూతా! గంగాగర్భమున శంతనుమహారాజున కెందరు పుత్రులుదయించిరి?''

సూతుఁడిట్లనెను:– ''స్వామీ! గంగాగర్భమున నష్టవసువులు జన్మించిరి వసువులు వశిష్ఠుని శాపముచే మానవయోనియందు జన్మింప వలసివచ్చెను. వారిలో నొక్కఁడు మాత్రమే నిలిచెను. ఆతఁడే భీష్ముఁడను పేరఁబ్రపంచమునఁ బ్రసిద్ధినిఁజెందినాఁడు.''

అంత శౌనకుఁడిట్లడిగెను :– ''సూతా! వసువులను వశిష్ఠుఁడేల శపించినాడు. వారిలో నొక్కఁడేయేల మిగిలెను?,

సూతుఁడిట్లనెను :– ''మంచిది, స్వామీ? ఇప్పుడు వసువావతారమగు శ్రీ భీష్ముని జన్మకథను మీకు జెప్పెదను. మీరందఱును సమాహిత చిత్తులరై దానిని శ్రవణ మొనర్పుఁడు.''

—(o)—

# దేవవ్రతుఁడు, భీష్ముఁడు.

(౨౦౫)

శ్లో॥ బాహ్లీకాత్సోమదత్తో౽భూద్భూరిర్భూరిశ్రవాస్తతః।
శలశ్చ శంతనోరాసీద్గంగాయాం భీష్మ ఆత్మవాన్॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౨ అ. ౧౮ శ్లో.

వ... బాహ్లీకుండనువానికి సోమదత్తుండుపుట్టె; సోమదత్తునకు భూరియు, భూరిశ్రవసుఁడును, శలుండు ననువారు మువ్వురు పుట్టిరి.

క॥ భాతిగ శంతనునకు గం
గా తటినికి వైష్ణవాగ్రగణ్యుఁడు ఘోరా
రాతినయన నీలోత్పల
భీతికర గ్రీష్ముఁడైన భీష్ముఁడు పుట్టెన్॥

శ్రీమదాంధ్ర భాగవతము.

ఏకార్యము చూచుటకు మనకప్రియముగను, అహితకరముగను గనఁబడునో దానిలోపల హితము సన్నిహితమై యుండును. ఏకారణమున నీఘటనము సంఘటితమైనదో, దాని మూలమును దెలిసికొనుటచే మరల మనకుఁ గ్లేశము కలుగదు. మంగళమయుఁడగు శ్రీహరి యొక్క విధాన

మంతయును మంగళము గాఁడకేని తెలిసి నిశ్చయమైనచో మానవుఁడు శోక, మోహ, చింతలనుండి శాశ్వతముగ నిర్ముక్తుఁడై నిర్ద్వంద్వుఁడగును. మన హృదయమున వికార ముండి, అది యేకత్రితమైయుండి, అది వ్రణరూపమున బయటకు రాఁదలఁచినచో నా వ్రణము కలుగుటలో మంగళమే కలదు. ఆ వ్రణము దేహమును స్వస్థమొనర్చుటకే. ప్రాణి యీరహస్యము నెఱుఁగఁజాలఁడు. తాత్కాలిక క్రియను గాంచి సుఖ దుఃఖములను జెందుచుండును. అతనికి దీనిమూలకారణము తెలిసినచో వానికి సుఖదుఃఖములు కలుగవలసిన కారణమే కనఁబడదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఇప్పుడు నేను మీకు అష్టవసువులు గంగా గర్భమున నేల పుట్టిరో చెప్పెదను. వశిష్ఠమహర్షి సుమేరు పర్వతప్రాంతమునందేకాంత స్థానమున నుండి తపస్సును జేయుచుండెను. ఆతని యాశ్రమమత్యంత మనోహరముగ నుండెను. దానికి దగ్గఱగా యోజనములకొలఁది వనము కలదు, దానిలో ఫలపుష్ప సమన్వితములగు ననేక వృక్షములుండెను. పచ్చని కోమలమగు గరికయు నుండెను. దానిలో నాతని నందినీ కామధేనువు సదా మేయుచుండును నందినీ కామధేనువు స్వర్గ కామధేనువు యొక్క పుత్రిక. ఆమె అత్యంతదర్శనీయముగను, మనోహర ముగను నుండెను. ఆమె స్తనములు గొప్పవి. ఆమె గిట్టలు,

తోఁక, సమస్తాంగములు ననుపమ శోభాయుక్తములుగనుండెను. ఆమె పాలనెవరైనఁ ద్రావిరా వారిని వృద్ధావస్థ యెన్నఁడును బాధింపదు.

ఒక దినమున నందినీ కామధేనువు మిక్కిలి యానందముతో పచ్చిగడ్డిని మేయుచుండెను. అచ్చటి కాసమయమున నష్టవసువులు తమ పత్నులతో వచ్చిరి. ఆయష్టవసువులలో నొకని పేరు ద్యువసువు. ఆతని భార్య మిక్కిలి పోఁకిరి, సరళ హృదయ. ఆసుందర ధేనువును గాంచి ఆమె తనపతితో నిట్లనెను :- "ప్రాణనాథా! ఈ గో వెవరిది? ఇది చాల సుందరముగ నున్నది. ఇట్టిగోవును నేనిదివరకెన్నడును జూడనే లేదు."

ద్యువసువిట్లనెను :- "ప్రియా! ఈమె స్వర్గీయ కామధేనువు యొక్క పుత్రిక నందినీ కామధేనువు. ఈమె వశిష్ఠుని కామధేనువు. ఆతఁడీమెను బుత్రికవలెఁ బోషించు చుండును. ఇదియును నాతని కోరికలన్నిటిని నెఱవేర్చుచుండును. ఈమెయొక్క సుందర స్వాదిష్ట దుగ్ధములను బానమొనర్చినవారు వేలకొలఁది సంవత్సరములు జీవించును. ఆతనికి వృద్ధావస్థ దరినైనఁ జేరదు."

ఇది విని ద్యువసు పత్ని అత్యంత ప్రేమతో నిట్లనెను :- "ప్రియతమా! నాదొక కోరిక యున్నది, మన్నించెదరా?"

ద్యువసువిట్లనెను :- "చెప్పుమది యేమో?"

వసువత్నియిట్లనెను :- "ప్రాణనాథా! నీవు మర్త్య లోకమందలి పరమ ధార్మికుఁడగు నుశీనర రాజర్షి నెఱిఁగియే యుందువు. ఆతనికి జితవతియను నొక కన్యక గలదు. ఆమె ప్రపంచమున సర్వశ్రేష్ఠసుందరి. మర్త్యలోకము విషయము చెప్పనేల? స్వర్గలోకమందును నామెను బోలిన సుందరిలేదు. ఆమె నాకు ప్రియసఖి. ఆమె యువతి. మర్త్యలోకమందు యౌవనము శాశ్వతముగ నుండదు. ఆయువాపస్థసమాప్తి కాఁగానే, ఆమె యనుపమ సౌదర్యమును సమాప్తమైపోఁ గలదు. ఆమె యౌవనము స్థిరముగ నుండవలయునని నేనను కొంటిని. మీరేవిధముగనైన నీ గోవును బట్టుకొని నాకొసం గుఁడు. నేను నాసఖికి నీమె నొసంగెదను. ఆమె యీమె పాలను ద్రావి సదా యువతిగనుండఁగలదు. దీని వలన నాకపారమగు హర్షము జనింపఁగలదు."

ద్యువసువిట్లనెను :- "ప్రియా! ఈమె పరమ తేజస్వి యగు వశిష్ఠుని కామధేనువు. దాని మీఁదకు మనస్సు పోవుట మంచిది కాదు."

ద్యువసుపత్ని యిట్లనెను :- "లేదు, ప్రాణనాథా! మీరు నాయీ కోరికను తప్పక తీర్పవలయును. నా సఖి యొక్క స్థిరయౌవనమును గాంచిన నాకపార హర్షము జనింపఁగలదు."

చాల మంది అనుచిత కార్యము లొనర్చియుండమ పత్నులను సంతోష పెట్టెదరు. స్త్రీని ప్రసన్నురాలుగా నొనర్చుటకై నరుఁడగాధ జలమందు మునుఁగును. ఆమెకు హారములను చేయించి తన ప్రియురాలి కంఠమున ధరింపఁ జేసెదరు. పెద్దపెద్ద సముద్రములను దాటి, ప్రాణమును బణ ముగఁబెట్టి సముద్రమును దాటును. అచ్చట ధనమును సంపాదించి తన ప్రాణప్రియుకు సువర్ణ, రత్నాభూషణములతో నలంకరించును. గొప్ప గొప్ప గజముల మస్తకములఁజీల్చి వాని కుంభస్థలములనుండి మౌక్తికములను దీసి, తన ప్రియురాలి మస్తకము నలంకరించును. మానవుఁడు తన ప్రియురాలినిఁ బ్రసన్ననొనర్ప నవసరములేకుండ, మనస్సున ద్రవ్యలోభము లేకున్నచో, కేవలము భిక్షాన్నము చేతనో, వన్యఫల మూలములచేతనో, శాకముచేతనో, యాఉదరమును నింపుకొని భగవచ్చింతనమందే కాలమును వెళ్ళఁబుచ్చినచో నాతఁడనుచిత కార్యముల నేల నొనర్చును? ద్యువసువు తనపత్ని యొక్క కోరికను గాదనఁజాలక పోయెను. అతఁడు మిగిలిన నేడ్గురు సోదరుల సహాయముచే నందినీ కామధేనువును బట్టుకొని, తన పత్నికిఁ జెలికత్తెయును నుశీనరకుమారియునగు జీవవతి కడకుఁబంపివై చెను. ఆసమయమున వశిష్ఠమహాముని ఆశ్రమమునలేఁడు అతఁడు ఫలపుష్పములను, సమిధలను, గుశలను దెచ్చుటకై అడవికిఁబోయెను.

ఫలపుష్పములను దీసికొని వశిష్ఠమహాముని తనయాశ్రమమునకు రాఁగానే ఆతనికచ్చట నందినీ కామధేనువు కనఁబడలేదు. నల్దిక్కుల వెదకినను నదిదొరకకపోఁగా నాతఁడు ధ్యానమున దాని నన్వేషించెను. సమాధి ప్రభావముచే ముని వసువులుచేసిన కార్యమును గ్రహించెను. ఆతనికి వసువులమీఁదఁ గోపమువచ్చెను. క్రోధావేశమున నాతఁడు వసువులకు శాపమొసంగెను. "మీరు దేవతలయ్యు నిట్టి గర్హ్యకార్యమును నొనర్చితిరి. కావునమీరందఱును మర్త్యలోకమందు, మనుష్యయోనియందు జన్మించెదరుగాక! మీరు స్త్రీకడుపునఁ బుట్టఁగలరు"

అష్టవసువులకు మునిశాపము తెలియఁగానే వారు మిక్కిలి భయపడిరి. భయమునఁ గంపించుచు వారు ముని సమీపమునకు వచ్చిరి. వారనునయ వినయము లొనర్చుచు మునిశాపము నుపసంహరింపుఁడని ప్రార్థించిరి. అంత వశిష్ఠభగవానుఁడిట్లనెను:- "నాయనలారా! నేనెన్నడు నగత్యాళికైనను నబద్ధమాడలేదు. కావున నాశాపమన్యథా కాఁజాలదు. అయితే, మీరు భూమిపై జన్మించిన నల్పకాలముననే మానవదేహమును ద్యజించి మరల దేవతలుకాఁగలరు. కాని యేద్యువసువు నాగోవును హరించినాఁడో, ఎవనికారణమున మీరందఱును శాపవశులైరో ఆతఁడు మానవుఁడై జన్మించి పృథివిపై నుండవలయును. కాని యీతనికి సంతానము కలుగదు. ఈతనికి స్త్రీయందిచ్ఛయు నుండదు.

ముని నోట నీవాక్యములను విని వసువులత్యంతచింతాతురులైరి. వారిట్లనుకొనిరి:- "దేవతలమై మనము మానవస్త్రీ గర్భమున నెట్లు పుట్టఁగలము?" అని వీరిట్లు చింతించుచునంతలో బ్రహ్మసభకు గంగ వచ్చుచుండెను. గంగ యిట్లడిగెను.- "వసువులారా! మీరింత చింతితులైరేల?"

వసువులిట్లనిరి:- "మాకు వశిష్ఠుని శాపము సంభవించినది. మేము మనుష్యలోకమందు స్త్రీగర్భమున జన్మింపవలసియున్నది, దేవీ! నీవు మర్త్యలోకమున మాకు తల్లివికమ్ము. మేము సాధారణ స్త్రీయుదరమునఁ బుట్టఁదలచుటలేదు."

గంగయిట్లనెను :- "మంచిది, నేనును మర్త్యలోకమునఁ బ్రతీప సుతుఁడగు శంతనునకుఁ బత్నిని కావలసియున్నది. మీరందఱును నాకడుపునఁ బుట్టవలయును,"

వసువులిట్లనిరి:- "దేవీ! నీవు కనఁగానే మమ్ము గంగాజలమున వదలవలయును. దానివలన మేము శీఘ్రముగ శాపవిముక్తిఁజెంది మరల దేవతల మయ్యెదము."

గంగ యిట్లనెను:- "సరియే, అట్లే జరుగఁగలదు" ఇట్లు పలికి గంగ అంతర్ధానమయ్యెను. కాలాంతరమున నామె శంతను పత్నియైనది. ఆమె గర్భమునఁ గ్రమముగ వసువులు జన్మించిరి.

సూతుఁడిట్లనెను:-'మునులారా! గంగను పెండ్లాడి శంతన మహారాజుమిక్కిలి హృష్టుఁడయ్యెను. గంగ మానవస్త్రీరూపమును ధరించెను. ఆమె మహారాజును సేవ, భావ, కటాక్ష, రూప, లావణ్య, ప్రేమ చాతురీలచే సదా బ్రసన్ను నొనర్చుచుండెను. మహారాజును నామె శీల, స్వభావ గుణములకు ముగ్ధుఁడై ఆమెమీఁద నాసక్తినిఁ జెందియుండెను. ఆతఁడామెకు సమస్త భోగసామగ్రినొసంగుచు సంతోషపఱచుచుండెను. ఈ విధముగ నాదివ్యస్త్రీతో రమించుచుఁజాల దినములు గడిపెను. కాలాంతరమున నామెగర్భమున నష్టవసువులు క్రమముగ జనించిరి- పిల్లవాఁడు పుట్టఁగానే గంగ గంగాప్రవాహమందు వానినివదలి యిట్లనెడిది:- "పొమ్ము. నేను నిన్ను మానవ దేహమునుండి ముక్తినొనర్చితిని.''

రాజునకు గంగాదేవి యొనర్చు నేకార్యము యేమాత్రము నిష్టములేకుండెను కాని అతఁడు ప్రతిజ్ఞాబద్ధుఁడు. గంగకాతఁడిట్టి మాటనిచ్చియుండెను:- "నేను నీయే కార్యమందును జోక్యమును గలిగించుకొనను.'' అందువలన నాతఁడేమియును నామెతో ననఁజాలకుండెను. అయితే ఆతనికీ విధముగఁ బుత్రులను జలములో విడుచుటచే మానసికదుఃఖము కలుగుచునే యుండెను. ఆమె తనను వదలి వెడలిపోవునేమోనను భయమాతనికిఁగలదు.

ఈవిధముగ గంగాదేవి తన యేడ్గురు పుత్రులను గంగలోఁ బాఱవైచెను. ఎనిమిదవపుత్త్రుని గంగలోముంచఁబోఁగా శంతనుఁడిట్లనెను:- "దేవి! నీవు రాక్షసివా? అసురస్త్రీవా? ఇట్టి జఘన్యకార్యమొనర్చుటలో నీకు సిగ్గు వేయుటలేదా? నీతిశాస్త్రజ్ఞులు సత్యమునే చెప్పిరి కన్యక యొక్క కులశీలము లెఱుఁగక వివాహమాడరాదని. నీవెవరికుమార్తెవో, నీకులమేదో నాకుదెలియదు. నీవిట్టి క్రూరకార్యమొనర్తువని నాకేమి తెలియును? నీవు నాకులమును నశింపఁజేయఁగలవు. ఇట్లయిన నావంశమెట్లు నిలువఁగలదు?"

ఇది విని నవ్వుచు గంగాదేవి యిట్లనెను:- "రాజా! నేను రాక్షసినిగాను, అసురనుగాను. నేను దివ్యకన్యకను భగీరథుఁడు తపస్సునుజేసి నన్ను స్వర్గమునుండి యిచ్చటికిఁ దెచ్చినాఁడు. అందువలన నన్నందఱును భాగీరథియందురు, జహ్నుమహర్షి నన్నుఁ ద్రావి మరలఁదన శరీరమునుండి విడుచుటచే నన్ను జాహ్నవియందురు. నేను ఆపద గంగను. శాపవశమున నేను మానవశరీరమున నుండవలసివచ్చినది. నాచేగంగలోఁ బడ వేయఁబడిన పుత్త్రులష్టవసువులు. వీరునన్ను మర్త్యలోకమునఁదల్లిగానుండవలసినదనియుఁ బుట్టంగానె మానవశరీరమునుండి ముక్తులనొనర్పవలయుననియుఁ బ్రార్థించిరి. అందువలన వీరిని నేను జలములందు వదలితిని. ఈ చివరకుమారుఁడు నీవంశమును నిలుపుటకై మిగులఁగలఁడు మహారాజా! నీవు నా

కార్యమున జోక్యమును గలుగఁజేసికొంటివి కావున నిఁక నేను నీకడ నుండఁజాలను.” అని యిట్లుపలికి గంగ యాచివరి కుమారునిఁ దీసికొని అంతర్ధానమయ్యెను. గంగయను సంగతినిఁ దెలిసికొని శంతన మహారాజాశ్చర్య చకితుఁడయ్యెను.

గంగ అంతర్ధానమై చాలదినములైనది. రాజు గంగను మఱవఁజాలకపోయెను. ఆతఁడు సాధారణముగ నేకాంతమున గంగాతీరమునఁ గూర్చుండి గంగను స్మరించుచుండెను. ఒక్కక్షణమైన గంగను మఱవఁజాలనట్లుగ గంగ రాజునకు రతి సుఖముల నొసంగెను. ఒక దినమున మహారాజు గంగాతటమునఁ గూర్చుండియుండెను గంగధార కొంచెమెండి యుండెను! సముద్రగామియగు గంగా ప్రవాహము నెవరెండింపఁ జేసిరని ఆతనికాశ్చర్యము కలిగెను! ఆతఁడత్యంత కుతూహలముతోఁ గొంచెము ముందుకుఁబోయెను. కొంచెము దూరము పోయిచూడఁగా నత్యంత సుందరుఁడును, దృఢకాయుఁడును, బలిష్ఠుఁడును, కిశోరావస్థను జెందినవాఁడునగు నొక బాలకుఁడు ధనుర్బాణములను ధరించి నిలిచియుండెను ఆతఁడు తనయస్త్రముల ప్రభావముచే నొక్కబిందువైనను నీరావలకుఁ బోకుండునట్లు గంగావేగము నడ్డగించెను. అచ్చటనే సముద్రమువలె స్థిరభావముతోనుండిన జలములు తరంగములు రేగుచుండెను. ఆతఁడు దేవసేనాపతియగు కార్తికేయునివలె సుదృఢముగను, బలిష్టుఁడుగను, కామదేవునివలె సుందరుఁడుగను నుండెను.

మూర్తీభవించిన వీరరసమువలె నొకకాలిని ముందునకు బెట్టి స్థిరభావములో నిలుచుండెను. సాక్షాత్కరించిన పరాక్రమమువలె నాతఁడస్త్ర శస్త్ర చమత్కారమును జూపించుచుండెను. శంతనుఁడీ యద్భుత బాలకునిఁగాంచి పరమవిస్మితుఁడయ్యెను మహారాజిట్లనెను:– "పురుషసింహమా! నీవెవరు?"

ఇది వినఁగానే ఆ బాలకుఁడు వెంటనే అంతర్థానుఁడయ్యెను. అప్పుడు రాజునకింకను నాశ్చర్యమయ్యెను. ఆతఁడు గంగాతటమునఁ గూర్చుండి, అత్యంతకరుణాస్వరమునవేఁడుచు యిట్లనెను:– "గంగా! త్రిపథగామినీ! నీవు నాకీదేవకుమారుని మరలఁజూపించుము. ఇది మాయయా? మంత్రమా? లేక నా చిత్తభ్రమయా?! ప్రియా! నీవు నాయెడల నింతటికఠోరవైఖరి వేల?"

ఇంతలో నాతఁడత్యంత శుభ్రవస్త్రము ధరించిన నొక దేవకుమారి ఆ బాలకుని వెంటఁబెట్టుకొని వచ్చుచుండుటను గాంచెను. ఆమె సాక్షాత్తుగ గంగాదేవి రాజు దగ్గఱ నామె మానవస్త్రీ వేషము ధరించియున్నపుడామె వేషభూషలు వేఱుగనుండెను. నేఁడామె శ్వేతవస్త్రమును ధరించి మిక్కిలి తేజస్విగను, దివ్యలోకమందలి దేవిగను గనఁబడుచుండెను. ఆమె అత్యంతమధుర వచనములతో నిట్లనెను:–"దేవా! మీరునన్ను గుర్తింపలేదా యేమి?"

రాజిట్లనెను:- "దేవి! నీవాక్కునుబట్టి నీవు నాప్రాణ ప్రియయగు జాహ్నవియని యనుమానించుచున్నాను."

గంగయిట్లనెను:- "అవును మహారాజా! మీయను మానము యథార్థమే. నేనుగంగనే మీవీర్యముచేఁ జనరకఁ బుట్టినే కుమారుఁడు వాఁడువీఁడే నేను వీనినిఁబోషించి ఇంత పెద్దవానినిగా నొనర్చితిని. వశిష్ఠ భగవానునికడ నీతఁడస్త్రి శస్త్రివిద్యనంతను నేర్చియుండెను. ఈతని యుద్ధమందు దేవా సుర, రాక్షస, గంధర్వ, యక్ష, కిన్నరు లందఱును గలిసినను జయింపఁజాలరు. ఇంకఁ బృథివియందలి రాజులసంగతిఁ జెప్ప నేల? మహారాజా! ఇప్పుడునీపుత్రుఁ బెంచుకొని, నీరాజ్యమున కధికారిగా నొనర్చుము."

ఇట్లుపలికి కుమారుని చేతిని రాజుచేతిలోఁబెట్టి గంగా దేవి వెంటనే అంతర్థానమయ్యెను. రాజాకుమారుని సంతోష ముతోఁ దన నగరమునకుఁ దెచ్చుకొని, యథాసమయమున నాతని యువరాజపదమున నభిషిక్తునొనర్చెను. రాజు రాజ కుమారునకు దేవవ్రితుఁడను పేరును బెట్టెను. దేవవ్రతుఁడు మిక్కిలి బుద్ధిమంతుఁడును, ధార్మికుఁడును, సుశీలుఁడును. తండ్రిఆజ్ఞల కనుకూలముగ వర్తించువాఁడును నైయుండెను. ప్రిజలందఱును నాతని ప్రాణాధికముగఁ బ్రేమించు చుండిరి. ఆతఁడందఱితోడను బంధువులవలెను, కుటుంబములోని వారి

వఁటెను వర్తించుచుండెను. అతఁడు పరశురాముని దగ్గఱను నస్త్ర శస్త్ర విద్యను గ్రహించెను. ఆసమయమునఁ బ్రపంచమందు దేవవ్రతునిఁబోలిన శూరవీరుఁడును, బలవంతుఁడును అస్త్ర శస్త్ర విద్యానిపుణుఁడును రాజులలోఁ గానిండు రాజకుమారులలోఁ గానిండు లేకుండిరి. దేవతలును దేవవ్రతుని పరాక్రమమునకు భయపడుచుండిరి. దేవేంద్రుఁడును నాతని సహాయమును గాంక్షించుచుండెను. తరువాత నాతనికి దేవవ్రతుఁడని కాక భీష్ముఁడను పేరువచ్చెను.

ఇది విని శౌనకుఁడిట్లనెను.– "సూతా! శంతను సుతుఁడగు దేవవ్రతునకు భీష్ముఁడను పేరేలవచ్చినది? దేవవ్రతుఁడను పేరాతనికిఁ బ్రసిద్ధనామము కాదే! అందఱును నీతని భీష్మ పితామహుఁడనుచుందురు. ఈతఁడందఱకును పితామహుఁడా?

సూతుఁడిట్లనెను – "స్వామీ! ఈతఁడు తన తండ్రిని సంతోషపెట్టుటకై యువరాజ పదమును త్యజించెను. ఇంతే కాదు, జీవితాంతము వఱకవివాహితుఁడై అఖండ బ్రహ్మవ్రత భీష్మ ప్రతిజ్ఞనొనర్చెను. ఈకఠోరప్రతిజ్ఞ నొనర్చుట చేతనే అందఱీతని భీష్ముఁడని పిలుచుచుందురు. ఈతఁడు కౌరవ పాండవులకుఁ బితామహుఁడు. అందఱను బెంచిన దీతఁడే. రాజు యొక్క గురువునందఱును గురువనునట్లును, రాజమాతనందఱు నుమాత యనునట్లును, నీతఁడు రాజునకుఁ బితామహుఁడగుట

చేఁ బితామహుఁడను ప్రసిద్ధినిఁ జెందెను. ఈతని చరిత్రము చాల అద్భుతమైనది. ఈతఁడు యుద్ధమందు విశ్వవిజయుఁడగుఁ బరశురామభగవానుని గూడ సంతుష్టు నొనర్చెను.''

అంత శౌనకుఁడిట్లనెను:- ''సూతా! మాకు దేవవ్రతుఁడగు భీష్ముని చరిత్రమునంతను జెప్పుము. ఆతఁడవివాహితుఁడగు నట్లేల ప్రతిజ్ఞ నొనర్చినాఁడు? పరశురామునకును నీతనికిని యుద్ధమేకారణమున జరిగినది?''

అంత సూతుఁడిట్లనెను:- ''మంచిది, స్వామీ! ఇప్పుడు నేను వీరయోధాగ్రణియగు భీష్ముని చరిత్రమును జెప్పెదను. మీరు దత్తచిత్తులరై శ్రవణమొనర్పుఁడు.''



# దేవవ్రతుని భీష్మప్రతిజ్ఞ

(౭౮౬)

శ్లో॥ శాంతనోర్దాశకన్యాయాం జజ్ఞే చిత్రాంగదః సుతః॥
విచిత్రవీర్యశ్చావరజో నామ్నా చిత్రాంగదో హతః॥
యస్యాం పరాశరాత్సాక్షాదవతీర్ణో హరేః కలా॥

శ్రీభాగ ౯ స్కం. ౨౨ అ. ౨౦ ౨౧ శ్లో.

వ. ఆశంతనునకు దాశకన్యకయైన సత్యవతి యందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులు పుట్టి; రందుఁ జిత్రాంగదుండు గంధర్వులచే నిహతుఁడయ్యె

ఉ॥ సత్యవతీ వధూటిమును శంతను పెండ్లముగానినాఁ సాం
గత్యమునం బరాశరుఁడు గర్భసేముసిన బాదరాయణుం
డత్యధికుండు శ్రీహరి కళాంశజుఁడై ప్రభవించె,సత్యముల్
సత్యములైన వేదముల సాంగములన్ విభజింపదక్షుఁడై.

శ్రీమదాంధ్ర భాగవతము.

అతి గొప్పదైన తన సుఖమునకు తృణములోఁ దిలాంజలి నెవరొసంగెదరో వారికే యిష్టప్రాప్తి కలుగును. సాంసారిక సుఖాపేక్షకలవారలకు పారలౌకిక సుఖము లభించుట మిక్కిలి కష్టము. శారీరక సుఖములను త్యజింపక గురుజన సేవలభింపదు. తల్లి, తండ్రి, ఆచార్యుడు, గురు జనముల

సంతోషము కొఱకెంతెంతటి త్యాగము నొనర్చిన నంతటి యశస్సును బ్రపంచమునఁబొందును. త్యాగములన్నిటిలో స్త్రీసుఖమును ద్యజించుట మిక్కిలి దుష్కరము. మానవుఁ డొకసారి ప్రాణమును ద్యజించుటకైనఁ దత్పరుఁడగును. కాని జీవితమంతయును స్త్రీ సుఖమును ద్యజింపఁబ్రతిజ్ఞను బూనుట గొప్ప శూరుని, జితేంద్రియుని, దృఢప్రతిజ్ఞుని, సంయమము కలవానిఐని. ఏమానవుఁడిట్టి ప్రతిజ్ఞనొనర్చి నిర్వ హించుకొనునో వాని పదరజము కొఱకు దేవతలువ్విళ్లూరు చుందురు. భగవానుఁడును వానికి దర్శనమొసంగఁ బరువిడును.

సూతుఁడిట్లనెను :- "మునులారా! గంగాపుత్రుఁ డును, శంతనునందనుఁడునగు దేవవ్రతునకు భీష్ముఁడను పేరేల వచ్చినదో, ఆ ప్రసంగమును మీకు జెప్పెదను. యువరాజైన తరువాత దేవవ్రతుఁడు తన తండ్రియొక్క సమస్తకార్యములు నిర్వహించుచుండెను. ఆతఁడు చాల శ్రద్ధతో రాజ్యకార్య ములను జూచుచుండెడువాఁడు. ప్రజలకు మేలగు కార్య ముల నన్నిటిని మిక్కిలి దృఢముగఁజేయించెడు వాఁడు. ఇప్పుడు రాజునకు విశ్రాంతి లభించెను. ఆతఁడు స్వచ్ఛం దుఁడై వనోపవనములందుఁదిరుగుచు, నదులకును బర్వతము లకును బోయి వేటాడుచు సుఖముగ జీవనమును గడుపు చుండెను.

ఒక దినమున నాతఁడు వేఁటాడుచు యమునాతీర మునఁబోయెను. అచట నాతనికి మంచి చక్కని కమల సుగంధము రాసాగెను. ఆ సుగంధమును బట్టి ఆతఁడు యమునా తటమునకుఁ జేరుకొనెను. అచ్చటికిఁబోయి చూడఁగా నొక మిక్కిలి రూపలావణ్యయుక్తయగు యువతి ఒక నౌక మీఁదఁ దెడ్డుపట్టుకొని నిలుచుండెను ఆమె తనయొక్క అనుపమ సౌందర్యముచే నాయమునా తటమునంతను సౌందర్యయుక్త మొనర్చుచుండెను. ఆసుగంధమాసుదతి శరీరమునుండి వెలువడుచున్నదని రాజు తెలిసికొనెను. మహారాజామె యొక్క అనుపమ రూపలావణ్యమునకును అంగవిన్యాసమునకును మిక్కిలి ప్రభావితుఁడయ్యెను ఆతఁడాసుందరి నిట్లడిగెను:- “దేవీ! నీవెవరవు? ఎవరిపుత్రికవు?”

ఆయువతి యిట్లనెను:- “రాజా! నేను నిషాదరాజు పుత్రికను నన్ను సత్యవతి యందురు.”

రాజిట్లడిగెను :- “నీవిచ్చట నౌకమీఁద నుండి యేమి చేయుచున్నావు?”

యువతియిట్లనెను :- “మహారాజా! నాతండ్రి నాకు ఆయొడ్డున నున్నవారిని నీయొడ్డునకును, నీయొడ్డున నున్న వారిని నాయొడ్డునకును దాటించు పని నొప్పగించినాఁడు. తండ్రి యాజ్ఞచే నేను యాత్రికులను దాటించుచుందును.”

రాజిట్లనెను :- నన్ను ను దాటించుము. నేను నీ సౌందర్యసాగరమున మునింగిపోవుచున్నాను.''

ఇది విని కన్య లజ్జితయయ్యెను. ఆమె తలవంచుకొని యిట్లనెను :- "మహారాజా! మీనోట నిట్టి మాటలు శోభింపవు ''

రాజిట్లనెను :- "నీవు యువతివి. వివాహ యోగ్యవు. నేను నిన్ను వివాహమొనర్చుకొనం దలంచినచో నీవు నన్నం గీకరించెదవా?''

మిక్కిలి లజ్జించుచు మెల్ల మెల్లంగా సత్యవతి ఆగి యాగి యిట్లనెను:- "మహారాజా! నేను స్వతంత్రిను గాను. పితృాధీనను నాతండ్రి నన్నెవనికొసంగిన నేను వానితోం బోయెదను. వివాహ మొనర్చుకొనుటకు నాకు స్వాతంత్ర్యము లేదు. మీరునన్నుం గోరుకొనునెడల నాతండ్రినడుగుండు. ఆతండు మీ యోగ్యుండగు వరుండని భావించి నన్ను తప్పక యీయంగలండు.''

రాజు ధర్మాత్ముండు. ఆతండు కన్యకతండ్రియగు దాశ రాజు కడకుంబోయి యిట్లనెను.- "నిషాదరాజా! నీవు గొప్ప భాగ్యశాలివి. సలననంగా నీపుత్రిక మిక్కిలిసుందరి. నీవు నీ పుత్రికను నాకొసంగుము. నేనామెను వివాహమాడం గోరు చున్నాను.''

నిషాదుల కధిపతియగు నిషాదరాజిట్లనెను:- "రాజా! తండ్రి కూఁతు నితరులకొఱకే పెంచును. పుత్రిక కన్యాత్వ మునుద్యజించి యువతియగుకొలఁది తండ్రిచింత పెరుగుచుం డును. తన పుత్రికకు యోగ్యుఁడగు వరుఁడులభించి, సుఖముగ నుండవలయునని యువతీకన్యయొక్క తండ్రి రాత్రింబవళ్ళు చింతించుచుండును. నాపుత్రిక వివాహయోగ్యమైనది. నే నామెకొఱకు యోగ్యుఁడగు వరునన్వేషించుచున్నాను. భగ వానుఁడు నాకోరికను నెఱవేర్చినాఁడు. మహారాజా! నీవీభూ మండలమునకేక ఛత్రాధిపతివి, సామ్రాట్టువు. నాపుత్రికకు నీవంటి వరుఁడెచ్చటను జిక్కును? కాని నీవు వివాహమునకుఁ బూర్వమొక ప్రతిజ్ఞ నొనర్పవలయును?"

శంతను మహారాజది యేమి? యని యడిగెను

నిషాదుఁడిట్లనెను:- "ఈ నాకన్యకకుఁ బుట్టినపుత్రుఁడు నీరాజ్యమునకు నీతరువాత నుత్తరాధికారి కావలయును మహారాజా! నీవెట్లు రాజవో, అట్లేయీయామెయొక రాజర్షియొక్క వీర్యముచే మత్స్యముయొక్క ఉదరమునుండి పుట్టినది. నేనీమెకుఁ బెంపుడుతండ్రిని. ఈమెపుత్రుఁడు రాజసింహాసనమునఁగూర్చుం డఁగాఁజూడవలయునని నాకోరిక."

ఇది వినఁగానే శంతను మహారాజు నిర్ఘాంతపోయెను. ఆతఁడు లోలోన నిట్లనుకొనెను:- "ఈనిషాదుఁడు నాకోరికను

వమ్మునుఁ జేసినాఁడు. నాకు గంగాగర్భమున నుద్భవించిన గాంగే యుఁడను బుత్రుఁడు కలఁడు. ఆతఁడు రాజ్యమునకు సర్వథా యోగ్యుఁడు. ఆతనిలోనన్నియును గల్యాణగుణములే. వానిని నేను యువరాజ పదమునఁగూడ నభిషిక్తుఁ జేసితిని. వానిని నేను వీడి యీతని దౌహిత్రునకు రాజ్యమొసంగినచోఁ బ్రజ లందఱును నన్ను ఛీకొట్టెదరు. నేను గామినని అందఱును నింధించెదరు. ఈతనికిఁ బ్రతిజ్ఞనొనర్చి దానిని నేను నెఱవేర్పఁ జాలకున్నచో నేను నరకయాతనలననుభవింప వలసివచ్చును. ఈలోకమందును, బరలోకమందును, నాకపకీర్తి వ్యాపింపఁ గలదు. కావున నీయువతినిఁ బొందవలయునను కోరికను నేను వదలుకొనవలసియున్నది. దీనిలోనే నాకుమేలుఁగలదు." అని అనుకొని ఆతఁడేమియును మాటలాడలేదు. ఆకన్యకయొక్క అనవద్య సౌందర్యమును, దివ్యరూపలావణ్యమును జింతించుచు నాతఁడు తన నగరమునకు వచ్చెను.

నగరమునకువచ్చి ఆతఁడు సత్యవతీరూపమును మఱచు టకుఁ బ్రయత్నించుచుండెను గాని ఆతఁడెంత ప్రయత్నించిన నంతటి దుఃఖముకలుగుచుండెను. యోజనములవరకు నాయువతి శరీరమునుండి వెలువడుచుండిన గంధమింకను నాతనినాసికనుండి వచ్చుచునేయుండెను.''

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:_"సూతా! నిషాదకన్యయైన సత్యవతీ శరీరమునుండి యిట్టి దివ్యకమలగంధమేల వచ్చుచుం

డెను? దీనికేదైన విశేష కారణముండిన దానిని మాకుఁ జెప్పుఁడు ''

ఇదివిని సూతుఁడిట్లనెను:- ''స్వామీ! ఒక రాజర్షి తన ఋతుస్నాతయగుపత్నిని వీడి పితరుల నుద్దేశించి మృగయానిమిత్తమై వనమునకుఁబోయెను. అచ్చట నిరంతరము పత్నిని స్మరించుటచే నాతని శుక్రము స్ఖలితమయ్యెను. ఆతఁడొక దొప్పలో నొకపక్షిద్వారా దానినిఁదన పత్నికడకుఁబంపెను. రాజమోఘవీర్యుఁడు పక్షియా యవ్యర్థవీర్యమును గొనుచు నత్యంత వేగముతో నెగురుచుండెను. ఇంకొక పక్షి అదే దో ఖాద్య పదార్థమనుకొని దానిపై గవసెను. రెంటికిని బోరుజరిగెను. అప్పుడాదొప్ప యమునానదిలోఁబడెను దానినొకపెద్ద చేఁప తినఁగా దాని యుదరమున గర్భము నిలిచెను. దైవయోగమున గర్భవతియగు నామత్స్యమొక నిషాదాధిపతి వలలోనికివచ్చెను. దానిఁ జీల్చఁగా దానిలోనుండి ఒక కన్యక వచ్చెను. ఆమె మిక్కిలిసుందరి, రూపవతి. కానిఆమెలో గొప్ప దోషమేమనఁగా నామెశరీరమునుండి చేఁపల కంపు మిక్కిలిగ వేయుచుండెను. అందువలన నందఱునామెను మత్స్యగంధి యనిపిలుచుచుండిరి. ఆమెశరీరమునుండి యిట్టిచెడ్డ వాసన వచ్చుచుండుటచే నెవరును నామె సమీపమున నిలువఁజాలకుండిరి ఆమెతఁడ్రి యాజ్ఞచే యాత్రికులను దాటవేయుచుండెను దైవయోగమునఁ బరాశరుఁడు నొకమీఁద నదిని

దాటుచుండెను. ఆతఁడామెకడుపున మహాయోగియగు వ్యాస భగవానుఁ డుదయించెను. అత్తఁడామెకు రెండు వరము లొసంగెను మొదటిది, నీకడుపున వ్యాసుఁడుదయించినను నీ కన్యాత్వము నశింపదనియు. రెండవది నీశరీరమునుండి వెలువడు మత్స్యగంధముపోయి కమలగంధము వెలువడఁగలదనియు నది ఒక యోజనమువఱకు వ్యాపించుననియు ననుగ్రహించెను ఆదినమునుండి పరాశరమహాముని ప్రభావముచే నామె శరీరమునుండి కమలగంధము రాసాగెను. అది యోజనమువఱకు వ్యాపించుచుండెను. అందువలన నామెకు యోజనగంధి యనియును పేరుకలిగెను.

శౌనకుఁడిట్లడిగెను:— "సరే, తరువాత నేమైనది? శంతను మహారాజామెను వివాహమాడినాఁడా? లేదా?

సూతుఁడిట్లనెను:— "అవును, అదియే స్వామీ! నేను జెప్పుచున్నాను. మహారాజు సత్యవతినిఁగాంచి నగరమునకు వచ్చినప్పటినుండి మిక్కిలి చింతాక్రాంతుఁడై యుండెను. ఆతఁడు నవ్వుచుమాటలాడుటలేదు అశ్వము నెక్కి మృగయార్థమై వెడలుటలేదు. విశేషముగ మాటలాడుటలేదు. ఆతఁడు నిరంతర మేకాంతమునఁ జింతతోఁ గూర్చుండి ఘోరచింతలో నిమగ్నుఁడై యుండెను.

ఒకదినమున దేవవ్రతుఁడు పూజ్యుఁడగు తనతండ్రితో నిట్లనెను:— "పితృదేవా! మీరేలకో యిప్పుడు నిరంతరము

చింతగానున్నారు మీరిదివరకెంత స్నేహముతో, నెంతటి యుల్లాసముతో నాతో మాటలాడుచుండిరో యిప్పుడావిధముగ మాటలాడుటలేదు. మంత్రులను రాజకార్యములను గూర్చియు నడుగుటలేదు. కూడ వేటయనిన మిక్కిలి యిష్టము. నిత్యమును నశ్వముపై నెక్కి వనమునకుఁబోవు చుందురు. ఇప్పటికి చాలదినములనుండి మీరు రాజభవనము నుండి బయలుదేరుటలేదు మీచింతను నాకుఁజెప్పుఁడు."

ఇదివిని శంతనుఁడిట్లనెను:- "వత్సా! నాచిత్తమేదో చింతగానే యున్నది."

దేవవ్రతుఁడిట్లనెను:- "తండ్రీ! మీరు నావద్ద దాచవలదు మీమనోవ్యథను నాకుఁజెప్పుఁడు. నేను దాని నివారణముకొఱకు సతతము ప్రయత్నించెదను."

అత్యంత స్నేహముతో శంతనుఁడిట్లనెను.- "వత్సా! ఏమిచెప్పుదును? నేఁడు నాచిత్తము వికలత చెందినది యోగ్యుఁడగు పుత్త్రుఁడుండఁగా భార్యలేకున్న నింకొకవివాహమును జేసికొనరాదు. నీవంటి శూరవీరుఁడును, సుయోగ్యుఁడునగు పుత్త్రుఁడుండఁగా నేను ద్వితీయవివాహమును గూర్చి చింతింపరాదు. కాని, అప్పుడప్పుడు నామనస్సున వివాహమొనర్చుకొనవలయునను ప్రేరణము కలుగుచుండును. శాస్త్రికారు లొకపుత్త్రుఁడు కలవాని నపుత్త్రునిగానే చెప్పిరి. పుత్త్రోత్ప

దనమన్నిటికంటె గొప్పధర్మము. పుత్రోత్పాదన మొనర్పక, తన వంశము క్షుణముగనుంచుటకై ఆత్మజులను సృష్టింపకున్నచో కాని జప, తప, దాన, ధర్మ, యజ్ఞానుష్ఠానాది సమస్త శుభ కర్మంబును వృధాయగును అందువలననే నీవంటి యోగ్యుఁడగు పుత్రుఁడుండఁగా నేను వివాహమును జేసికొనుటా, చేసికొనక పోవుటా యను నసమంజసములోఁబడితిని.''

తన తండ్రినోటనిట్టి వాక్యములను విని పరమబుద్ధి మంతుఁడగు రాజకుమారుఁడగు దేవవ్రతుఁడు తన తండ్రి మనస్సెచ్చటనో లగ్నమైనదని గ్రహించెను. నా తల్లియగు మహాత్మ్యబ్రాహ్మణమగు పదవినిఁబొందఁదగు నా భాగ్యవతి యగు కుమారి యెవరాయని ఆతనికిఁజింతబట్టుకొనెను ఆతఁడు వృద్ధ మంత్రులవలనను, రాజుయొక్క ముఖ్య ముఖ్య సుహృదుల వలనను నీవిషయమును దెలిసికొనెను. ఆతఁడు మహారాజు నెట్లడుగఁగలడు? అడుగఁగా నడుగఁగా నాతనితండ్రి నిషాద రాజపుత్రికయగు సత్యవతి యందనురక్తుఁడైనాఁడని ఆతఁడు తెలిసికొనెను. ఈవిషయము తెలియఁగనే ఆతఁడు పదినైదు గురువృద్ధబ్రాహ్మణులను, పదునైదుగురను సామంత రాజులను, సేవకులను వెంటఁబెట్టుకొని నిషాదరాజుండు చోటునకుఁ బోయెను. నిషాదరాజు వీరందఱకును నత్యంత ప్రేమతో స్వాగత సత్కారము లొనర్చెను.

రాజకుమారుఁడగు దేవవ్రతుఁడిట్లనెను :- "దాశరాజా! నీవు, నీపుత్రికను పూజ్యుఁడగు నాతండ్రికొఱకు సంగుము."

ఇది విని చేతులను జోడించుకొని వృద్ధుఁడగు నిషాద రాజిట్లనెను :- "కుమారా! నీకు మేలగుఁగాక! నావంటి దీన హీనుఁడును, నకించనుఁడును, నీచుఁడనగు నాద్వారము కడకు మీరు వచ్చితిరి. ఇది నాసౌభాగ్యము. రాజా! నాపుత్రిక రాణి యగుటకంటె గొప్ప యదృష్టమేమి యుండఁగలదు? రాజర్షి యగు శంతనునివంటి యోగ్యవరుఁడును, భరతవంశమువంటి యుజ్జ్వల కులమును త్రిలోకములయందు నా కన్యక కెచ్చట లభింపఁగలదు. మహారాజు నాపుత్రికను స్వీకరింపఁ బూనుట నాకు పరమ గౌరవవిషయము ఈ పుత్రి రాజర్షియగు నుపరి చరవసువు వీర్యమునఁ జేఁపగర్భమునఁ బుట్టినది. నేనీమెకు పెంపుడుతండ్రిని. అయితే నేనీమెను నాస్వంతపుత్రిక కంటెఁ బ్రేమించెదను. రాజర్షి పుత్రికకు రాజర్షి పతియగుట యదృష్టము. నేను నాపుత్రికయొక్క అభ్యుదయము కొఱకు మిమ్మొక్క పణమును గోరుచున్నాను."

కుమారుఁడగు దేవవ్రతుఁడిట్లనెను:- "నీకేమి కావలెనో, నాకుఁజెప్పుము."

నిషాదరాజిట్లనెను:- "నేనుకోరునది ది. ఈమెగర్భమునఁ బుట్టిన వాఁడు కురుకులసింహాసనమునఁ గూర్చుండవలెను భరతవంశ సింహాసనమాతనికే ప్రాప్తింపవలెను."

ఇదివిని అత్యంతానందమును బ్రకటించుచుఁ గుమారుఁ డిట్లనెను:- "నిషాదరాజా! ఇదెంతటి గొప్పపని? రాజపుత్రుఁ డగుటచే నీదౌహిత్రుఁడు రాజు కాఁగలఁడు"

నిషాదపతి యిట్లనెను:-"మహారాజా! మీయీ మాట సత్యమే. కాని న్యాయానుసారముగ రాజ్యాధికారివి నీవే నినుఁ గాక నా దౌహిత్రుఁడు రాజెట్లు కాఁగలఁడు?"

ఆసమయమునఁ బితృప్రీతిచే దేవవ్రతుని కన్నుల నీరు నిండెను. ఆతఁడత్యంత గద్గదస్వరమున ధీరగంభీర వాక్కులతో నందఱును వినునట్లిట్లనెను.- "నిషాదపతీ! నేనిది మీయందఱ ముందఱఁ బ్రతిజ్ఞాపూర్వకముగఁ జెప్పుచున్నాను. నీపుత్రికకు పుత్రుఁడు కలుగఁగానే నేను నా రాజ్యాధికారమును శాశ్వతముగఁ ద్యాగమొనర్చుచున్నాను. భూమండల రాజ్యమననేల? నాతండ్రియానందముకొఱకు మండుటగ్నిలో దుముకుమన్నను దుమికెదను. అగాధసాగరమందు మునుఁగఁగలను. హాలాహలమును ద్రాగఁగలను. జీవించియుండఁగనే నాచర్మము నొలిచి యీయఁగలను. నేను నాతండ్రి యొక్క సుఖానందముకొఱకు సమస్తమును జేయుటకుసిద్ధముగనున్నాను. నీవిసుమంతైనఁ జింతింపరాదు. భగవతి కృప సత్యవతీగర్భమున నుద్భవించు కుమారుఁడే మాకందఱకును రాజగుఁగాక!"

ఇదివినఁగానే నిషాదపతి హర్షమునకు మేరలేకుండెను. ఆనందకారణమున నాతని రోమరోమము గగుర్పొడిచెను. అయినను దేవవ్రతునివంటి సువర్ణమును గపింపఁజేసి, అది విశుద్ధమని పరీకట మొనర్చుటకై ఆతఁడిట్లనెను:- "రాజకుమారా! ఈవచనములు నీకనురూపముగనే యున్నవి. తండ్రికొఱకింతటి గొప్పత్యాగము నీవంటిధీరుఁడును, గంభీరుఁడును, శూరవీరుఁడును, సత్యప్రతిజ్ఞుఁడును సదాచారియునగు పుత్రుఁడే యొనర్పఁగలఁడు. నామనస్సు నందొకసంశయ ముండనే యున్నది."

ఆశ్చర్యచకితుఁడై కుమారుఁడిట్లనెను:- "అదేది?"

దీనతాస్వరమున నిషాదపతి యిట్లనెను:- "కుమారా! నీవు చెడ్డగాఁదలఁపవలదు. నేను నాపుత్రికమీఁద నుండు ప్రేమచే దీనుఁడనైతిని నీప్రతిజ్ఞనొనర్చి పాలింపవని నేను స్వప్నమందైనఁ దలఁచుటలేదు. అయితే నీవు రాజ్యసింహాసనమునఁ గూర్చుండవు. కాని న్యాయానుకూలమున రాజ్యముమీఁద నధికారము నీకేకలదు. నాదౌహిత్రుని మీరందఱును గలిసి రాజసింహాసనమునఁ గూర్చుండఁబెట్టినను, నీపుత్రులాతనితో బోరాడి సింహాసనమునుండి దింపఁగలరు. నీపుత్రులతో దేవతలైన జయింపఁజాలరు. ఈవిషయమున నాకు సందేహముగ నున్నది."

ఇదివినఁగానే నిషాదపతి హర్షమునకు మేరలేకుండెను. ఆనందకారణమున నాతని రోమ రోమము గగుర్పొడిచెను. అయినను దేవవ్రతునివంటి సువర్ణమును ఒరపింపఁజేసి, అది విశుద్ధమని పరీకట మొనర్చుటకై ఆతఁడిట్లనెను:- "రాజకుమారా! ఈవచనములు నీకనురూపములుగనే యున్నవి. తండ్రికొఱకింతటి గొప్పత్యాగము నీవంటిధీరుఁడును, గంభీరుఁడును, శూరవీరుఁడును, సత్యప్రతిజ్ఞుఁడును సదాచారియునగు పుత్రుఁడే యొనర్పఁగలఁడు. నామనస్సునందొక సంశయ ముండనే యున్నది."

ఆశ్చర్యచకితుఁడై కుమారుఁడిట్లనెను:- "అదేది?"

దీనతాస్వరమున నిషాదపతి యిట్లనెను:- "కుమారా! నీవు చెడ్డగాఁదలఁపవలదు. నేను నాపుత్రికమీఁద నుండు ప్రేమచే దీనుఁడనైతిని నీప్రతిజ్ఞనొనర్చి పాలింపవని నేను స్వప్నమందైనఁ దలఁచుటలేదు. అయితే నీవు రాజ్యసింహాసనమునఁ గూర్చుండవు. కాని న్యాయానుకూలమున రాజ్యముమీఁద నధికారము నీకేకలదు. నాకాహితుని మీరందఱును గలిసి రాజసింహాసనమునఁ గూర్చుండఁబెట్టినను, నీపుత్రులాతనితో బోరాడి సింహాసనమునుండి దింపఁగలరు. నీపుత్రులతో దేవతలైన జయింపఁజాలరు. ఈవిషయమున నాకు సందేహముగ నున్నది."

నిషాదరాజు ముఖమునుండి యింతటి కృపణతాపూర్ణ
మును, కాని దూరదృష్టితోఁగూడుకొనిన వాక్యములను వినఁ
గానే కుమారుఁడగు దేవవ్రతుఁడత్యంత గంభీరుఁడై మేఘ
గంభీరవాక్యములతో నిట్లనెను:- "రాజులారా! విప్రబృందము
లారా! మీరందఱును నాప్రతిజ్ఞను వినుఁడు. పితృప్రీత్యర్థముగ
నేను నేఁడుధర్మమును సాక్షిగానొనర్చుకొని ప్రతిజ్ఞనొనర్చు
చున్నాను. నేను జీవించి యున్నంతవఱకు వివాహమాడను.
అఖండబ్రహ్మచర్యము నవలంబించి నేనాజీవనము నవివాహితుఁ
డుగనేయుందును. ఇఁకఁబిల్లలెట్లు పుట్టఁగలరు? ఇప్పుడింక నిషాద
రాజునకుఁ దనపుత్రికను నా తండ్రికొసంగుటలో నేవిధమగు
నభ్యంతరముండదను కొందును."

సూతుఁడిట్లనెను:- "మునులారా! రాజకుమారుఁడగు
దేవవ్రతుని యీప్రతిజ్ఞను విని అందఱును నాశ్చర్యచకితులై
ఆతనివైపునకుఁ జూచుచుండిరి. దేవతలాకాశమునుండి పుష్ప
వృష్టిని గురిపించిరి. గంధర్వులు వసునవతారమగు దేవవ్రతుని
ప్రశంసించుచు గీతములను బాడిరి. గంగా ప్రవాహమునుండి
ధన్యధన్యశబ్దములు వినవచ్చెను. మునులారా! దీనినే ధర్మ
పూర్వకమగు త్యాగమందురు. కాకున్న నా నిషాదుఁడీతని
రాజ్యమందొక సాధారణ నాగరికుఁడు, అతఁడు వానినదరించి
బెదరించి అనుకూలముగఁ జేసికొనఁగలఁడు. బలవంతముగఁ
గన్యకను హరించుకొని పోఁగలఁడు, కాని అది అధర్మము.

ప్రజల యెడల నన్యాయ మొనర్చినట్లు కాఁగలదు. ధర్మాత్ముడగు శంతనుఁడును, యశస్వియగు నాతని కుమారుఁడు దేవవ్రతుఁడు నిట్టి సదాచార విరుద్ధమును, ధర్మవిరుద్ధమగు కార్యము నేలఁ జేయును? దేవవ్రతుని భీష్మప్రతిజ్ఞను వినఁగానే నిషాదరాజు రోమరోమము పులకరించెను. అత్యంతానందమును బ్రకటించుచు, మాటిమాటికి కుమారునిఁ బ్రశంసించుచు నాతఁ డిట్లనెను:-"రాజకుమారా! నీవుతప్ప యిట్టిభీష్మప్రతిజ్ఞ నొనర్పఁగలవారెవరు? మీ తండ్రికి నాకూఁతురను సంతోషముగనొసంగెదను" ఇట్లు పలికి ఆతఁడు సత్యవతిని వస్త్రాభూషణములతో నలంకరించి అచ్చటికిఁ దీసికొనివచ్చెను.

భీష్మప్రతిజ్ఞుఁడగు దేవవ్రతుఁడు తలవంచి సత్యవతికిఁ బ్రణామము కావించి అత్యంతాదరముతో నిట్లనెను:- "అమ్మా! నీవు రథముమీఁద నెక్కవలెను."

సత్యవతి తండ్రినిఁ గలిసికొని రథముమీఁదఁ గూర్చుండెను భూమండలమంతటను కుమారుని నీత్యాగ విషయము వ్యాపించెను. తండ్రి తనపుత్రుని ప్రతిజ్ఞవిషయమును వినఁగానే ఆతనికి మిక్కిలి లజ్జకలిగెను. ఆతని హృదయము నీరు నీరయ్యెను ఆతని యంతరాత్మ అత్యంత సంతుష్టినిఁ జెందెను. పుత్రునియొక్క యీ భీష్మప్రతిజ్ఞ వలన నాతని కాంతరంగిక దుఃఖముకలిగెను, కాని యిప్పుడు కాఁగలదేమున్నది? సూర్యుఁడు పశ్చిమమున నుదయించిన నుదయించును గాక, సుమేరు తన

స్థానమును దప్పినఁదప్పును గాక, గంగాప్రవాహము సముద్రము నుండి హిమాలయము వైపునకుఁ బ్రవహించినఁ బ్రవహించుఁ గాక, శేషుఁడు భూమిని ధరించుటవదలిన వదలుగాక, కాని దేవ వ్రతుఁడు తనప్రతిజ్ఞనుదప్పఁడు. అందువలన నాతఁడు తన ప్రియపుత్రుని ప్రతిజ్ఞను వదలుమనలేదు. అశ్రుపూర్ణనేత్రము లతో నాతనితలపైఁ జేతులతో నిమురుచు నాతనికిట్టివర మొసం గెను:–"నీవు రణమందెల్లప్పుడునువిజయమును బొందెదవుగాక! నిన్ను దేవతలైన రణమున నెదుర్కొనఁజాలరు. మృత్యువు నీ స్వాధీనముననుండును."

ఈ విధముగ భీష్మునకు వరదాన మొసంగి శంతనుఁడు సత్యవతిని విధ్యుక్తముగ వివాహమొనర్చుకొనెను. వృద్ధావస్థ యందు దేవకన్యతో సమానమగు సుకుమారి పత్నినిఁగాంచి నరపతి పరమానందమునకు మేఱలేకుండెను. రాజకార్యములను భీష్ముఁడే సంభాళించుకొనుచుండెను. ప్రజలును భీష్మునివ్యవహారమునఁబరమ సంతుష్టులైరి. ఇప్పుడు మహారాజు నిరంతరము సత్యవతితోనుండి ఆనందవిహార మొనర్చుచుండెను. సత్యవతీ గర్భము నుండి యిద్దరు పుత్రులుదయించిరి— పెద్దవానిపేరు చిత్రాంగదుఁడు, చిన్నవానిపేరు విచిత్రవీర్యుఁడు. ఈ పిల్లలిద్దరును జిన్నవారుగానుండఁగా శంతనుఁడీయసార సంసారమును శాశ్వతముగ వదలిపోయెను. చిత్రాంగదుఁడు చిన్నవాఁడు కాని విచిత్రవీర్యుఁడింకను సత్యవతి చంకలోనేయుండెను. రాజ

సింహాసనము వట్టిదిగానుండదు. కావున భీష్ముఁడు సత్యవతీ దేవి అనుమతిచేఁ జిత్రాంగదుని రాజుగానొనర్చెను.

ఏమైనఁగానిఁడు, భీష్ముఁడుండఁగా శంతనుఁడు నిషాద కన్యయగు సత్యవతినిఁ బెండ్లాడుట ఉచితమును, నాతనికనురూప ముగనులేదు. అందువలన వృద్ధావస్థయందాతని కనురూపమగు సంతానముకలుగలేదు. భీష్ముఁడు ప్రతిజ్ఞాబద్ధుఁడు. తాను సింహాసనముపైఁగూర్చుండఁడు. చిత్రాంగదుఁడు నామమాత్ర మునకు రాజు. రాజకార్యములన్నిటిని భీష్ముఁడే చేయు చుండెను అయినను జిత్రాంగదుఁడు రాజగుటచేఁ దానే శూర వీరుఁడును, బలియుననుకొనుచుండెను. గంధర్వరాజగు చిత్రాం గదుఁడాతనిపై దండెత్తెను. కురుక్షేత్రమున నిరంతరాను యుద్ధము జరిగెను. భీష్ముఁడీయుద్ధమున లేఁడు. గంధర్వుఁడు చిత్రాంగదుని జంపివైచెను. ఇప్పుడు మరలఁ గురుకుల సింహా సనము ఖాళీగానుండెను"

సూతుఁడిట్లనెను:- "మునులారా! చిత్రాంగదుఁడు చనిపోయినతర్వాత భీష్ముఁడల్పవయస్కుఁడగు విచిత్రవీర్యుని రాజ సింహాసనమునఁ గూర్చుండబెట్టి భీష్ముఁడు తానే రాజ్య మును జూచుచుండెను, కొంతకాలమునకు విచిత్రవీర్యుఁడు పెద్దవాఁడయ్యెను. ఆతఁడు సర్వవిధముల భీష్మునకుఁ దన్నుఁ దాను సమర్పించుకొనెను. ఆతఁడును నట్లే బలవంతుఁడుకాడు ముసలితనమందలి సంతానము. ఆతఁడు సరిగాఁ దండ్రిని జూడ

నైనఁజూడలేదు. అతఁడు భీష్మునే తన తండ్రిగా భావించు కొనుచు నాతని యాజ్ఞననుసరించి వర్తించుచుండెను. భీష్ముఁడా తనిఁ దనపుత్రునివలెఁ భావించుచుండెను. సత్యవతియొక్క యాజ్ఞానుసారముగ నాతఁడు రాజ్యమును జూచుచుండెను. క్రమక్రమముగ విచిత్రవీర్యుఁడు పెద్దవాఁడయ్యెను. బాల్య కాలమును వీడి యిప్పుడాతఁడు యువావస్థలోఁ బదార్పణ మొనరించెను. తన తమ్ముఁడు తరుణుఁడై వివాహయోగ్యుఁడై నాఁడని తెలిసికొని భీష్ముఁడాతని వివాహమునుగూర్చి చింతింప సాగెను. అతఁడు యోగ్యమును ప్రతిష్ఠతమునగు క్షత్రియ కులమందు విచిత్రవీర్యునకు వివాహమును జేయఁదలఁచెను. ఆ సమయముననే ఆతనికిఁ గాశీరాజకన్యకల స్వయంవర సమా చారము తెలిసెను. భీష్ముఁడా స్వయంవరమునుండి కన్యకలను హరించి తెచ్చెను. ఆస్వయంవరమాతని మృత్యువునకుఁ గారణ మయ్యెను.''

ఇదివిని శౌనకుఁడిట్లనెను:_"సూతా! భీష్ముఁడేవిధముగఁ గాశీరాజుకన్యలను హరించి తెచ్చెను. వారి కారణమున నాతనికి మృత్యువెట్లుకలిగెను? దయతో నీప్రసంగమును నీవు మాకుఁ జెప్పవలయును. బాల బ్రహ్మచారియగు భీష్ముని చరిత్రమును వినవలయునని కుతూహలముగనున్నది ''

ఇదివిని సూతుఁడిట్లనెను:_"సరియే. స్వామీ! నేనిప్పుడు మీకు భీష్ముని తరువాతచరిత్రమును జెప్పెదను. మీరు దీనిని సమాహిత చిత్తులరై శ్రవణమొనర్పవలయును.''

—(o)—

# విచిత్రవీర్యుని వివాహము
(౨౦౭)

శ్లో॥ విచిత్రవీర్యో ఉథోవాహ కాశీరాజ సుతే బలాత్।
స్వయంవరాదుపానీతే అంబికాంబాలికే ఉభే॥
తయోరాసక్త హృదయో గృహీతో యక్ష్మణామృతః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౨ అ. ౨౪ శ్లో.

వ. ఆవిచిత్రవీర్యునికిఁ గాశీరాజు కూఁతుల నంబికాం బాలికల భీష్ముండు బలాత్కారంబునఁ దెచ్చివివాహంబు సేసిన, విచిత్రవీర్యుండు వారలం దగిలి మనోజరాగమత్తుండై చిరకాలంబు నానావిధక్రీడల విహరించుచు రాజయక్ష్మ పీడితుండై మృతుండయ్యె.

శ్రీమదాంధ్ర భాగవతము.

తమకు విద్వాంసుఁడును, యశస్వియుఁ దపస్వియునగు బతి లభింపవలయునని బ్రాహ్మణ బాలికలు కోరుకొందురు. వైశ్యకన్యకలు తమపతి శ్రీసంపన్నుఁడును వైభవశాలియు గావలెననుకొందురు. శూద్రకన్యకలు తమకు సేవాపరాయణుఁడును, సంయమియు, ధర్మాత్ముఁడునగు బతి కావలయుననియు, క్షత్రియకన్యల కొకేకోరిక తమకు శూరవీరుఁడును, బలవంతుఁడునగు బతిలభింపవలయుననియే యుండును కుమా

రికలందఱును సుందరుఁడును, సురూపవంతుఁడును, స్వస్థుఁడును, యువకుఁడునగు పతి ప్రాప్తింపవలెనను కొందురు. కావున రాజులలో నొకప్రాచీనమగు నాచారముకలదు. కులీనులును, ప్రతిష్ఠితులగు రాజకుమారులందఱును నొకానొక నియమిత తిథికొకచోటకు సత్కార పూర్వకముగఁ బిలువఁబడుదురు. వారందఱును వస్త్రాభూషణాదులచే నువజ్జితులై కన్యకయొక్క తండ్రినగరమునకు వచ్చెదరు. అచ్చటనొక సభ నేర్పఱువఁబడి అచ్చటికి వివాహయోగ్యమగు కన్యకపిలిపింపఁబడును. రాజులందఱి కులగోత్రములామెకుఁ జెప్పఁబడును వారిలో నెవని నైనవరింపుమని కన్యకకు స్వాతంత్ర్య మీయఁబడును. అంతఁ గన్యక యొక్కొక్కని కడకుఁబోయి. ఆతని కులగోత్రములను గుఱించివిని, ఆతని బలప్రశంసను వినును స్వయముగ నాతని రూపమును గాంచును. ఆ వచ్చిన రాజకుమారులలో నొకని మెడయందు విజయమాలను వేయును. అప్పటినుండి ఆమె ఆతని భార్యగా నెన్నఁబడును. అనఁగా సంబంధనిశ్చయమగును. అంత శాస్త్రీయవిధిచే నిద్దరకును వివాహముజరుగును. ఒక్కొక్కప్పుడు రాజకుమారులలో నొకఁడు బలవంతముగ కన్యకను హరించుకొని వచ్చును. ఇదియును శాస్త్రీయవిధిచే రాక్షస వివాహము. క్షత్రియులందు గాంధర్వ రాక్షసవివాహములు ప్రశంసింపఁబడినది క్షత్రియులలోఁ గన్యాహరణము శూర వీరుఁడును, బలియు, సాహసియునగు రాజేచేయును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! కన్యావస్థయందే కానీనకు వ్యాసుఁడు పుట్టి, శ్రీమద్భాగవత సంహితను రచించి, నాగురు దేవుఁడును, దనపుత్రుఁడునగు శుకునకొసంగెనో, అట్టి కైవర్త కన్యయగు సత్యవతివలననే చిత్రాంగద. విచిత్రవీర్యులను నిద్దరుపుత్రులుదయించిరి గంధర్వరాజగు జిత్రాంగదుఁడీ చిత్రాంగదుని యుద్ధములోఁ జంపఁగా, విచిత్రవీర్యుఁడు రాజుగాఁజేయఁబడెను. అతఁడు వివాహయోగ్యుఁడైనాఁడు కాని వివాహముకాలేదు. సత్యవతి రాజర్షియగు నుప రిచరవసు వీర్యమున మత్స్యగర్భమున నుద్భవించినది ఈవిష యమును జ్ఞానులగు మునులే యోగబలమున దెలిసికొనఁ గలరు. సర్వసాధారణముగ నామె కైవర్త కన్యయనియే యెఱుఁగుదురు అందువలనఁ గులీనులగు రాజులు విచిత్రవీర్యునకుఁ దమ కన్యకల నీయసందేహించుచుండిరి. కాని భీష్ముని వంటి శూరవీరుఁడు రక్షకుఁడైనప్పుడెవరేమి చేయఁగలరు? విచిత్రవీర్యుని వివాహమెచ్చటఁ జేయవలయునని భీష్ముఁడు విచారించుచుండెను. ఆసమయముననే కాశీరాజునకు వివాహ యోగ్యులగు కన్యకలు ముగ్గురుండిరనియు, వారప్సరసల వలె రూపవతులనియుఁ బరమగుణవతులును, మనోరమలనియు వినెను. దేవవ్రతుఁడగు భీష్ముఁడొంటరిగా రథముపైనెక్కి హస్తినాపురమునుండి కాశీకిపోయెను వన, పర్వత, నదీనద ములను దాటి అతఁడల్పకాలముననే కాశీకి చేరుకొనెను. ఆతఁడచ్చట స్వయంవరముయొక్క గొప్ప యేర్పాటులను

గాంచెను. దేశ విదేశములనుండి చాలమంది రాజులును, రాజకుమారులును గన్యకలను బొందుటకై కూడిరి. కన్యకలు తమనే వరింపగలరనునాశ అందఱకుండెను. అందఱువస్త్రభూషణములచే సజ్జితులైయుండిరి. అందరకిరీటములందు మణులు ప్రకాశించుచుండెను. అందఱకును సుందర సింహాసనములు వేయఁబడెను కాశీరాజు గాంగేయునిరాక వినఁగానే ఆతని కందరకంటె స్వాగత సత్కారము లెక్కుడుగఁ గావించెను. స్వయంవరసభయందు భీష్మునకును సింహాసనము వేయఁబడెను

నియత సమయమునకు రాజులును, రాజకుమారులును దమ తమయాసనములందు వారివారి అలంకారములతోఁ గూర్చుండిరి. అందఱమధ్య భీష్ముఁడును గూర్చుండుటను గాంచి గుసగుసలాడుకొనుచుండిరి. ఒకఁడిట్లనెను:_ "ఈ వృద్ధుఁడు స్వయంవరసభకువచ్చి యేలఁగూర్చుండి నాఁడు? ఈతనికిని నీవృద్ధాప్యమునఁ బెండ్లాడ నిచ్ఛకలిగినదా యేమి?" ఇంకొకఁడిట్లనెను:_ "భీష్ముఁడు చాలబ్రహ్మచారియని లోకమునకంతకును దెలియును. ఈతఁడు తండ్రిని సంతోషపెట్టుటకై ఆజీవనము అవివాహితుఁడుగనే యుండుటకు భీష్మప్రతిజ్ఞ నొనర్చినాఁడు."

ఇంకొకఁడిట్లనెను:_ "ఎప్పటికేదో అప్పటికది. మానవులబుద్ధి యెప్పుడు నొక్కతీరుగ నుండదు. తల పక్వమైనను, మనస్సుపక్వముకానిది వానిని యువకుఁడనియే తెలియవలెను."

మఱియొకఁడిట్లనెను:—"ఓయీ, భూమి తలక్రిందులైనను భీష్ముఁడు తన ప్రతిజ్ఞను వీడఁడు" అంత నింకొకఁడిట్లనెను:—"ఓయీ! ఈరూప ప్రలోభనమతి కఠినమైనది. దీనినుండి బయట పడుటకు గొప్పగొప్ప యోగులకును సాధ్యముకాలేదు."

ఇట్లందఱును వివిధరీతుల ననుకొనునంతలో షోడశ శృంగారములొనర్చుకొని వస్త్రభూషణములచే సుసజ్జితలై ముగ్గురు రాజకుమారికలును స్వయంవరసభకు వచ్చిరి. వారు రాఁగానే సర్వత్ర శాంతి ప్రబలెను. అందఱి దృష్టులటు మఱలెను. వారి ముఖమండలముల కాంతిచేతను, ఆభూషణములలోఁ గూర్పఁబడిన మణిమాణిక్యముల కాంతిచేతను మూఁడు సౌదామినులొక్కసారిగఁ బ్రకాశించునట్లుండెను వారుముగ్గురును మరాళినులవలె నూపుర శబ్దమొనర్చుచు, నలనగతిచే మందమందముగ వచ్చుచుండిరి చాలమంది సఖులు వారి ననుగమించుచుండిరి అందఱకంటెఁ బెద్దదగు నంబ ముందుండెను. ఆమెకుఁ బదునేడేండ్లుండును. యౌవన చిహ్నములన్నియు నామె శరీరమందు పరిస్ఫుటితములయ్యెను. ఆమెకంటెఁజిన్నది అంబిక మధ్యలోనుండెను. ఆమె అంబకంటెఁ జిన్నది అంబాలిక కంటెఁ బెద్దది. కమలములవలె విస్ఫారిత నేత్రములతో నామె లజ్జాసహిత కుటిలకటాక్షములచేఁ గుమారులను జూచుచుండెను. అందఱికంటెఁజిన్నదగు నంబాలిక అందఱికంటె వెనుకనుండెను. ఆమెకు బదునైదువర్షములుండ

వచ్చును ముగ్గురు తోఁబుట్టువులే. రూప, గుణాకృతులందొక్కతీరుననేయుండిరి. అకాత్తుగా నపరిచితవ్యక్తి ఒకటి రెండు సార్లు చూచినవీరిలో నంబయెవరో అంబికయెవరో అంబాలికయెవరో గుర్తింపఁజాలరు.

కుమారికలు రాఁగానే సూతమాగధులు వారికినమస్త రాజులయొక్కయు రాజకుమారులయొక్కయు బరిచయమును గావించెను. కుమారిక లేయే రాజకుమారుల కడకుఁ బోయెదరో వారికి మరల పరిచయమొనర్పఁబడును. ఈనియమానుసారముగఁ గన్యకలు దేవవ్రతుఁడగు భీష్మునికడకుబోఁగానే అతని పరిచయమును జేయఁబడెను. కన్యకలచ్చటనే సిగ్గుతో క్షీణస్వరమున 'వృద్ధునిస్వేచ్ఛగా నెవరువరింతు' రనిరి.

ఇది వినఁగానే రాజులు, రాజకుమారులందఱును బకపకనవ్విరి వారందఱును నవ్వుటనుగాంచఁగనే వీరాభిమానియగు భీష్మునకుఁ గోపమువచ్చెను. అతఁడు రాజులనందఱను సంబోధించుచు నిట్లనెను:— "రాజులారా! రాజపుత్రులారా! నేను జెప్పునది మీరందఱును వినుఁడు. అష్టవిధ వివాహములలో రాక్షసవివాహమును నొకటి కలదు దానిలో సర్వశ్రేష్ఠుఁడగు బలవంతుఁడు కన్యకను బలపూర్వకముగఁ దన వీరత్వమునే శుల్కముగ నొసంగి, కన్యకకిష్టమున్నను లేకున్నను హరించుకొని పోవచ్చును. వేలకొలఁది మందిమీఁద విజయమునుబొంది, ఆక్రందించుచున్న కన్యకను హరించుకొని

పోవుట క్షత్రియులకు గౌరవవిషయము. నేనుబ్రదికియున్నంత వఱకు వివాహమాడనని ప్రతిజ్ఞఁగొంటినని మీకు తెలిసిన విషయమే. కావున నేనీకన్యలను నాతమ్ముఁడగు విచిత్రవీర్యుని కొఱకు హరించుకొని పోయెదను. ఎవనికి భుజబలముకలదో, వీరాభిమాని నను కొనుచున్నాఁడో అతఁడు నాతో యుద్ధమొనర్చి కన్యకలను విడిపించుకొన వచ్చును.” ఇట్లుపలికి భీష్ముఁడు సమ్ముఖమున నిలుచుండిన ముగ్గురు కన్యకలను గట్టిగాఁ బట్టుకొని, యెదుట సిద్ధముగనున్న దన రథముపైఁ గూర్చుండఁబెట్టుకొని స్వయముగ ధనుర్బాణములను ధరించి సారథితో రథమును బోనిమ్మనెను.

భీష్ముని యీ సాహసమును గాంచి రాజులును రాజకుమారులును నాశ్చర్యమును జెందిరి. ఇది వారికి ఘోరావమానముగఁ దోఁచెను వారు లెక్కకు వేలమందిగ నుండిరి. అందఱును నొక్కటిగఁగలిసి భీష్మునిపైఁ బ్రహారము గావించిరి తేజః ప్రకాశమందు వర్షకాలమున నలువైపులనుండి పతంగములు వచ్చిపడినట్లు భీష్మునిమీఁద నసంఖ్యాకులగు నరపతులొక్కసారిగా విరుచుకొని పడిరి. భీష్ముఁడు వారిప్రహారముచే నొంచెమైన విచలితుఁడు కాలేదు. అతఁడు తన దివ్యాస్త్రప్రభావముచే నందఱను నొక్కసారిగా మూర్ఛితులనొనర్చెను అందరును సమరాంగణమందు బాణములచే క్షత విక్షతులై తెగఁగొట్టఁబడిన వృక్షములవలెఁ బడిపోయిరి కొందఱు రాజులు

యుద్ధమునువీడి పారిపోయిరి; కొందఱుతిరిగిపోయిరి. కొందఱు వేదనచే భూమిపై బడి పొరలాడుచుండిరి ఈవిధముగ రాజు లందఱును తిరిగిపోయిరి. కాని శాల్వుఁడు భీష్మునిఁ దఱమెను ఆతఁడు గొప్పబలవంతుఁడు. ఆతనికిఁదాను శూరవీరుఁడనను గర్వముకలదు ఆతఁడు భీష్మునితోఁజాలసేపటివఱకు యుద్ధ మొనర్చెను. చివరకాతఁడును బరాజితుఁడయ్యెను. దేవవ్ర తుఁడాతనిఁ జంపక వదలివైచెను. శాల్వుఁడు తన రాజధాని కిఁబోయి స్వయంవర విషయములను మఱచి ధర్మపూర్వక ముగఁ బ్రజాపాలన మొనరించుచుండెను. మిగిలిన రాజులును నచ్చటినుండి వచ్చిరో అచ్చటికిఁ దమదేశములకుఁబోయిరి.

శంతను కుమారుఁడగు భీష్ముఁడు ముగ్గురు సుందర కన్యకలను వెంటఁబెట్టుకొని హస్తినాపురమునకు వచ్చెను, మార్గమందాతఁడు పుత్రికలవలెను, కోడండ్రవలెను జూచు కొనెను. చాలదినములకాతఁడు కాశీనుండి హస్తినాపురము నకువచ్చెను. దేవవ్రతుఁడగు భీష్ముఁడు కాశీరాజుయొక్క ముగ్గురు కన్యకలను బలపూర్వకముగ యుద్ధమున జయించి తెచ్చెనని నగరవాసులందఱును విని విజయుఁడగు భీష్మునకు జాలవైభవముగ స్వాగత సత్కారము లొనర్చిరి. అందఱ యెడలను కృతజ్ఞతను బ్రకటించుచు భీష్ముఁడు కైవర్తకన్యక యును దన సవతితల్లియునగు సత్యవతీ భవనమునకుఁ జేరెను. అచ్చట నాతఁడా ముగురు కన్యకలను సత్యవతీ సమ్ముఖమైన

నిలువఁబెట్టి ప్రణామము కావించి యిట్లనెను:- "అమ్మా! నేను నీకొఱకు ఏరాణీ యీముగ్గురు కోడండ్రను దెచ్చితిని. వీరి కొఱకై నేను వేలకొలఁది రాజులతో యుద్ధమొనర్ప వలసి వచ్చినది. కాని నీయాశీర్వాద బలముచే నాశరీరమున నొక్క గాయమైనను దగులలేదు ఇప్పుడునీవువీరిని నీపుత్రునకిచ్చి వివాహ మొనరించుకొనుము"

భీష్ముని యీమాటలను వినఁగానే సత్యవతీ నేత్రముల నుండి ప్రేమాశ్రువులు ప్రవహించెను. ఆమె భీష్ముని శిర స్సును మూర్కొని ప్రేమభరిత వాక్కులతో నిట్లనెను:- "ఆయుష్మంతా! నీవు తప్ప యిట్టిసాహసమెవఁ డొనర్పగలఁడు? నీకు మేలుకలుగుఁగాక! నీవు నేఁడు నాకత్యంత ప్రియకార్య మొనర్చితివి దేవకన్యలవలెనున్న యీపిల్లలను నాకు కోడం డ్రరూపమున నుంచుటనుగాంచి నేను నావరమసౌభాగ్యముగ భావించుచున్నాను. నీవు విద్యుక్తముగ నీముగ్గురిని విచిత్ర వీర్యునికిచ్చి వివాహమొనర్పుము"

అంత దేవవ్రతుఁడగు భీష్ముఁడు వివాహప్రయత్నము లొనర్పసాగెను. అప్పుడు వారిలోఁబెద్దపిల్ల అంబ చేతులు జోడించుకొని సిగ్గుతో భీష్మునితో నిట్లనెను:- "దేవా! మీరు ధర్మాత్ములరు. స్వప్నమందైనను మీరు ధర్మవిరుద్ధమగు కార్యము నొనర్పరు. నేను మనస్సులో శాల్వుని నాపతిగా వరించితిని నాతండ్రియును నాయీసంకల్పము ననుమోదిం

చెను. నేను స్వయంవరమునకుఁబోయి శాల్వునివరింతుననియు నాతని కంఠమున జయమాలను వేయఁగలననియు నందఱె ఱుంగుదురు, కాని నేనింక నాతని యెదుటకుఁ బోకమును పే మీరునన్ను బలవంతముగ హరించుకొని వచ్చితిరి. మనస్సున నేనాతని నాపతిగా భావించితిని. కావున మీరు కృపతో నన్నాతని సమీపమునకుఁ బంపుఁడు.''

అంబయొక్క యీమాటలను విని దేవవ్రతుఁడగు భీష్ముఁడీ విషయముపై విచారించెను. అతఁడిట్లనుకొనెను:- "సమర్థురాలును యువతియగు కన్య మనస్సున నొక యోగ్యుఁ డగు వరునకాత్మసమర్పణ మొనర్చినచో నామెను వివశనొన ర్చుటఉచితము కాదు. శరీర మొకచోటునను, మనస్సొకచోటు నను నుండిన నా దాంపత్యమున సుఖముండదు. నాతమ్మునకిద్దరుభార్యలు చాలును.'' అనియిట్లనుకొని అతఁడిట్లనెను:- "రాజకుమారీ! నీకట్టికోరిక యున్నచో నేను శాల్వుని కడకుఁ బంపెదను.''

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఇట్లుపలికి ధరా, త్ముఁడగు భీష్ముఁడు మిక్కిలి ఆదరసత్కార పూర్వకముగ నంబను రథముమీఁదఁగూర్చుండబెట్టి మిక్కిలి విశ్వసనీయు లగు వృద్ధబ్రాహ్మణులతో శాల్వుని సమీపమునకుఁ బంపెను. చివరకీయంబయే దేవవ్రతుని ప్రాణములను దీయఁబూను కొనెను. ఈమెకారణమున స్వేచ్ఛామృత్యువుగల భీష్మునకు

మృత్యువు సంభవించెను. ఈమె వలననే యాతఁడు తన గురు వగు పరశురామునితో యుద్ధమొనర్ప వలసివచ్చెను."

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! భీష్ముఁడంబ యొక్క యిష్టానుసారముగనే ఆమెను శాల్వుని సమీపము నకుఁ బంపినాఁడుకదా, అట్టియెడ నామె నీతని ప్రాణములను దీయ నేలఁబూనుకొనినది? కృపతో నీవృత్తాంతము నవశ్యము మాకు వినిపింపవలెను. విశ్వవిజయుఁడగు పరశురామునితో భీష్ముఁడెట్లు యుద్ధమొనర్చినాఁడు? దీనిని వినుటకు మాకుజాల కుతూహలముగనున్నది."

సూతుఁడిట్లనెను:- "మంచిది స్వామీ! నేనిప్పుడు మీకు పరశురామ భీష్ముల యుద్ధవృత్తాంతమును జెప్పెదను"



# అంబకొఱకై భీష్మ పరశురాములయుద్ధము

(౭౮౮)

శ్లో॥ సర్వధర్మవిదాం శ్రేష్ఠో మహాభాగవతః కవిః।
వీరయూథాగ్రణీర్యేన రామోఽపి యుధితోషితః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౨ అ. ౨౦ శ్లో॥

ఆ॥ పరశురాముతోడఁ బ్రతిఘటించి జయింప
నన్యులోకనిఁ గాన మతనిఁదక్క;
వీరయూథపతి వివేకధర్మజ్ఞుండు
దివిజనది సుతుండు దేవసముఁడు.

శ్రీమదాంధ్ర భాగవతము

అనంతజన్మ వాసనలే జీవుని సంసార చక్రమందు ద్రిప్పును. మన మొనర్చు శుభాశుభ కర్మలన్నియును సంచితము లగును. ఆసంచిత కర్మలలోనుండి, ఒకజన్మభోగమున శరీరమేర్పడును దానినిఁ బ్రారబ్ధమందురు. ఈజన్మలో ననుభవింపవలసిన ప్రారబ్ధము భోగించినగాని నాశముకాదు. మన మేవాసనతో మరణించెదమో అట్టి జన్మమే కలుగుచుండును. ప్రారబ్ధకర్మ మెవరినిఁ గట్టుతో బాధి కార్యము లొనరింపదు. ప్రారబ్ధమెట్లనుభవింప వలసియున్నదో అట్టి సంభవమే సంభవించుచుండును. దరిద్రునింటఁ బుట్టినను గొందఱు రాజులగుచుందురు. చాలమంది రాజులింటఁ బుట్టినను బ్రారబ్ధానుసార

ముగ భిక్ష మెత్తుకొందురు. నిర్ధనుఁడగు దరిద్రుఁ కూఁతురు రాణియగుచుండును. రాజకుమారి వనవనములందుఁ దిరుగు చుండును. మన మేకోరికలను గోరినను నవియన్నియును దప్పక నెఱవేరును. కాని యెప్పుడు నెఱవేరునో చెప్పఁజాలము. చాల భోగములు స్వప్నములందు భోగించుటచే క్షయించును. చాలమనోరథములద్వారా భోగింపఁబడును. చాలభోగముల కొఱకు జన్మింపవలసివచ్చును. అత్యుత్కృటములగు పుణ్య పాపముల ఫలమిచ్చుటనే సాధారణముగ ననుభవింపవలసి వచ్చును. ఈ ప్రాణి భావమయుఁడు. ఎవఁడెట్టి భావమొనర్చునో వానికట్లే కనఁబడును. సుఖదుఃఖములొసంగున దెవరో ఒకవ్యక్తి కాదు సుఖదుఃఖములన్నియును ప్రారబ్ధముచేఁ బ్రాప్తించుచుండును. పురుషప్రయత్నముచే నాగామికొఱకు సంస్కారము లేర్పడవచ్చును. ప్రారబ్ధమును దుడుపఁబడఁజాలదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! అంబయొక్క కోరిక ననుసరించి భీష్ముఁడామెను శాల్వునికడకంపెను శాల్వుని సమీపమునకుఁ బోయి అంబ లజ్జించుచు మెల్ల మెల్లఁగా మధుర వాక్కులతో నిట్లనెను:- "నరనాథా! నేను నిన్ను శరణుఁజొచ్చి వచ్చితిని"

శాల్వుఁడిట్లనెను:- "నీవెవరు? నావలన నీకుఁగావలసినదేమున్నది?"

అంబ యిట్లనెను:- "రాజా! నేను కాశీరాజుయొక్క జ్యేష్ఠ పుత్రికను. నన్నంబ యందురు. స్వయంవరమునకు ముందే పూజ్యుఁడగు నాతండ్రి నీవు శాల్వమహారాజును వరింపవలయునని చెప్పియుండెను. నేనును నీయొక్క బలపరాక్రమ ప్రశంసలను గూర్చి చిరకాలమునుండి వినియుంటిని. నీదర్శనము చేసిన తరువాత నేను నాసర్వస్వమును నీచరణముల కర్పించుకొంటిని. నేను మనస్సులో నిన్నే పతిగా వరించితిని. కావున నిప్పుడు నన్ను స్వీకరింపుఁడు."

శాల్వుఁడాశ్చర్యమును బ్రకటించుచు నిట్లనెను:-"నీవు కాశీరాజు పుత్రికయగు నంబవా? నేనును నిన్నుమనస్సున వరించితిని. అందువలన నేను ప్రాణమును బలముగఁబెట్టి భీష్మునితో యుద్ధమొనర్చితిని నిన్నుశంతను సుతుఁడగు గాంగేయుఁడు బలపూర్వకముగ హరించుకొని పోయినాఁడు. అట్టియెడ నీవునాసమీపమున కెట్లువచ్చితివి?"

అంబయిట్లనెను:- "దేవా! నన్నుభీష్ముఁడు హరించుకొని పోయినమాటనిజమే. ఆతఁడు బాలబ్రహ్మచారి. అందువలన నాతఁడుమార్గమున మమ్ముఁబుత్రికలవలెఁ గొంపోయెను. పురమునకుఁగొనిపోయి ఆతఁడు తనతమ్మునకిచ్చి మామ్ముగ్గురకు వివాహమును జేయఁబోఁగా, నేనుచేతులను జోడించుకొని ఆతనితో నిట్లంటిని:-"నేను నామనస్సును, శరీరమును, సర్వస్వమును మహారాజగు శాల్వునకర్పించుకొంటిని. నన్ను వారికడకు బంపుఁడు."

అధర్మాత్ముఁడు నాప్రార్థన నంగీకరించి నన్ను మిక్కిలి ఆదరముతో చాలమంది వృద్ధబ్రాహ్మణులతో నిచ్చటికిఁ బంపినాఁడు. ఇప్పుడు నన్ను మీరు స్వీకరించి మీకు ప్రియ పత్నిగా నొనర్చుకొనుఁడు."

అంత శాల్వుఁడిట్లనెను:- "భద్రా! నేను క్షత్రియుఁడను. ఇతరుల వస్తువును నేను గ్రహింపను."

అంబయిట్లనెను:- "దేవా! నేనితరుల వస్తువునుగాను మీవస్తువునే. నామనస్సెల్లప్పుడును మీచరణములందే లగ్నమైయున్నది"

శాల్వుఁడిట్లనెను:- "దేవి! ఈవిషయము నాకీర్తికిని, కులగోత్ర గౌరవములకు సర్వథా ప్రతికూలమైనది. రాజులందరను జయించి భీష్ముఁడు నిన్నుఁ దెచ్చినాఁడు. ఇప్పుడు నిన్ను సచ్చరిత్రుఁడును గౌరవశాలియునగు రాజెవ్వఁడును నిన్ను బత్నిగా గ్రహింపఁడు."

అంబయిట్లనెను:- "నరనాథా! నేను సర్వథా దోషరహితను భీష్ముఁడు నాయిచ్ఛకు విరుద్ధముగ బలవంతముగ నన్నుహరించుకొని పోయినాఁడు. నేను మనస్సులో సదా మీ చింతనమునే చేయుచుంటిని ప్రార్థించుచు, దుఃఖితయుఁ గామపీడితయునగు కాంతను నిరాశతోఁ బంపినచో గోవధ సదృశమగు పాపముంటఁగలదు."

శాల్వుఁడు దృఢతాస్వరమున నిట్లనెను:- "సుందరీ! నీవొక్కసారిచెప్పుము. లక్షసార్లుచెప్పుము. నేను నిన్నే స్థితిలోను స్వీకరింపను నా యాశను నీవువదలుకొనుము. నీ యిష్టమున్న చోటునకుఁబొమ్ము."

సూతుఁడిట్లనెను:-"మునులారా! ఎంతఅనునయ వినయము లొనర్చినను శాల్వుఁడంబను గ్రహించుట కంగీకరింపలేదు అప్పుడా రాజకుమారికి మిక్కిలి నిరాశకలిగెను. ఆమె యిట్లనుకొనెను:- "ఇప్పుడుమరల నేను భీష్ముని కడకే ముఖమును బెట్టుకొనిపోఁగలను? వెళ్ళినను నన్నాతఁడు తన దగ్గఱనుండ నీయఁడు. ఇప్పుడు పుట్టినింటికిఁ బోఁజాలను. ఇప్పుడు నేనాత్మహత్య నొనర్చుకొనవలయును." అనుకొని ఆమె ఒంటరిగా ఘోరవనమునకుఁ బోయెను.

కాశీరాజయొక్క ప్రియకుమారి వెళ్ళి వెళ్ళి వనములలో మున్యాశ్రమములకుఁ జేరుకొనెను ఆమె అచ్చటఁ జాలమంది మునులుతపస్సును జేయుటనుగాంచెను. ప్రాణములమీఁద మోహమందఱకు నుండును. అంబ యిట్లనుకొనెను:- "ఆత్మహత్య నొనర్చుకొని యేమిచేయఁగలను? తపస్సును జేసి నేను భీష్ముఁడొనర్చిన యవమానమునకు నేను ప్రతీకారమేలచేయఁగూడదు? నాకిట్టి దుర్దశ భీష్మునిమూలముననే కలిగినది. ఆతఁడు బలపూర్వకముగ నేనుచ్చుచుండిన నన్ను నా

యిచ్ఛకు బ్రతికూలముగఁ దేకుండినచో నేను రాజకుమారి నయ్యు నేఁడు వనవనములను దిరుగనేల? ఇట్లాలోచించు కొనుచు నామె రాత్రి తిండినిఁదినకయే ఒక వృక్షముక్రింద గడిపెను.

మఱునాఁడామె ముని సమూహము కడకుఁ జేరుకొనెను మునిగణమామె యద్భుత రూపలావణ్యమును గాంచి ఆశ్చర్య చకితులైరి. పుష్పపేశలయును నత్యంత సుకుమారియునగు నా రాజకుమారి అనాథవలెఁ దిరుగుటను గాంచి పరోపకార పారా యణులగు నా మునుల మనస్సులోఁ గరుణ నుత్పన్నమయ్యెను అంబ యేడ్చుచుఁ దన కరుణారసభరితమగు కథను వారందఱ కును జెప్పఁగా విని మునులందఱేడ్చిరి మునులాలోచించిరి. ఒకఁడిట్లనెను:- "ఈమెను శాల్వునికడకు బంపవలయును" భీష్మునికడకు బంపవలయునని యింకొకఁడనెను. ఆమె తండ్రి డకే పంపవలయునని మఱియొకఁడనెను.

అంబ యిట్లనెను:- "మునులారా! నేనీమూఁడు స్థాన ములలో నెన్నటికును బోను. మీరు నన్ను సన్న్యాసినిగానొన ర్పుఁడు. నేనిప్పుడు తపస్సును జేయుచుఁ జేయుచు నీశరీరమును భస్మమొనర్చుకొనఁగోరుచున్నాను."

ఆమునులలో సర్వశ్రేష్ఠుఁడగు జ్ఞానియు, శాస్త్రజ్ఞుఁ డగువాఁడిట్లనెను:- "అమ్మా! తపస్సనిన నాటలుగాదు. పైగా నీవుమిక్కిలి సుకుమారివి కుమారి కన్యకవు నీశరీరము తప

స్సునకు యోగ్యమైనది కాదు. నీవిచ్చట నరణ్యమందుండిన నిచ్చటకుఁ జాలమంది రాజులును, రాజకుమారులును వేటకై వచ్చుచుందురు. నీయనుపమ రూపలావణ్యమును గాంచి వారు నాతో వివాహ ప్రస్తావమును గావింపఁగలరు. ఇంక ననేకము లగు విఘ్నములు రాఁగలవు. కావున నన్నిటికంటె గొప్పకార్యము మీతండ్రియింటికి వెళ్లుటే నీకిష్టముండిన నచ్చట భజన మొనర్పుము ఇష్టమైన వివాహ మొనర్చుకొనుము. నీలో నేదోషమును లేదు. గంగాజలమువలె పవిత్రురాలవు."

అంబ యిట్లనెను:- "మునివరా! నేనుజావనైనఁ జచ్చెదనుగాని తండ్రి యింటికిమాత్రముపోను; ఇట్లేతిరుగుచుందును నాకు భీష్మునిపై గోపము వచ్చుచున్నది"

ఆమె ప్రతిహింసాపూర్ణమగు వాక్యములను విని మును లామెకెంతో నచ్చఁజెప్పిరి కాని ఆమెమనస్సునకు సంతోషము కలుగలేదు. ఇంతలోనే సృంజయ వంశీయుఁడగురాజర్షి హోత్రవాహనుఁడచ్చటికి వచ్చెను. ఆవృద్ధ రాజర్షి యొక్క రాకనుగాంచి మునులందఱును నాతనికి స్వాగత సత్కారము లొనర్చి, అర్ఘ్యమునొసంగి, ఆతనినొక సుందరమగు నాసనమునఁ గూర్చుండఁబెట్టెను.

రాజర్షియగు హోత్రవాహనుఁడు సమస్తమునులతో నిట్లనెను:- "మునుగణములారా! నేఁడు మీరింత చింతాగ్ర

స్థులరై యుంటి రేల? ఏ గూఢవిషయమును గూర్చి మీరంద ఱును వాద వివాదము లొనర్చుకొనుచున్నారు? ఈయమా యకపుపిల్ల యెవరు?? ఈమె యేడ్చుచున్న దేల?" అప్పుడు మునులందఱును అంబయొక్క సమాచారము నాద్యంతములు చెప్పిరి. పిదప రాజర్షి యగు హోత్రవాహనుఁడు తన కంపిత హస్తములతో నంబను దన నడిలోఁగూర్చుండ బెట్టుకొని శిరస్సును మూర్కొని యిట్లనెను.- "అమ్మా! నీవు నన్నె ఱుఁగవేమో? నీవు పుట్టుటకుఁ బూర్వమే నేను రాజ్యమును వీడి వనమునకువచ్చితిని. నేను నీతాతను నేను నీయాపత్తుచే మిక్కిలి దుఃఖితుఁడనగుచుంటిని. చెప్పుము, నేనునీకేమి ప్రియ మొనర్పవలయును."

అంబయిట్లనెను:- "తాతగారూ! నాకీదురవస్థ భీష్ముని వలనఁ గలిగినది. కావున నాకు భీష్మునిపైఁ గోపము కలుగు చున్నది"

అంతరాజర్షి హోత్రవాహనుఁడిట్లనెను:- "కాదమ్మా! వ్యర్థముగ నెవ్వరిపైనను గ్రోధముచే జెందరాదు సుఖదుఃఖ ములను గలిగించునది అదృష్టము. నీవు శాల్వుని వివాహ మాడఁదలఁచితివని భీష్మునకు దెలియదుగూడ తెలియదు. అత నికిఁ దెలియఁగనే నిన్ను వెంటనే శాల్వునికడకుఁ బంపినాఁడు"

అంబయిట్లనెను:- "తాతా! ఏమి చెప్పుదును? నేను భీష్మునకుఁ బ్రతీకార మొనర్చువఱకు నాకు శాంతి యుండదు"

ఇదివిని శుష్కహోసమొనర్చి హోత్రవాహనుఁడిట్లనెను "అమ్మా! భీష్మునకుఁ బ్రతీకార మొనర్చుట ఆటలు కాదు. ఆబాలబ్రహ్మచారినిఁ గాలుఁడైననాతనికిష్టములేనిది చంపఁజాలఁడు. అయితే, ఒక వుపాయమున్నది. నీవు భగవానుఁడగు బరశురాముని శరణువేఁడుము. ఆతఁడన్నియును జేయ సమర్థుఁడు. భీష్ముఁడాతనికి శిష్యుఁడు. ఆతఁడు తలఁచుకొనినచో నాతని నాజ్ఞాపించి అంగీకరింపఁజేయఁగలఁడు. ఆతఁడు శాల్వునైన నాజ్ఞాపింపగలఁడు అవసరమైన భీష్మునితోనైన యుద్ధమొనర్పఁగలఁడు. ఆతఁడిప్పుడు మహేంద్ర పర్వతమునఁ దపంబొనరించు చున్నాఁడు"

ఇదివిని అంబ సంతోషించెను. ఆమె పరశురాముని కడకు మహేంద్ర పర్వతముకడకు బోనుద్యుక్తయయ్యెను. సరిగా నాసమయముననే పరశురాముని ప్రియశిష్యుడు అకృతవ్రణుఁడచ్చటికి వచ్చెను. అందఱునామునికి స్వాగతసత్కారములను గావించిరి. పరస్పరము మాటలాడుకొనుటలో రాజర్షియగు హోత్రవాహనుఁడంబయొక్క సమాచారము నంతను నాతనికిఁజెప్పి, ఆతనిని భగవానుఁడగు పరశురాముని గూర్చిఅడిగెను.

మహామునియగు నకృత వ్రణుఁడిట్లనెను:- "రాజా! భగవానుఁడగు పరశురాముఁడిచ్చట సమీపముననే యిప్పుడు తపమొనర్చుచున్నాఁడు. మాటలలో నాతఁడు మిమ్ముఁ దన

ప్రియమిత్రుఁడఁగాఁ జెప్పుచుండును మీరిచ్చటనున్న సంగతి వారికిఁ దెలియును. ఆతఁడు రేపు మిమ్ముఁ గలిసికొనరాఁగలఁడు

ఇది వినఁగానే అంబకును, హోత్రవాహనునకును బర మానందము కలిగెను, ఆరాత్రి యీవిషయములను మాట లాడుకొనుటలోనే గడచెను. ప్రాతఃకాలమున నందఱును సంధ్యాగ్ని హోత్రములను గావించుకొని అగ్నిశాలలోఁ గూర్చుండి యుండఁగా గొప్ప జడలు ధరించినవాఁడగు బరశు రాముఁడు వచ్చుచుండుటను గాంచిరి, ఆతనిఁ గాంచి అందఱును లేచి నిలుచుండిరి. మునిరాఁగానే అందఱును నాతని చరణ ములకుఁ బ్రణామమును గావించి, విధిపూర్వకముగ నాతనిఁ బూజించి, ఆతని నంటెట నున్నతాసనమునఁ గూర్చుండఁబెట్టి సన్మానించిరి. పరశురాముఁడు మునుల పూజలను స్వీకరించి, వారి తపోగ్నిహోత్రి పశుపక్ష్యాది వృక్షముల కుశలము నడి గిరి. అంతనాతఁడు రాజర్షి హోత్రవాహనునితో నాయీ మాటలను మాడలాడ సాగెను. మాటలలో మహారాజగు హోత్రవాహనుఁడు తనదౌహిత్రియగు నంబయొక్క సమా చారమును నాతనికిఁ జెప్పెను. అంబయొక్క వయస్సును. శరీర సుకుమారతను, అమాయుక వైఖరిని గాంచి పరశురామునకు దయకలిగెను. ఆతఁడంబతో నిట్లడిగెను:— "అమ్మా! నీకు నావలనఁ గావలసిన దేమికలదు? భీష్ముఁడు నాశిష్యుఁడే నీవు చెప్పిన భీష్మునిచే నిన్నంగీకరిపఁజేసెదను నీకు కావలయుననిన శాల్వునితో నీకు వివాహము కావించెదను."

అంబయిట్లనెను:-"ప్రభూ! శాల్వుఁడు నన్నుఁ దిరస్కరించినాఁడు. నేనాతని వివాహమాడను. నాకీదుర్దశ భీష్ముని వలన సంభవించినది. నేను భీష్మునకుఁ బ్రతీకార మొనర్ప వలయును."

పరశురాముఁడిట్లనెను:-"అమ్మా! ఇందులో భీష్ముని దోష మేమియును లేదు. ఆతఁడు ధర్మపూర్వకముగనే రాక్షస విధిచే నిన్నపహరించి తెచ్చినాఁడు. నీవు శాల్వునిఁ బ్రేమించితి వని ఆతఁడెఱుఁగఁడు. ఆతనికి నీమనోగతభావము తెలియఁగనే నిన్ను మరల శాల్వుని కడకు బంపివైచినాఁడు. ఇప్పుడు నేను భీష్మునిచే నంగీకరించునట్లొనర్చెదను ఆతఁడు నీవివాహమును దన సోదరునికిచ్చి చేయఁగలఁడు మీరప్పచెల్లెండ్రు ముగ్గురును సుఖపూర్వకముగఁ గలిసి యుండవచ్చును."

అంబయిట్లనెను:- "ఆతఁడు స్వీకరింపక పోయిననో"

పరశురాముఁడు తనమాటమీఁద నిలువఁబడుచు నిట్లనెను:- "ఏల నంగీకరింపఁడు? ఆతఁడు నాశిష్యుఁడు. ఆతఁడు వినకున్నచో నేనువానిని మరలయుద్ధమున నోడించెదను. కాని ముందుగా నేనాతనికి నచ్చఁజెప్పెదను నేనస్త్ర శస్త్రములను బరిత్యజించినను, మరల ధర్మరక్షణముకొఱకు బ్రాహ్మణాజ్ఞచే నేను మరల నస్త్రగ్రహణ మొనరించెదను."

భీష్ముని వంటి ఆత్మాభిమానియును, హాసుఁడును. వీరాగ్రగణ్యుఁడును. పరపురుషునిఁ బ్రేమించు నన్నున్నడును స్వీకరింపఁడు, సరియే, అతనికినిఁ బరశురామునకును యుద్ధము జరుగవలయును. ఇట్లేయాలోచించి ఆమె యిట్లనెను:- "స్వామి! మీ యిష్టము"

తన మాటమీఁద నిలుపఁబడుచు పరశురాముఁడిట్లనెను:- "అవశ్యము, ఆజ్ఞోల్లంఘన మొనర్చిన నేను భీష్ముని యుద్ధమునఁ జంపివైచెదను" ఇట్లుప్రతిజ్ఞనొనర్చి అంబను వెంటఁబెట్టుకొని పరశురాముఁడు హాస్తినాపురమునకుఁ బోయెను. వేలకొలఁది ఋషులును మునులును గుతూహల వశమున నాతని వెంటఁబోయిరి.

ఋషి మునులచేఁ బరివేష్టితుఁడై పరశురాముఁడు కురుక్షేత్రమునకుఁ బోయెను. అచ్చట సరస్వతీనదీ తటమున నందఱును విడిసిరి. పరశురాముఁడు తాను వచ్చిన సమాచారమును దేవవ్రతుఁడగు గాంగేయుని కడకు కబురంపెను. గురువరుఁడగు పరశురాముని శుభాగమనమును విని భీష్ముఁడత్యంతానందమును జెందెను. ఆతఁడు పురోహితులను, మంత్రులను, వృద్ధబ్రాహ్మణులను వెంటనిడుకొని పరశురాముని దర్శించుటకు సరస్వతీ నదీతటమునకు వచ్చెను వచ్చి భీష్ముఁడు పరశురాముని భక్తితోఁబూజించి మధుపర్కార్ఘ్యములనొసంగి, గోవులనర్పించెను. అంతఁబరశురాముఁడు భీష్ముఁని రాజ్య,

కోశ, మంత్రి, అమాత్య, సేవక, ప్రజా, పరివారముల కుశల మడిగెను. తదనంతరము పరశురాముఁడు భీష్మునిట్లడిగెను:- "రాజా! నేనొక విశేష కార్యమున నీకడకువచ్చితిని."

అత్యంతనమ్రతతో భీష్ముఁడిట్లనెను:- "ఆజ్ఞాపింపుఁడు, గురుదేవా!"

పరశురాముఁడాగి యాగి తనయధికారమును బ్రకటింపుచుఁజెప్పుట కారంభించెను:-"నాయనా! ఈయంబ నిర్దోషయనుసంగతి నీవెఱిఁగినదియే. ఈమెయందుచారిత్ర్యక సంబంధమగు దోషమేమియును లేదు. నీవీమెను శాల్వునికడకుఁబంపి మంచిపనియేచేసితివి. శాల్వుఁడీమెను స్వీకరింపలేదు. ఇప్పుడు నీవు నీ తమ్ముఁడగు విచిత్రవీర్యుని కొఱకీమెను మరల స్వీకరింపుము"

భీష్ముఁడిట్లనెను:- "స్వామీ! అట్లుజరుగదు."

పరశురాముఁడు తేజితుఁడై యిట్లనెను:- "ఏలజరుగదు."

భీష్ముఁడిట్లనెను:- "ఏలననఁగా నీమె ప్రేమ పరపురుషునిపై నున్నది"

పరశురాముఁడిట్లనెను:- "నాయనా! ఉండిన నిది వఱకు మానసిక ప్రేమ యుండినది."

భీష్ముఁడిట్లనెను:- స్వామీ! "మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" మానవునకు బంధ మోక్షములకు గారణము మనస్సే ఇట్టి స్త్రీని వివాహమాడుట ఆర్య సంస్కృతికి విరుద్ధము. ఆమె పరపురుషు నాశించినది."

ఇదివిని క్రుద్ధుఁడై సర్పమువలె రోజుచు, బుసలు కొట్టుచుఁ బరశురాముఁడిట్లనెను:- "భీష్మా! నీవు పండిత శ్రేష్ఠుడనుకొనుచున్నావు. ఈపిల్లనపహరించి నీవీమెను స్త్రీధర్మము నుండి భ్రష్టను గావించితివి. కావున నీమెభర్త యీామెను స్వీకరింపఁడు దీనికొక్కటే యుపాయముకలదు, ఈమెను నీ సోదరునికై అంగీకరించుటే. కాకున్న నేను నిన్ను, నీమంత్రులనుగూడ చంపివేయుదును."

అత్యంత నమ్రతతో భీష్ముఁడిట్లనెను:- "గురుదేవా! నేను మీకుఁ బ్రియశిష్యుఁడను. మీరు నన్నేయపరాధమునఁ జంపఁదలఁచినారు? మీరేయాలోచింపుఁడు. ఆమె ఒకసారి స్పష్టముగఁ దాను శాల్వునిఁ బ్రేమించితినని చెప్పఁగా, నే నామె కోరికననుసరించి శాల్వుని సమీపమునకుఁ బంపితిని. అట్టియెడ నేనీమెను స్వీకరించినచో నేను గామవశీభూతుఁడనై యిట్లొనర్చితిననియు, బరశురామునకు భయపడి యిట్టి యనుచితకార్యము నొనర్చితిననియు భావింపఁగలరు స్వామీ! నేను గామ, క్రోధ, లోభ, భయములచే నేయనుచిత కార్యమును నొనర్పఁజాలను."

ఇదివిని పరశురాముఁడింకనధిక క్రోధమును జెందెను. ఆతఁడిట్లనెను:- "నీవు నాశిష్యుఁడవయ్యును నాయాజ్ఞను మన్నించుటలేదు. కావున నీవు వధార్హుఁడవు. నేను నీతో యుద్ధమొనర్చెదను. నీవు సిద్ధముకమ్ము."

ఇదివినఁగానే భీష్మునకు రోషమువచ్చెను. ఆతఁడిట్లనెను:- "మహర్షీ! నేను గాలునితోనైనను యుద్ధమొనర్ప సిద్ధముగనున్నాను. క్షత్రియుఁడెన్నడును యుద్ధమునకు భయపడఁడు. అంబనునేను గ్రహింపను. గ్రహింపను. ఎన్నడును గ్రహింపను — మీరు క్రుద్ధులైనను సరియే యుద్ధమునకు సిద్ధమైనను సరియే. మీరు నాకుగురువులు. ముందుగా నేను మీమీఁదఁ బ్రహారమొనరింపను; కానిమీరు శస్త్రాస్త్రములనుధరించి క్షాత్ర ధర్మానుసారముగ నాతోఁబోరనుద్యుక్తులైనచో నేను వెనుకకుతగ్గను. మీ యెడలను. వేదములయెడలను, బ్రాహ్మణులయెడలను నా హృదయమందాదరము కలదు. అస్త్రశస్త్రములను ధరించియుద్ధమున నెదురొ్కొన్న విప్రుని వధించుట అనుచితముకాదు"

భీష్మునియొక్క యీవీరతాపూర్ణములగు వచనములను విని వీరాభిమానియగుఁ బరశురాముఁడు కిలకిలనవ్వి వ్యంగ్య స్వరమున నిట్లనెను:-"సాధు! సాధు!! మంచియానందింప దగిన విషయము. భీష్మా! నీవు నాకు శిష్యుఁడవై నాతోఁబోరఁగోరు చున్నావా? ఔను, నీవు నీ బంధుబాంధవులతో నంతిమ

సమావేశమును జరుపుకొనిరమ్ము. అస్త్ర శస్త్రములతో సుసజ్జితుఁడవై నీవు కురుక్షేత్రమునకురమ్ము నేనును వచ్చుటకి వచ్చెదను. వీరాభిమానియగు భీష్ముఁడు సమరమందెట్లు పడి పోఁగలఁడో, ఎట్లాతని మృతశరీరమును గంగ, గృధ్రాది, మాంసాశనులగు పక్షులు తినఁగలవో లోకముచూచుఁగాక!"

ఇదివిని భీష్ముఁడు పరశురాముని చరణములకుఁ బ్రణా మముకావించి యిట్లనెను:- "మంచిది, గురుదేవా! మీరును సిద్ధముకండు. నేను మాతల్లికడ ననుమతినిగైకొని వచ్చెదను."

పరశురామునికడ ననుమతినిఁగైకొని ఆతనికిఁ జరణ వందనమాచరించి భీష్ముఁడు హస్తినాపురమునకుఁ బోయెను. పరశురాముఁడు ఋషి మునులను, అంబను వెంటఁబెట్టుకొని సరస్వతీ నదీతటమునువీడి స్యమంతక పంచకక్షేత్ర సమీ పమున రణాంగణమునకుఁబోయి భీష్మునికొఱకై ప్రతీక్షించు చుండెను.

దేవవ్రతుఁడు సమాచారమునంతను దన తల్లియగు సత్యవతికిఁజెప్పెను. మొదటఁదల్లి నిర్ఘాంతపడెను. కాని ధైర్య మునువహించి భీష్మునకు సమరమునకుఁ బోవననుమతించెను. ఆమె భీష్మునకు స్వస్త్యయనము గావించెను. బ్రాహ్మణు లాతని నాశీర్వదించిరి. పురోహితులును, సచివులును నాతని స్నేహాభరిత హృదయముతో వీడ్కొలిపిరి సమస్తప్రజలాతని మంగళమును గాంక్షించిరి.

భీష్ముఁడత్యంత శుభ్రవస్త్రములనుధరించి, శ్వేత పుష్ప మాలలనుధరించి ధనుర్బాణములను గ్రహించి, రథము నెక్కి, పరశురామునితో యుద్ధమొనర్పఁబోయెను. శ్వేతాశ్వములు సకిలించుచు కురుక్షేత్రమునకుఁ బరువిడెను. కురుక్షేత్రము సమీపమునకుఁబోఁగానే ఆతఁడు తన దివ్యశంఖమునూదెను. అందఱును దానిని సమరసూచనగ భావించిరి. ఆకాశమందు దేవతలును, దేవాంగనలును గుంపులు గుంపులుగ విమానముల నిండిపోయిరి. ఋషులును, మహర్షులును నలువైపులను నిలుచుండి భీష్మ పరశురాముల యుద్ధమునుగాంచుట కుత్సహించుచుండిరి.

గాంగేయుఁడగుభీష్ముఁడస్త్రశస్త్రములతో సుసజ్జితుఁడై పరశురామునితో యుద్ధమొనర్ప నుద్యుతుఁడు కాఁగానే పుత్రస్నేహము చేఁగాతరయై గంగ దివ్యరూపమును ధరించి, భీష్ముని కడకుఁవచ్చి యిట్లనెను:- "వత్సా! నీవేమిది యనర్థము నొనర్పుచున్నావేమి? విశ్వవిజయుఁడగు బరశురామునితో యుద్ధమొనర్చుట మంచిదికాదు. నీవు నా కేకైకపుత్రుఁడవు. నాయనా! పరశురాముఁ డిరువదొక్కసారి పృథివియందల్లి సమస్త క్షత్రియులను సంహరించినాఁడు. ఆతనితో యుద్ధమొనర్పకుము."

అంత భీష్ముఁడు వీరతాపూర్ణములగు శబ్దములతో నిట్లనెను:- "అమ్మా! పరశురాముఁడు నన్నుభయపెట్టి నాచే

ననుచితకార్యమును జేయింపఁదలపడినాఁడు. వీరి సంగతియేల? సాక్షాత్తుగ యముఁడువచ్చినను నేనుభయపడి ఆతని సమ్ముఖమున నతమస్తకుఁడను గాఁజాలను. ఇందు నా యపరాధ మేమియునులేదు. పరశురాముఁడు నన్ను యుద్ధమునకుఁ బిలుచుచున్నాఁడు. ఇంక నేనెట్లు వెనుకకుఁదగ్గఁగలను?''

ఇదివిని గంగాదేవి పరశురాముని సమీపమునకుఁబోయి అనునయ వినయములొనర్చి ఆతని నొడఁబఱుపఁ దలఁచెను. అంతఁ బరశురాముఁ డిట్లనెను:- "ఇందు నాదేమియును లేదు. భీష్ముఁడే అభిమానమునకు వశీభూతుఁడై హఠమొనర్చుచున్నాఁడు. ఆతఁడు నామాటనంగీకరించిన సరియే."

గంగాదేవి ఇదివిని మరల భీష్మునిసమీపమునకు వచ్చి యిట్లనెను:-"వత్సా! నీవు నీగురువుమాటను వినుము."

భీష్ముఁడిట్లనెను:- "అమ్మా! నీవీ విషయమున నేమియును జెప్పవలదు నేను యుద్ధ పరాఙ్ముఖుఁడనుగాను భయ కారణమున నెన్నఁడును నా ప్రతిజ్ఞకు విరుద్ధమగు కార్యములనొనర్పను."

ఇద్దరిలో నెవ్వరును దనమాట వినకుండుటనుగాంచి, ఆమె భీష్మునకు మంగళము కలుగుగాకయని అంతర్ధానమయ్యెను. ఇప్పుడిరుపక్షముల యుద్ధ ప్రయత్నము జరుగుచుండెను. భీష్ముఁడు దివ్యరథముపైఁ గూర్చుండెను ఆతని

చతురసారథి ఆతనిరథమును నడుపుచుండెను. పరశురాముని రథమును నలౌకికమైనది. ఆతనిరథమును, మహాబుద్ధిమంతుఁడును, పరమతపశ్వియును, దన శిష్యుఁడునగు అకృతవృణుఁడు నడుపుచుండెను. జటా జూటమును బంధించుకొని పరశురాముఁడు మూర్తీభవించిన వీరరసమువలెఁగనఁబడుచుండెను. ఆతఁడు మునుముందుగా భీష్మునకు గుఱిపెట్టి మూఁడు బాణములను గొట్టెను. వెంటనే భీష్ముఁడు తన రథమునునిలిపి రథమునుండి దుమికెను. ఋషులును, మునులును, దేవతలును, ఇతరులును దేవవ్రతుని యీవ్యవహారమునఁ బరమచకితులైరి. భీష్ముఁడు ధనుర్బాణములను రథమందుంచెను. ఆతఁడు పాదచారియై పరశురాముని సమీపమునకుఁబోయి, ఆతనిచరణములకుఁబ్రణామముకావించి, ఆతనిని విధ్యుక్తముగఁబూజించెను. అంతఁజేతులను జోడించుకొని యిట్లనెనుః— "గురుదేవా! నేను మీవలననే బాణవిద్యను నేర్చితిని. యుద్ధముచేయుటకు మీరు నాకాజ్ఞ నొసంగుఁడు. నాకు విజయము కలుగునట్లాశీర్వాదింపుఁడు."

భీష్మునియొక్క యీ సదాచార పూర్ణమగు వ్యవహారమును, ఆతని యలౌకిక వినయమును గాంచఁగానే పరశురాముని హృదయముప్పొంగెను. ఆతఁడిట్లనెనుః— "వత్సా! ఇట్టి వ్యవహారమున నీవు నన్నుఁ బ్రసన్ను నొనర్చితివి. నీవిట్లు చేయకుండినచో నేను నీకు శాపమొసంగెడివాఁడనే. ఇప్పుడు పొమ్ము నేను నీకు విజయాశీర్వాదము నొసంగఁజాలను, కాని నీకు మంగళము కల్గుగాక!"

భీష్ముఁడాతని పాదములకు నమస్కరించి తిరిగివచ్చెను. ఇప్పుడిరువైపులను ఘోరయుద్ధము జరుగుచుండెను. ఇద్దరును విశ్వవిజయులగు వీరులే. ఇద్దరవద్దను దివ్యాస్త్ర సమూహములుకలవు. ఇద్దరును రణరంగ దుర్మదులును, సంయములును, సదాచారులును, జ్ఞానులును, హతులును దమ పక్షమునఁ బ్రబలముగ నుండువారుగ నుండిరి. ఇద్దరును ప్రాణములను బణముగఁబెట్టుకొని రణాంగణమందు తమ పౌరుషమును గౌశలమును బ్రకాశింపఁ జేయుచుండిరి. మూఁడురోజుల వఱకిద్దరకును దుములయుద్ధము జరిగెను. మూఁడు దినములత్యంత క్రోధముతోఁ బరశురాముఁడు భీష్ముని సారథినిఁజంపి, భీష్ముని మూర్ఛితునొనర్చి ధరాశాయిగా నొనర్చెను. గంగాపుత్రుఁడగు దేవవ్రతుఁడు భీష్ముఁడు చచ్చినాఁడనుకొని పరశురాముఁడు గర్జించెను. కాని అష్టవసువులును, గంగాదేవియును భీష్మునిరక్షించిరి. ఆతనికి మరలఁజైతన్యము కలిగెను. ఆతఁడు మరలఁ బరశురాముని మీఁదకు బరువిడెను. ఇప్పుడాతఁడొక దివ్యబాణములను వదలి పరశురాముని గాయపరచెను. మూర్ఛ తెలిసిన తరువాతఁ బరశురాముఁడు మరల భీష్మునిఁ జంపఁబరువిడెను. మునులాతని వారించిరి

పరశురాముని పరాక్రమమును గాంచి భీష్ముఁడు నిరాశను జెందెను. రాత్రి నిద్రఁబోవుచుండఁగా నష్టవసువులు స్వప్నమందు బ్రాహ్మణవేషమునవచ్చి భీష్మునకొక దివ్యా

స్మరణమును గావింపఁజేసెను. భీష్ముఁడు పూర్వజన్మమున వసువేకదా! ప్రాతఃకాలమున లేవఁగానే ఆతనికా యస్త్రము స్మరణమునకు వచ్చెను. సమరసమయమున నాతఁడు తన దివ్యాస్త్రమును విడుచుట కుద్యుక్తుఁడు కాఁగానే దేవతలును ఋషులును, మునులును, సిద్ధులును, చారణులును ఇతర దివ్య పురుషులును నట్లుచేయరాదని భీష్ముని వారించిరి. అష్టవసువులును వారి వాక్యముల ననుమోదించిరి. గంగాదేవియును బుత్రుని వారించెను. ఆతఁడందఱి మాటలను మన్నించెను. నారదుఁడును భీష్మునకు దర్శనమొసంగి ప్రస్వాపాస్త్రమును విడుచుటను వారించెను. అప్పుడు పరశురాముని పితృగణము ఆకాశమునుండిదిగి ఆతని సమీపమునకు వచ్చెను. వారిలో భృగు, ఋచీక, జమదగ్న్యాదులుండిరి. అందఱును బరశురాముని యుద్ధమును విరమింప వలసినదిగ చెప్పిరి. పరశురాముఁడు భీష్ముని బల, పరాక్రమ, యుద్ధచాతురీవిషయమునఁజాలసంతుష్టిఁజెందెను. ఆతనికి జయాశ లేకుండెను. ఆతఁడు కేక వేయుచు నిట్లనెను:- "భీష్ముఁడు నన్నునేఁడు జయించినాఁడు" అని పలికి నిలుచుండెను.

తదనంతరము పరశురాముని పితరులాతనికిట్లు చెప్పిరి:- "వత్సా! బ్రాహ్మణులకు యుద్ధము శోభింపదు. ఏకార్యమునకైనను సమయమనునది కలదు. నీశూరవీరతకు సమయము సమాప్తమైనది. నీవు భీష్మునిచేతిలో నింతవఱకు బ్రతికియుంటివి. అదిచాలఅదృష్టము. ఇప్పుడింకయుద్ధమును సమాప్తి కావింపుము"

ఇది విని పరశురాముఁ డిట్లనెను:- "పితరులారా! యుద్ధమునుండి యీవలకు రానని నేను బ్రతిజ్ఞ చేసితిని. భీష్ముఁడు యుద్ధమును విరమించుఁగాక!"

అప్పుడు దేవగణమును, పితరులును భీష్ముని సమీపమున కరువచ్చి ఆతనితో యుద్ధము నాపుమని చెప్పిరి. భీష్ముఁడు వీరత్వముతో నిట్లనెను:- "నేను నాస్థానమునుండి ఒక సువ్యాగింజంతైనఁ గదలఁజాలను. బ్రహ్మాండము తలక్రిందులైననుసరియే క్షత్రియుఁడు తన క్షాత్రధర్మము నెన్నడును వీడఁజాలఁడు"

భీష్ముని యిట్టి వీరతాపూర్ణములగు నుద్గారములను విని సమస్త ఋషులును; మహర్షులును, పితరులును, దేవతలును బరశురాముని జుట్టుకొని యిట్లనిరి:- "భీష్ముఁడు తన హఠమును వీడఁడు. బ్రాహ్మణుఁడెట్టివాఁడైనను వానిహృదయమునుండి క్షమాదయ లెన్నటికినిఁబోవు. కావున నీవే యుద్ధమును విరమింపుము"

అందఱి యభిప్రాయము ననుసరించి పరశురాముఁడు తల వంచవలసివచ్చెను. ఆతఁడు తన యస్త్ర శస్త్రములను భూమిపై నుంచెను. అంత భీష్ముఁడును దన యస్త్రశస్త్రములను రథమందుంచి, పరువెత్తుకొనిపోయి పరశురాముని పాదములపైఁబడెను. పరశురాముఁడు ప్రేమపూర్వకముగ భీష్ముని లేవఁదీసి కౌఁగిలించుకొని, ఆతని శిరస్సును మూర్కొని, సదా సమర విజయుఁడవు కావలసినదని యాశీర్వదించెను.

పరశురాముని యాజ్ఞనుబొంది, ఆతనిఁ బూజించి భీష్ముఁడు తన నగరమునకుఁ దిరిగివచ్చెను. అప్పుడు పరశురాముఁడంబతో నిట్లనెను:- "అమ్మా! నేను నాశక్తి కొలఁది ప్రయత్నించితిని, కాని నేను సఫలుఁడఁగాఁ జాలకపోయితిని ఇప్పుడు నీయిష్టమువచ్చినది చేసికొనుము"

పరశురామునినోట యీమాటలనువిని అంబ యిట్లనెను:- "ప్రభూ! మీ దోషమేమియును లేదు. ఇదంతయును నాదురదృష్టముయొక్క దోషము. ఇప్పుడు నేను తపస్సుచేసి యీశరీరమును త్యజించెదను. మరుసటి జన్మమున నా యవమానమునకు భీష్మునకుఁ బ్రతీకార మొనర్చెదను"

ఇట్లుపలికి ఆమె తపమొనర్చుటకై ఒంటరిగా వనమునకుఁబోయెను. ఆమె వెడలిపోయిన మీఁదట ఋషులును, మునులందఱును దమతమ యాశ్రమములకుఁ బోయిరి. పరశురాముఁడును మహేంద్ర పర్వతమునకుఁబోయి ఘోరతపోనిరతుఁడయ్యెను.

యిప్పుడాయంబ వనమునకుఁబోయి భీష్మునకుఁ బ్రతీకారమొనర్చుటకై ఘోరతపము నారంభించెను ఋషులామెను జాల వారించిరికాని ఆమె అంగీకరింపలేదు. శివుఁడామె తపస్సునకుఁ బ్రసన్నుఁడై మఱుజన్మమున భీష్మునకుఁ బ్రతీకారమొనర్చునట్లామెకు వరమొసంగెను. ఆసమయమున నా కుమారి చితినిఁబేర్చుకొని దానిలో భస్మమై మరణించెను.

ఇచ్చట ద్రుపదమహారాజు పుత్రునికై తపస్సును జేయుచుండెను. ఆతని తపస్సునకుఁ బ్రసన్నుఁడై శివుఁడాతనికి వరమొసంగెను:- "నీకు ముందొక కన్యకకలుగును. ఆమెయే మరలఁ బుత్రుఁడగును" ద్రుపదుఁడింటికివచ్చి తన రాణికిఁ జెప్పెను. నియత సమయమునకు రాణియొక్క గర్భమునుండి ఒకకుమార్తె పుట్టెను, కాని ఆతఁడు పుత్రుఁడను ప్రసిద్ధినిఁ జెందించెను. ఆతఁడామెకు శిఖండియను పేరుపెట్టెను. ఆ ద్రుపదకన్య పదునారేండ్లవయస్సు కలదికాఁగానే దశార్ణదేశాధిపతియగు హిరణ్యవర్మ పుత్రికతోఁ బెండిలిఁగావించెను. తాను వివాహమొనర్చుకొనిన యాతఁడు పురుషుఁడు కాఁడనియుఁబురుషవేషమునున్న స్త్రీయనియు నామెకుఁ దెలియఁగానే ఆవిషయమును దన దాసికిఁజెప్పెను. ఈ విషయము రాజగు హిరణ్యవర్మకుఁదెలిసెను. ఆతఁడు ద్రుపదునిపై దండెత్తెను రాజు—రాణి మిక్కిలి భయపడిరి రాజు ద్రుపదుని కడకు దూతనుబంపి యిట్లడిగించెను:-"నీవు నన్నేలనవమానమొనర్చితివి? శిఖండి చాల లజ్జవైచెను. ఆమె వనములకుఁ బారిపోయెను. అచ్చట స్థూణాకర్ణుఁడను నొక యక్షుఁడామె స్త్రీత్వమును గైకొని, దానికి బదులుగా నాతని పురుషత్వము నొసంగెను. ఈ విషయమును శిఖండి తనతల్లికిఁజెప్పెను అంత నాతల్లి ద్రుపదునితోఁజెప్పెను. ద్రుపదుఁడు దశార్ణాధిపతికడకు సందేశమునుబంపెను. శిఖండి ఆడుదికాదను విశ్వాసము దశార్ణాధిపతికి కలుగఁగానే. ఆతఁడు యుద్ధము చేయకయే తిరిగి

పోయెను. అంబయేశిఖండియై యుత్పన్నమైనదని భీష్మపితా మహునకుఁదెలియును. అందువలన నాతనిఁగాంచఁగనే తానస్త్ర శస్త్రములను ద్యజించెను. అప్పుడర్జునుఁడాతనిఁ జంపఁగలిగెను’

సూతుఁడిట్లనెను:-“మునులారా! ఈవిధముగ భీష్ముఁడు కాశీరాజు యొక్క ముగ్గురు కన్యకలను హరించి, యిద్దరి వివాహము తనతమ్ముఁడగు విచిత్రవీర్యుని తోడఁగావించెను. మూఁడవయామెను దన మృత్యువునకుఁ గారణ మొనర్చు కొనెను.”

విచిత్రవీర్యుఁడింత సుందరలగు నిద్దరు రాజకుమారికలను బొంది అత్యంతానందమును జెందెను. ఆతఁడు వారియెడల నత్యంతాసక్తినిఁజెంది రాజభవనమునుండి బయటకే వచ్చుట లేదు. రాజకార్యములన్నిటిని భీష్ముఁడే నిర్వహించుచుండెను. రాజకుమారికలు రాత్రిందివములు విచిత్రవీర్యుని సేవించు చుండిరి. అధిక సంగముచేతను విషయాసక్తిచేతను విచిత్ర వీర్యునకు రాజయక్ష్మ(క్షయ)రోగము సంభవించెను. భీష్ముఁడు గొప్పగొప్ప వైద్యులను, చికిత్సకులను బిలిపించి విచిత్రవీర్య నకుఁజికిత్సనుగావింపఁజేసెను. కానిఅన్నియును వ్యర్థమయ్యెను! అకాలముననే సత్యవతినందనుఁడగు విచిత్రవీర్యుఁడు కాల కబలితుఁడయ్యెను. ఆతఁడాయువతులగు స్త్రీలను నిస్సంతాను లుగవదలి పరలోకగామియయ్యెను. భీష్ముఁడు మిక్కిలికష్టము తోఁదన రెండవతమ్మునకును బ్రేత సంస్కార మొనర్చెను.

ఇతరుల యధికారమును ఛల బలములచే లాగుకొననో, ఆతఁడును దానినధిక దినములు ప్రభోగింపఁజాలఁడు! కురుకుల సింహాసనము మరల ఖాళీయయ్యెను. సత్యవతి భీష్ముని తో వివాహమొనర్చుకొని సింహాసనాధిష్ఠితుఁడవుకమ్మని బలవంత మొనర్చెను, కాని ఆతఁడు దృఢప్రతిజ్ఞుఁడు. ఆతఁడు రాజ సింహాసనమునఁ గూర్చుండుటకిష్టపడలేదు. ఇప్పుడందఱకును వంశము నత్యుణ్ణముగ నొనర్పవలయునను జింతపట్టుకొనెను. ఇప్పుడు సత్యవతి దీనికొఱకై యుపాయము నాలోచించు చుండెను.

—(౦)—

# విచిత్రవీర్యుని క్షేత్రజ సుతులు

(౨౮౯)

శ్లో॥ క్షేత్రేఽప్రజస్య వై భ్రాతుర్మాత్రోక్తో బాదరాయణః
ధృతరాష్ట్రంచ పాండుంచ విదురం చాప్యజీజనత్॥

శ్రీభాగ ౯ స్కం. ౨౨ అ. ౨౫ శ్లో॥

క౦॥ అతని సతుల వలన సుతుల
సుతసంయమి తల్లియనుప సొరిదింగనియెన్
ధృతరాష్ట్ర పాండు విదురుల
నుతచరిత్రుఁడు బాదరాయణుండు నరేంద్రా!

శ్రీమదాంధ్ర భాగవతము

ధర్మగతి చాలసూక్ష్మమైనది. ధర్మము ప్రాణుల స్వాభావిక ప్రవృత్తులను త్యజింపవలయునని చెప్పలేదు, వానిని సంయమ నియమములందుంచఁ గోరుచున్నది. మిథున సృష్టియందు మైథునేచ్ఛ స్వాభావికము — అపరిహార్యము. విషయభావన చేతనే ప్రాణులుద్భవించును.

కావున దానికొక కానునయుండి తీరవలయును కాని కామనచేఁ దృప్తికలుగదు. మండుడగ్నిలో నింధనములను వైచిన నెట్లువృద్ధినిఁబొందునో అట్లే ఉపభోగముచేఁ గామము నభివృద్ధియగును. అందువలన సర్వజ్ఞులైన ఋషులు కామమునకొక వ్యవస్థనేర్పఱచిరి అవ్యవస్థితముగఁ గామోపభోగమునకు స్వతంత్రత నొసంగిన

చోఁ పశువులకును మానవులకును నంతరమేమున్నది? అందు కనియే శాస్త్రకారులు "ఋతౌ భార్యాము పేయాత్" అనిరి. అనఁగా ఋతుకాలమందు దనభార్యతో గమనమొనర్పవలయును. ఇది సామాన్యనియమము. ఒక్కొక్కప్పుడీ వ్యవస్థయందు సమయానుసారముగఁ గొన్ని యపవాదములొనర్పవలసియుండును. దాని నాపద్ధర్మమందురు. కేవలమువిషయ తృప్తికొఱకు చేయఁబడు కార్యమెట్లు ధర్మమని చెప్పఁబడఁగలదు?

సూతుఁడిట్లనెను:- "మునులారా! శంతనుమహారాజు కామవశుఁడై కైవర్త కన్యను వృద్ధావస్థయందు వివాహమాడెను. ఆ కారణమున సర్వసమర్థుఁడగు భీష్ముని యధికారము నష్టమైనది. దానిపరిణామము బాగుండలేదు కురుకుల పరంపర యెట్లుండవలయునో యట్లు పూర్ణముగ నుండఁజాలక పోయెను ఏ సత్యవతీ రూపమునందు మహారాజాసక్తినిఁ జెందెనో, ఆమెతో నాతఁడధిక దినములుండఁ జాలకపోయెను. ఇద్దరు చిన్నపిల్లలామె వడినివదలి పరలోకవాసులైరి. నామమునకు రాజయ్యెనేమో కాని రాజ కార్యములన్నిటిని భీష్ముఁడే నిర్వహించుచుండెను. ఈ యిద్దరిపిల్లలలో నొక్కఁడైన యోగ్యుఁడు కాకపోవునాయని భీష్ముఁడాశించెను. కాని యిద్దరిలో నొక్కఁడును యోగ్యుఁడు కాలేదు! కురుకులము — పురువంశ నామము మాసిపోవునేమోనని సత్యవతికిమిక్కిలి చింతపట్టుకొనెను. ఆమె దృష్టి దేవవ్రతుఁడగు భీష్ముని మీఁదకుఁబోవు

చుండెను. దేవవ్రతుఁడు మిక్కిలి హఠుఁడనియు, దృఢప్రతిజ్ఞుఁ డనియు నామెయెఱుఁగును. కావుననామె ఆతని కేమియును జెప్పసాహసించుటలేదు.

ఒకదినమునఁదల్లి యేకాంతమున భీష్మునితో నత్యంత నమ్రతతో నిట్లనెను:- "దేవవ్రతా! నేఁడుకురుకుల దీపమారి పోనున్నది. అందఱదృష్టములు నీపైలగ్నమైయున్నవి. కావున నీ విప్పుడు నీప్రతిజ్ఞను సడలించుకొనుము రాజ సింహాసనమునఁ గూర్చుండుము. వివాహమొనర్చుకొనుము. సంతానమును గనుము కురుకుల వంశపరంపర నవిచ్ఛిన్నముగ నొనర్పుము."

భీష్ముఁడిట్లనెను:- "అమ్మా! సజ్జనుఁడగువాఁడు తన ప్రతిజ్ఞనువీడఁడు నేను రాజ్యమునుగ్రహింపనను నా ప్రతిజ్ఞ నుండి జారిపోఁజాలను."

తల్లి యిట్లనెను:-"నీవు నాబలవంతమున దీనినంగీకరింపుము. రాజ్యమును గొనుమని నేను జెప్పుటలేదు. నేను కుల పరంపరావృద్ధికొఱకు బలవంతమొనర్చుచున్నాను. నా తరు వాతనాపుత్రుఁడు రాజ్యాధికారికాఁగలఁడు, దీనివలన నేను ప్రపంచసమ్ముఖమున నసత్యవాదిని కాఁగలనను నొకభయము నీకుండవచ్చును. అయితే నీవొక్కపనినిఁ జేయుము. ఇప్పుడు నీవు రాజ్యభారమును నిర్వహింపుము. వివాహమును జేసికొన వలదు విచిత్రవీర్యుని యీ యిద్దరు రాజకుమారికలు పరమ

సుందరులు, యువతులు, వీరియందు నీవు సంతానమును గలి గింపుము. ఎవరితో నెవరికిఁ బాణిగ్రహణముకలిగెనో, ఆక్షేత్ర మందలి సంతానము వారిదే కాఁగలదు. ఇది శాస్త్రకారుల మతము. ఈ రాణులకుఁబుట్టిన పుత్రులు విచిత్రవీర్యుని పుత్రు లుగనే యెన్నఁబడుదురు. వారు సమర్థులు కాఁగానే రాజ్యమును వారికీయవచ్చును దీనిచే వంశ పరంపరము నక్షుణ్ణముగ నుండఁగలదు, నీ ప్రతిజ్ఞకును భంగమురాదు. ఇట్లొనర్చుట విశుద్ధధర్మము కాకున్నను. నీసమయమున మనమాపద్ధర్మ ముగ గ్రహింపవలసియుండును.''

భీష్ముఁడిట్లనెను:- "అమ్మా! నీవు చెప్పినది సత్యమే కాని నేనుజీవించియున్నంత వఱకు బ్రహ్మచారిగా నుందున నియుఁ బ్రతిజ్ఞను జేసియుంటిని. అందువలన విచిత్రవీర్యుని భార్యలు నాకు పుత్రికలు, పుత్రవధువులవంటివారు. నేను వారియందేయననేల, నేస్త్రీయందును సంతానోత్పత్తిఁ గావింపను''

నిరాశయై సత్యవతి యిట్లనెను:- "అయితే యిప్పుడేమి కావలయును. రాజర్షి యగు ప్రతీపుని వంశము నశింపవల సినదేనా? నీవు ధర్మాత్ముఁడవు నీవే యేదైన ధర్మమును జెప్పుము.''

భీష్ముఁడిట్లనెను:-"అమ్మా! ఆపత్కాలమున నియమ ముండదు, నియమరహితమగు ధర్మమునకే ఆపద్ధర్మమందురు.

ఆపత్తు వచ్చినప్పుడిట్టి ధర్మమును బాలింపవలసి యుండును. పరశురాముఁడు పృథివియందలి సమస్త క్షత్రియులను నశింపఁ జేసినప్పుడు క్షత్రియస్త్రీలు బ్రాహ్మణులవలన సంతానోత్పత్తి నిఁగల్గించుకొనిరి వారందఱును క్షత్రియులనఁబడిరి. సంతానోత్పత్తికిఁ గాక సంగమమొనర్చినచో నది వ్యభిచారముకాఁగలదు. అదేవిధముగ నీవును సుయోగ్యుఁడగు నే బ్రాహ్మణునినైనను బిలిచి, ఆతనిద్వారా యీ యిద్దరు రాణులయందు సంతానోత్పత్తి నిఁ గలిగింపఁజేయుము. ఇదితప్ప వేరొక యుపాయము లేదు."

అంత సత్యవతి లజ్జించుచు నిట్లనెను:—"దేవవ్రతా! నీవు నాకంటె జ్యేష్ఠుఁడవు, శ్రేష్ఠుఁడవు, ధర్మాత్ముఁడవు, మాకందఱకును నీవేగతి. నీవు చెప్పరాని విషయమొక్కటికలదా? కాని చెప్పనిదిపనిజరుగదు నేను గన్యకగానున్నప్పుడు పరాశరమహర్షి వలన నొకపుత్రుఁ డుదయించినాఁడు. ఆతఁడు తండ్రివలెనే తేజస్వి. పుట్టఁగానే ఆతఁడు తనతండ్రితో వెడలి పోయినాఁడు. వెడలినపుడాతఁడు నాకిట్టి వరమొసంగినాఁడు:— "అమ్మా! నీవెప్పుడునన్ను స్మరించిన నప్పుడు రాఁగలను" నీ వనుమతించినచో వానిని నేనుబిలిచెదను. ఆతనిచే నా రాణులందు సంతానమును గలిగించెదను. ఆతని పేరు వ్యాసుఁడు."

భీష్ముఁడిట్లనెను:- "అమ్మా! నేను వేదవ్యాసభగవానుని బాగుగా నెఱుగుదును, ఆతఁడు నీకు కానీనపుత్రుఁడని నాకు

తెలియవిదికాదు. పరాశరమహాముని ఆశీర్వాదముచే నాతనిఁ గనియు నీ కన్యాత్వము చెడలేదు. ఆతనిద్వారా సంతానము నుత్పత్తినిఁగావించుట అధర్మముకాదు.''

ధర్మాత్ముఁడగు భీష్ముని యనుమతినిఁబొంది తల్లియగు సత్యవతి అనయముననఁదన పుత్రునిస్మరించెను స్మరింపఁగానే సర్వజ్ఞుఁడగు వేదవ్యాసభగవానుఁడు వెంటనే అచ్చటఁ బ్రత్యక్షమయ్యెను. తల్లియొక్క ఆనందమునకుమేఱలేకుండెను. కుశలప్రశ్నానంతరము తల్లి మొదటినుండి చివరవఱకు సమస్త వృత్తాంతమునుజెప్పెను. ఆపద్ధర్మమనియెఱింగి వేదవ్యాసుఁడు తల్లియందుగల గౌరవమున నివిషయమునంగీకరించెను ఆతఁ డిట్లనెను:—“అమ్మా! నా తేజస్సు సహింపరానిది. నాశరీరము నుండి తపస్సుచే నుత్కటగంధము వెలువడును. ఘోరతపం బొనరించుటచే నాశరీరము నల్లగను కఠోరముగనునైనది జడలు తామ్రవర్ణములుగనైనవి. వ్రతోపవాసము లొనర్పని స్త్రీలు నాసమీపమునకు రాఁజాలరు. కావుననీవు ఇద్దరు కోడండ్రచేతను నొకొక్క సర్వము కాలము వ్రతమొనరింపఁ జేయుము. అప్పుడు నాసమీపమునకు వచ్చు యోగ్యత ప్రాప్తింపఁగలదు.''

తల్లియగు సత్యవతి యిట్లనెను:—“నాయనా! మాకు ఒక్కొక్కక్షణము భారముగఁ దోచుచున్నది. రాజులేకున్నచోఁ బ్రజలుచ్ఛృంఖలులగుదురు. సర్వత్ర అరాజకత వ్యాపిం

బఁగలదు కాలమున వర్షములనిందు్రఁడు వర్షింపఁజేయఁడు. ధార్మికక్రియలు లుప్తముకాఁగలవు కావుననీవు శీఘ్రముగ నీకార్యము నొనర్పుము.''

వ్యాసుఁడిట్లనెను:– "నీయాజ్ఞప్రకారమే కాని కోడం డ్రకు సావధానముగ నుండవలసినదనియు, భయపడవలదని యుఁజెప్పవలయును."

సత్యవతి యీవిషయము నంగీకరించెను. ఆమె తన పెద్దకోడలు అంబికను, ఆమెకు కౌశల్యా అను పేరునుగలదు. ఆమెతో నింతోఁజెప్పెను. కాని ఆమెఅంగీకరింపలేదు కాని అత్తగారే బలవంతపెట్టఁగాఁ జివరకంగీకరించెను.

నిశీథిసమయమున నంబికా శయన గృహమునకు వ్యాస భగవానుఁడు విచ్చేసెను అంబిక వస్త్రాభూషణములచే నలం కృతయై అతనికొఱకు ప్రతీక్షించుచుండెను. శయన గృహము బాగుగానలంకరింపఁబడినది. దానియందు సుందర సుగంధిత తైలముతో దీపము వెలుఁగుచుండెను. వ్యాసభగవానుఁడదుఁ బ్రవేశింపఁగనే ఆగృహము గంధముతో నిండిపోయెను. భగ వానునియొక్క పొడుగుపాటి స్వర్ణాభమగుజడలు దీపప్రకాశ మున విద్యుల్లతలవలెఁ బ్రకాశింపుచుఁ గదలుచుండెను. విశాల నేత్రములనుండి దివ్యప్రకాశము వెలువడుచుండెను. అతని గడ్డములును మీసములును గొంచెముపెద్దవిగను, గొంచెము దట్టముగను నుండెను. అతఁడు రురువను మృగచర్మమును

ధరించియుండెను ఆతని యిట్టిరూపమునుగాంచి అంబిక భయముచే నేత్రములను మూసుకొనెను. మరల వ్యాసభగవాను నామె చూడనేచూడలేదు భగవానుఁడామెకు గర్భాధాన సంస్కారమొనర్చి వెడలిపోయెను.''

సత్యవతి అత్యంతోత్సాహముగ నిట్లడిగెను:- ''నాయనా! కౌసల్యాగర్భమున మాకులమున కనురూపుఁడగు పుత్రుఁడుదయించునుగదా!''

వ్యాసుఁడిట్లనెను:- ''అమ్మా! ఏపనిలోనైనను తొందర ఆపనికి రాదని నేనిదివఱకే చెప్పితిని కౌసల్యాగర్భమునఁబదివేల యేనుఁగులకు సమానముగ బలవంతుఁడుదయింపఁగలఁడు, కాని అంధుఁడగును;ఏలననఁగా నీకోడలు నన్నుఁగాంచి కన్నులు మూసుకొనినది.''

సత్యవతి యిట్లనెను:- ''నాయనా! అంధుఁడగు పుత్రుఁడు రాజు కాఁజాలఁడు నీవుకృపతో నొకపుత్రుని మా కొఱకు రెండవ రాణికిఁబుట్టింపుము.''

వ్యాసభగవానుఁడీ విషయమును దల్లిమీఁదఁగల గౌరవముచే మరలనంగీకరించెను ఈసారి సత్యవతి తన చిన్నకోడలగు నంబాలికను బాగుగానచ్చఁజెప్పి యొడఁబఱచి కన్నులను మూసికొనవలదు, జాగ్రత్తగానుండుమని చెప్పెను, కోడలును నీ విషయమునంగీకరించెను, కాని నియతసమయమునకు వేద

వ్యాసభగవానుఁడు రాఁగానే, ఆమె తేజస్వియును, తపస్వియు నగునాతని రూపమునుగాంచి భయముచేఁ దెల్లఁబోయెను భగవానుఁడామెకు గర్భాధానమును గావించెను. సత్యవతి మరల నిట్లడిగెను:- "ఈమెకెట్టిపుత్రుఁడు కలుగఁగలఁడు?" అప్పుడు భగవానుఁడిట్లనెను:-"ఏమిచెప్పుదునమ్మా! నీ వాఁడలిట్లున్నది. పిల్లవాఁడుమంచివాఁడే కాని వాఁడు తెల్లగానుండును. ఆతనికి రాజకార్యములందు రుచియుండదు; ఏలననఁగా నీ కోడలు నన్నుఁగాంచి తెల్లఁబోయినది."

అంతసత్యవతి యిట్లనెను:- "నాయనా! మరలనొక్క-సారి అనుగ్రహింపుము. నాపెద్దకోడలికింకొక సంతానము కలుగునట్లొనర్పుము."

భగవానుఁడిట్లనెను.- "అమ్మా! నేనేది చేసినను విశుద్ధమగు ధర్మబుద్ధితో నొనర్చుచున్నాను. ఇందులోఁగామ వాసన లేనేలేదు"

సత్యవతి యిట్లనెను:- "నాయనా! అది నేనెఱుఁగుదును నీవు జితేంద్రియుఁడవు సాక్షాత్తుగ ధర్మస్వరూపుఁడవు, కాని మావిపత్తును గూడఁజూడవలయును మాకొక సర్వగుణ సంపన్నుఁడగు సుతుఁడవసరము ఆతఁడు కురుకులమున యశస్వియగు రాజు కావలయును."

వ్యాసుఁడిట్లనెను:- 'మంచిది, ఒక సంవత్సరమైనతరు వాత నేను మరలవచ్చెదను." వ్యాసుఁడచ్చటనే వెంటనే అంతర్ధానమయ్యెను.

సమయమురాఁగానే అంబిక ఒకపుట్టిగ్రుడ్డియగుపుత్రుని గనెను ఆతనికి ధృతరాష్ట్రుఁడని పేరునుపెట్టిరి. కొంతకాలమునకు అంబాలిక ఒకపుత్రరత్నమును గనెను ఆతఁడు తెల్లగనుండెను. శరీరమంతయును పాండువర్ణముగ నుండుటచే నాతనికి పాండు అను ప్రసిద్ధినిఁజెందెను.

అంబికకు ప్రసవకార్యమంతయును బూర్తికాఁగానే సత్యవతి ఆమెతోనిట్లనెను:- "అమ్మా! ఈయంధపుత్రుఁడు రాజగుటకు యోగ్యుఁడుకాఁడు. కావున నీకిఁకొకపుత్రుఁడు పుట్టగలఁడు. నీవాతనిఁజూచి భయపడకుము" ఇది విని అంబిక కపటముగ నంగీకరించినది కాని, ఆమెమనస్సులో భగవానుని జూచిన భయమట్లేయుండెను. నియతతిథియందు భగవానుఁడు రావలసియున్నది. అంబిక చాలభయపడెను. కావున నామెతాను శయనాగారమునకుఁ బోలేదు. తన రాజోచితమగు వస్త్రాభూషణాదులను ధరింపఁజేసి అంత్యంతసుందరియగు దాసిని నచ్చటకుఁబంపెను.

నియతసమయమునకు వ్యాసభగవానుఁడు విచ్చేసెను. దాసి ఇది తనకు గొప్పసౌభాగ్యమని తలఁచెను. భగవానుఁడు రాఁగానే ఆమెలేచి భూమిని శిరస్సునుమోపి, మిక్కిలి శ్రద్ధా

భక్తులతోఁ బ్రణామమును గావించెను. అంతనాతని సేవింప సాగెను భగవానుఁడు దాసీయొక్క సేవచేనత్యధిక సంతుష్టిని జెందెను. అతఁడామెతో మాటలాడి, గర్భాధాన సంస్కారమును గావించి, ఆమెనిట్లాశీర్వదించెను:- "నీగర్భమునుండి సాక్షాత్తుగ ధర్మరాజవతరింపఁగలఁడు ఆతఁడు ప్రపంచమున గొప్పఖ్యాతిని సంపాదింపఁగలఁడు. ఆతఁడు రచించిన నీతి విద్వాంసులకు పథప్రదర్శనము కాఁగలదు" ఈ విధముగ వరమునొసంగి వ్యాసుఁడు వెడలిపోయెను. నియమిత సమయమున దాసీగర్భమునుండి విదురుఁడు జన్మించెను. ఆతఁడు పూర్వజన్మమున ధర్మరాజు. ఆతఁడణీమాండవ్యం ఋషి శాపముచే శూద్రయోనియందు జన్మింపవలసివచ్చినది.

సూతుఁడిట్లనెను.- "మునులారా! ఈవిధముగ ధృతరాష్ట్ర, పాండు, విదురులను నీముగ్గురును మహారాజగు విచిత్రవీర్యుని క్షేత్రమందు వ్యాసుని వీర్యముచే నుత్పన్నులైన కారణమున వైచిత్రవీర్యులనఁబడిరి. దేవవ్రతుఁడగు భీష్ముఁడు మిక్కిలి జాగ్రత్తగా నీముగ్గురను బాలనపోషణ మొనరించెను. ధృతరాష్ట్రుఁడు జన్మాంధుఁడు. కావున నాతఁడు రాజ్యాధికారి కాఁజాలకపోయెను. విదురుఁడు దాసీపుత్రుఁడు. ఆతఁడు ప్రాచీన నియమానుసారముగ రాజు కాఁజాలకపోయెను. అందువలన పాండురాజే కురుకుల సింహాసనమునఁ గూర్చుండెను. పాండుమహారాజు గొప్పబలవంతుఁడు. అతఁడొంటరిగా

రథముమీఁదఁగూర్చుండి దిగ్విజయ మొనరించెను. పాండు రాజును రాజుగాఁబడసి ప్రజలు పరమప్రముదితులైరి ”

అంత శౌనకుఁడిట్లడిగెను.– “సూతా! ఈధృతరాష్ట్రుఁడును బాండురాజును సంతానవంతులేనా?”

సూతుఁడిట్లనెను:– “స్వామీ! ఎందులకుకాను? కాని వారందఱుకు వ్యాసాది మునుల కృపవలననే కలిగిరి. ఇప్పుడు నేను కౌరవ పాండవులజన్మకథనుగూర్చి చెప్పెదను. మీకీ నర పతుల గాథను శ్రద్ధతోఁ శ్రవణ మొనర్పుఁడు”



# ధృతరాష్ట్రపాండు పుత్రులు

(౭౯౦)

శ్లో॥ గాంధార్యాం ధృతరాష్ట్రస్య జజ్ఞే పుత్రశతం నృప।
తత్రదుర్యోధనోజ్యేష్ఠో దుఃశలా చాపి కన్యకా।
శాపాన్మైధున రుద్ధస్య పాండోః కుంత్యాం మహారథా!
జాతా ధర్మానిలేంద్రేభ్యో యుధిష్ఠిర ముఖాస్త్రయః॥
నకులః సహదేవశ్చ మాద్ర్యాం నాసత్యదస్రయోః!

శ్రీభాగ. ౯ స్కం, ౨౨ అ ౨౬-౨౭ శ్లో.

వ- అందు ధృతరాష్ట్రునికి గాంధారియందు దుర్యోధ నాదులగు కొడుకులు నూర్వురును దుశ్శలయను కన్యకయును జన్మించిరి; మృగశాప భయంబునం జేసి భార్యం బొందవెఱ చిన పాండునకుఁ గుంతీదేవియందు ధర్మానిలేంద్రుల ప్రసా దంబున యుధిష్ఠిర భీమార్జులను మువ్వురును. మాద్రిదేవివలన నాసత్యప్రసాదంబున నకుల సహదేవులను వారిద్దఱును గా నేవురు పుట్టిరి.

శ్రీమదాంధ్ర భాగవతము

ఏ సంతానమును దండ్రియుత్పత్తి యొనర్చి పుత్ర పుత్రిక లనిభావించి పాలనపోషణ మొనర్చినాఁడో వారి వివాహితు లైనఁజూడవలయునని తల్లిదండ్రులకు స్వాభావికేచ్ఛయుండును.

మానవుఁడు తాను దేనియందు సుఖానుభవ మొనర్చునో, దానినిఁదన ప్రియులకొసఁగఁదలఁచును. గృహస్థునకన్నిటికంటె గొప్పసుఖము మిథునమగుట, ఒకఁడిద్దరుగనగుట. తల్లిదండ్రులు పుత్రునికొఱకు యోగ్యురాలగు వధువును, బుత్రికకొఱకు యోగ్యుఁడగు వరునికొఱకు నిరంతరము చింతించుచుండును. వివాహమగుటచే సంబంధులయొక్కయు, వంశముయొక్కయు వృద్ధియగును. అందువలన గృహస్థులకు సర్వ శ్రేష్ఠ మహోత్సవము, అన్నిటికంటె సుఖప్రదమగు కార్యము వివాహమే.

సూతుఁడిట్లనెను:- "మునురారా! శంతనుసుతుఁడగు భీష్ముఁడు ధృతరాష్ట్ర, పాండు, విదురులను బాలనపోషణ మొనర్చి పెద్దవారినొనర్చెను. ముగ్గురును గురుకుల సింహాసనమునఁ గూర్చుండఁగానే, యువకులుకాఁగానే భీష్మునకు వారి వివాహ చింతకలిగెను. పెద్దవాఁడగుటచే మునుముందుగా నాతఁడు ధృతరాష్ట్రునకు వివాహమొనర్పవలసియుండెను. ధృతరాష్ట్రుఁడంధుఁడు. గ్రుడ్డివానికిఁదమ పిల్లనెవఁడీయఁగలఁడు? కాని యుత్తమకులమనిగాని, ధనైశ్వర్యములనిగాని ప్రలోభమున్నచో మహావ్యాధి యుక్తునకును వివాహమగుచుండును. ధృతరాష్ట్రుఁడు యువకుఁడగు సుందరరాజపుత్రుఁడు.

గాంధారదేశాధిపతియగు సుబలుని కడ అత్యంతరూపవతియును, గుణవతియునగు పుత్రిక కలదని గాంగేయుఁడగు భీష్ముఁడువినెను. అందువలన నాతఁడు ధృతరాష్ట్రునకుఁదనపుత్రికనొసంగుమని కబురంపెను.

ధృతరాష్ట్రుఁడంధుఁడని తెలిసికొని సుబలమహారాజు ఇంతటి సుందరియును, సుకుమారియును, ప్రియమగు పుత్రికను జన్మాంధునకిచ్చి వివాహము చేయుటెట్టులాయని చాల చింతలోఁబడెను. మరల నాతఁడిట్లనుకొనెను:- "మనము సాధారణ రాజులము. కులీన వంశజులగు రాజకుమారులు మాతో సంబంధము నొనర్చుటకు వెనుకాడుచుందురు. మా దేశమును మ్లేచ్ఛప్రాయమైనది. మంచిది మనము పురువంశ రాజులతో సంబంధము పెట్టుకొనవలయును. కండ్లులేక పోయిన నేమి? ఇంతగొప్పయింటికిపోయి కన్యసుఖపడఁగలదు" ఇట్లాలోచించుకొని మహారాజగు సుబలుఁడా సంబంధము సంగీకరించెను. మహారాజునకును శకుని యను నొకపుత్త్రుఁడును గలఁడు. ఆతఁడును దండ్రియభిప్రాయమును సమ్మతించెను. ఇంతదూరమునుండి పెండ్లివారినిఁ బిలుచుటెట్లు? అని ఆలోచించుకొని శకుని తన సోదరిని రథముమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొనిస్వయముగ హస్తినాపురమునకు వచ్చెను. భీష్ముఁడు దీనినిఁగాంచి చాల సంతోషించెను. ఆతఁడు రాజభవనమున శాస్త్రవిధిచే ధృతరాష్ట్రునకును గాంధారికిని వివాహమును గావించెను.

తనతండ్రి జన్మాంధుఁడగు నొక రాజకుమారునకుఁ దన తండ్రి తననొసంగి వివాహమును జేయుచున్నాఁడని గాంధారి తెలిసికొని, తానును దనకన్నులకు నొకముతకగుడ్డతో బంధిం

చుకొనెను. ఆమె యిట్లనుకొనెను:- "నేను నా యొుధుండగు బతివలెనే యుండెదను ఏలననగా నామనస్సులో నాతని యెడల ననాదరభావము రాఁగూడదు"

గాంధారి గొప్పపతివ్రత. ఆమెతన శీల, స్వభావ, సదాచార, సద్వ్యవహారములచే సమస్తసంబంధులకు బ్రిస న్నుల నొనర్చుచుండెను ధృతరాష్ట్రుఁడిట్టి సతీసాధ్వియును, బతివ్రతయునగు బత్నినిఁబొంది బరమ ప్రముదితుఁడై సుఖోప భోగము లొనర్చు చుండెను.

భీష్ముఁడిఁక బాండురాజు వివాహచింత పట్టుకొనెను. పాండురాజు శూరవీరుఁడును. సుందరుఁడును, గుణియునై యుండెను కాని ఆతఁడు తెల్లగనుండెను. ఏకన్యకయైనను స్వయముగ నాతని వరింపవలయునని భీష్ముని కోరిక ఆదినము లలోఁ గుంతిభోజుని కూఁతురగు కుంతికి స్వయంవరము జరుగు చున్నదని వినవచ్చెను కుంతి ఆతనికి స్వంత కూఁతురుకాదు.

వృష్ణివంశీయుఁడగు శూరసేన మహారాజు గొప్పధార్మి కుఁడగు రాజు. ఆతని పేరట నా దేశమునకు శూరసేనములను పేరువచ్చెను. కుంతిభోజుఁడాతని పినతల్లి కుమారుఁడు. ఇద్దర కును మిక్కిలి ప్రేమకలదు. కుంతిభోజునకు సంతానము లేదు. శూరసేనుఁడిట్లనెను:- "నేను నాకు ముందుపుట్టిన సంతాన మును నీకొసంగెదను"

దైవవశమున మహారాజునకుఁ బుత్రికకలిగెను. మహారాజామెకుఁ బృథయను పేరిడెను. తన ప్రతిజ్ఞానుసారముగ శూరసేన మహారాజాకన్యకను తన పినతల్లి కుమారుఁడగు గుంతిభోజునకొసంగెను. ఒక కుముదినిని సుందర సరోవరము నుండి తెచ్చి, మఱియుక సరోవరమున వృద్ధిఁబొంది వికసించి నట్లామె శూరసేనమహారాజు మహాలునుండి వచ్చి, కుంతిభోజుని మహాలునందు వృద్ధిఁబొందుచుండెను. అప్పటికి రాఁగానే ఆమెకుఁ గుంతియను ప్రసిద్ధికలిగెను. శూరసేనునకుఁ బృథ కాక నల్గురు కన్యకలును, వసుదేవాది పదిమంది పుత్రులును గలిగిరి. అందువలన శ్రీకృష్ణచంద్రునకుఁ గుంతి మేనత్త కాఁగలదు. యయాతి మహారాజు తనయైదుగురు పుత్రులలో నలుగురను రాజ్యబహిష్కృతుల నొనర్చెను. కేవలమందఱికంటె జిన్నపుత్రుఁడగు బూరునే విశుద్ధక్షత్రియుఁడుగ భావించి రాజుగా నొనర్చెను. కావున పురువంశజులగు రాజుల క్షత్రియులలో సర్వశ్రేష్ఠులుగ నెన్నఁబడుచుండిరి. యదువంశీయులును రాజులేకాని వారికి నియమానుసారముగ సామ్రాట్ చిహ్నములను ధరించుటకధికారములేదు. పురువంశీయ రాజులతో వారికి వివాహాది సంబంధములునులేవు, కుంతి కన్యకగానున్నపుడామెకు దుర్వాసమహర్షియొక్క కృపచే దేవహూతి విద్య ప్రాప్తించెను. మంత్ర పరీక్షకొఱకు కుతూహలవశమున నామె సూర్యనారాయణునిఁ బిలిచెను. ఆమెకుఁ గన్యావస్థయందే తన తండ్రియొక్క యింటిలోనే కర్ణుఁడు జన్మించెను.

లోకాపవాద భయముచేఁ గుంతి రహస్యముగ నామెను పెట్టెలోఁబెట్టి నదీజలమున వదలెను. అయినను నామె సూర్యునివరముచే నామె పూర్వరీతినిఁ గన్యకగానే యుండెను. ఆమె సౌందర్యవిషయమున సర్వత్ర ఖ్యాతికలదు. అనేకక్షత్రియకుమారులు కుంతిభోజ మహారాజును గుంతిని యాచించిరి. ఒకరికొసంగిన నొకరికిఁ గోపము రాఁగలదు. ఎవరికిచ్చుట? ఎవరికీయకుండుట అని యాలోచించుకొని కుంతిభోజమహారాజు తన కన్యకకు స్వయంవరమును రచించెను. దానికి పాండుమహారాజును వచ్చెను. కురుకుల భూషణుఁడగు పాండుమహారాజు తనపుత్రికాస్వయంవరమునకు వచ్చుటనుగాంచిన యుమహారాజు ఆనందమునకు మేఱలేకుండెను కుంతియును పాండుమహారాజు వీరతాఖ్యాతిని వినియుండెను అందువలన నామె ఆతనికంఠమున జయమాలను వైచెను. మిగిలిన రాజులును, రాజకుమారులును నిరాశులై తిరిగిపోయెను. కుంతీ పాండురాజులకు మిక్కిలి వైభవముగ వివాహముజరిగెను కుంతివంటి సుందరినిఁబొంది పాండురాజును ఆనందించెను.

కుంతికిఁ గొంతకాలమువఱకు సంతానము లేకుండెను. అప్పుడు భీష్ముఁడు పాండురాజునకింకొక వివాహమును జేయఁదలఁచెను. మద్రదేశాధిపతియగు మద్రరాజునకు మాద్రియను సుందరపుత్రిక కలదని భీష్ముఁడువినెను. శాస్త్రకారులు మద్రదేశమును నిందించిరి. ఈవిషయమును మహాభారతయుద్ధమున

గర్ణుఁడు తన సారథియగు మద్రాధిపతి శల్యునితో మాటి మాటికిని బలుకుచుండెను. అస్తుదీనివలన నేమి కాఁగలదు? "కన్యారత్నం దుష్కులాదపి" అని నీతికారుల వచనముకలదు కాని మద్రిరాజు క్షత్రియుఁడే, అందువలన దేవవ్రతుఁడగు భీష్ముఁడు మంత్రిపురోహిత బ్రాహ్మణులతో బాహ్లీక వంశావతంసుఁడగు మద్రరాజున వనమునకుఁబోయెను. తన కడకు వారందఱును వచ్చుటనుగాంచి మద్రరాజు హర్షమునకుమేఱ లేకుండెను. ఆతఁడు విధ్యుక్తముగ భీష్ముని బూజించి, నమ్రతతోనిట్లనెను:- "ప్రభూ! మీరే ప్రయోజనమునకై యిన్ని నద, నదీ, వన, పర్వతాదులను లంఘించి నాకడకువచ్చితిరి? నావలన గావలసినదియుండిన నాజ్ఞాపింపుఁడు"

భీష్ముఁడిదివిని యిట్లనెను:- "రాజా! మీవద్ద అత్యంత సుందరియును వివాహయోగ్యయునగు కన్యక కలదని విని యుంటిని. ఆమెను నాతమ్ముని కొడుకగు పాండురాజుకొఱకై యాచింపవచ్చితిని."

ఇదివిని యానందమును బ్రకటించుచు మద్రరాజిట్లనెను:- "మహారాజా! ఇదినాకు పరమ సౌభాగ్యకరమగు విషయము. పురువంశ నరపతులతో సంబంధమును బెట్టుకొనుట కెవరుకోరరు? రాజా! మాపిల్లకిట్టి సుందరవరుఁడు, ఇంతటి సమృద్ధిశాలియు, గౌరవాన్వితమగు కులమును భూమిపై నెచ్చట లభింపఁగలదు? కాని రాజా! మాకులపరంపరలో నొక సదాచారము కలదు."

దేవవ్రతుఁడగు భీష్ముఁడిట్లడిగెను:- "అదేమి?"

మద్రరాజిట్లనెను:- "మేము వరునికడ ధనమునుగొని వివాహ మొనర్చెదము."

భీష్ముఁడిట్లనెను:- "ఇదిగాకుండ లేదు. కన్యకకొఱకు ద్రవ్యమును గైకొని వివాహ మొనర్చుట నిందనీయముగు కార్యము"

మద్రరాజిట్లనెను:- 'ఏమైనఁగానిండు నేను నాకుల పరంపరు భావింపవలయును'

అంతనవ్వి భీష్ముఁడిట్లనెను:- "మంచిది. మీపూర్వ పురుషులు స్థాపించిన మర్యాదను మీరుపాలింపుడు. నేను మీకుకావలసిన ధనమిచ్చెదను" అనిశలికి భీష్ముఁడధికముగ సువర్ణమును. జాలగ మణిమాణిక్యమయ జటిత సువర్ణాభూష ణములను, రత్నములను, గజాశ్వములను, ముత్యములను బోవులు పోవులుగ మద్రరాజునకొసంగెను. ఈవస్తువులనన్ని టినిగైకొని మద్రరాజగు శల్యుఁడు తన సోదరియగు మాద్రిని వస్త్రభూషణములచే నలంకృతమొనర్చి భీష్మునకొసంగెను. ఆతఁడామెను హస్తినాపురమునకుఁ గొనిపోయి శుభముహూ ర్తమందు ఆమెను పాండురాజునకొసంగి పెండ్లిచేసెను ఇప్పుడు పాండురాజునకుఁ గుంతీమాద్రులను నిద్దరు భార్యలేర్ప డిరి. ధృతరాష్ట్రునకొక్కతియే భార్య గాంధారియనునామె. ఇఁక మిగిలినవాఁడు విదురుఁడు ఆతని వివాహము విషయము నను భీష్మునకుఁ జింతకలిగెను.

ఒక దినమున మాథురమండలమున నొక బ్రాహ్మణుని వలన గంసుని పినతండ్రి దేవకునకు, ఒకశూద్రస్త్రీ గర్భమున నొకయువతి యుత్పన్నమైనదని భీష్ముఁడు వినెను. ఆమె చాల గొప్పసుశీలయును ధర్మపరాయణయై యుండెను. ఈసమాచారమును వినఁగానే భీష్ముఁడా హలుక మహారాజు పుత్త్రుఁడగు నుగ్రసేనుని తమ్ముఁడు దేవకుని సమీపమునకుఁబోయి విదురునికొఱకాతని పుత్త్రిక నడిగెను.

అంత నా దేవకుఁడానందమును బ్రకటించుచు సుందరియు సుకుమారియు, సర్వలక్షణ సంపన్న యునగు నాకన్యను భీష్మునకొసంగెను ఆతఁడాపిల్లనుగైకొని తననగరమునకువచ్చి ఆమెను విదురునకొసంగి వివాహమొనర్చెను. దేవకుఁడు దేవకి మొదలగు నేడ్గురు కన్యలను వసుదేవునకొసంగి వివాహమొనర్చెను. దేవకీగర్భమునుండి శ్రీకృష్ణచంద్రుఁ డవతరించినాఁడు, ఈసంబంధమున విదురుఁడు భగవానునకు మేనమామ కాఁ గ లఁ డు.

ఈవిధముగ ముగ్గురుసోదరులకును వివాహములయ్యెను కాలాంతరమున ధృతరాష్ట్రునకు నూర్గురు పుత్త్రులును, నొక్క పుత్త్రికయును గలిగెను

అంత శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! ధృ త రా ష్ట్ర మహారాజునకు నూర్గురు పుత్రులెట్లుద్భవించిరి? నూరుసంవత్సరములలో నూరుగురా? లేక పదిపదియా, యిద్దరుగురా?"

అవ్వి సూతుఁడిట్లనెను.- "నూటికి నూఱుమందొక్క సారియే, స్వామీ!"

అంత శౌనకుఁడిట్లనెను:- "అదెట్లు? సూతా! ఈకథను మాకుఁ జెప్పుము."

సూతుఁడిట్లనెను:- "వినుఁడు స్వామీ! ధృతరాష్ట్రుని భార్య గాంధారి మహాపతివ్రత. ఒకదినమున వేదవ్యాసుఁడు గాంధారికతిథి యయ్యెను. గాంధారి నాతని కత్యధికముగ స్వాగత సత్కారము లొనర్చెను. ఆమె సేవకు సంతుష్టుఁడై వ్యాసుఁడామెతో నిట్లనెను:- "అమ్మా! నీయెడలఁ బ్రసన్నుఁడనైతిని. నీవుసన్నదైన వరమును గోరుకొనుము"

గాంధారి చేతులను జోడించుకొని యిట్లనెను:- "స్వామీ! నాకు నూర్గురు కొడుకులు కలుగవలయును."

వ్యాసుఁడ 'తథ్యమగుఁగాక!' యని ఆతఁడు వెడలిపోయెను కాలాంతరమున గాంధారి గర్భవతియయ్యెను. తొమ్మిది నెలలయ్యెను, పదిగడిచెను. ఒక సంవత్సరము గడిచెను. ప్రసవ లక్షణములేవియును లేకుండెను. గాంధారికి గొప్పచింత కలిగెను. నెలనెల గడచుచు మరల నింకొక సంవత్సరము గడిచెను. అయినను బ్రసవచిహ్నము లేవియును గనఁబడలేదు. ఇంతలోనే అరణ్యమందు కుంతికొక పుత్రుఁడుదయించినాఁడను సంగతిని వినెను. ఇప్పుడామెకు గొప్పయీర్ష్యకలిగెను. నా

తోడుకోడలు పుత్రవతియైనది. పెద్దదాననయ్యు నాకొక్క పుత్రుఁడును లేఁడు. రెండు సంవత్సరములనుండి యీ గర్భమును బొట్టలోఁబెట్టుకొని తిరుగుచున్నాను అయినను నిది పెరుగుటయు లేదు, బయటకును వచ్చుటలేదు నా కడుపులోని కే భూత, ప్రేతరాక్షసి వచ్చినదో కదా? అని యాలోచించుకొనఁగా నామెకుఁ గోపము వచ్చెను. ఆమె గర్భస్థ బాలకుని చేతితోఁ బాదుకొని బయటకుఁదీసెను ఒకమాంసపిండముదయించెను. దానికి చేతులు, కాళ్లు, తల. మొండెమేమియును లేకుండెను. ఆమె దాసితో నిట్లనెను:- "ఈ మాంసపిండమును బయటఁ బారవేసిరమ్ము"

దాసి బయటఁ బారవేయఁ బోవుచుండఁగా వ్యాసభగవానుఁడచ్చటఁ బ్రత్యక్షమయ్యెను. అతఁడు దాసినాపి యిట్లనెను:- "ఆగుమాగుము" దాసి ఆగెను వ్యాసభగవానుఁడు గాంధారి కడకుఁబోయి 'సుబలపుత్రీ! ఏమిసమాచార' మని యడిగెను.

గాంధారి యిట్లనెను:- "ఏమిస్వామీ! నూర్గురు పుత్రులుదయించినట్లు మీరిచ్చినవర మేమి? ఇసుముతో సమానముగ నుండు మాంసపిండమెక్కడ? ఇదైనను నిప్పటికి పుట్టినదే కాదు. నేను బలవంతముగ దీనిని బయటకుఁదీసితిని."

వ్యాసుఁడిట్లనెను:- "అమ్మా! నేనెగతాళికైనను నబద్ధ మాడలేదు నీకుతప్పక నూర్గురు పుత్రులుదయించిరి. కానినీవీర్ష్యా

వశమునఁ దొందఱపడితివి. ఇదియింకను రెండు సంవత్సరములు కడుపులోనుండవలసినది- అగుగాక! ఏమియును ఫరవాలేదు. నీవు దీనినొక పాత్రలోనుంచి చన్నీటిచే నిత్యమును దడుపు చుండుము. కొలఁది దినములలో నిది దానికదియే నూఱు ముక్కలు కాఁగలదు. దానిలోనుండి ఒక్కొక్క దానినిఁదీసి నేతితోనిండిన పెద్దకుండలోఁబెట్టి నీవు దానిమీఁద మూఁతను బెట్టవలయును. రెండు సంవత్సరములవఱకు నీవు దానినిఁ దెఱువవలదు. ఎన్నికుండలున్నవో వానిలోనుండి ఒక్కొక్క పుత్రుఁడుదయించఁగలఁడు. ఈసారి నాయాజ్ఞానుసారము పని చేయవలెను''

గాంధారి యిట్లనెను:- "స్వామీ! సరియే"

ఇదివిని వ్యాసభగవానుఁడు వెంటనే అచ్చటనే అంతర్ధానుఁడయ్యెను. గాంధారి పెద్దపెద్దకుండలందుఘృతమును నింపించెను ఒక దినమున నతాత్తుగ నంగుష్ఠప్రమాణముగలనూఱు మాంసపుముక్కలుగనయ్యెను. గాంధారి వానినిఁ జాల సావధానముగ దాసిచే ఘృతఘటము లందుంపించెను ఆసమయమున నామె మనస్సునందు నాకొక్క పుత్రిక యుండినఁ గన్యాదాన మొనర్చుకొందును స్త్రీలకల్లుఁడు మిక్కిలి ప్రియముగ నుండుననుకొనెను ఇంతలోనే దాసివచ్చి యిట్లనెను:- "నేను నూఱుకుండలలో నీమాంసఖండముల నన్నిటినుంచితిని అయినను నింకొకటి మిగిలియున్నది."

గాంధారి యిట్లనెను.- "దీనినిగూడ నొక ఘృతభరిత మగు బిందెలోనుంచి దానిమీఁద మూఁతనుబాగుగాఁబెట్టుము దాది అట్లేచేసెను.

రెండు సంవత్సరములైన తరువాత మొదటి ఘటము తెఱువఁబడెను. దానిలోనుండి ఒకపెద్ద హృష్టపుష్టముగల బాలకుఁడుత్పన్నమయ్యెను ఆతనికి దుర్యోధనుఁడను పేరు పెట్టఁబడెను. తదనంతరము క్రమక్రమముగా నొక్కొక్క దినము మీఁదట నింకొకటిగ సమస్తఘటములును తెరువఁబడెను. వానిలోనుండి నూర్గురు పుత్రులును దుస్సలయను నొక పుత్రికయును నుద్భవించిరి. దుస్సలను జయద్రథున కొసంగి వివాహమొనర్చిరి. ఈదుర్యోధనాదులు గొప్ప బలవంతులు, అభిమానులు. వీరికి పుత్రులుకలిగిరి వారందఱును మహాభారత యుద్ధమున మడసిరి. అందువలన ధృతరాష్ట్రుని వంశము తరువాత జరుగలేదు ఇప్పుడు నేను పాండువంశవర్ణన మొనర్చెదను.

పాండుమహారాజు గొప్ప మృగయాప్రేమి. ఈతనికి రాజ్యసుఖభోగములు రుచింపలేదు. ఆతఁడు తనరాజ్యమును దనయన్నయగు ధృతరాష్ట్రునకు స్వాధీనమొనర్చి, తనభార్యల నిద్దరను వెంటఁబెట్టుకొని పర్వతములకుఁ బోయెను. ఈతఁడచ్చట బదరీనారాయణము సమీపముఁగలపర్వతశిఖరములందానందముతో విహరించుచుండెను. అచ్చటనాతఁడొక శివుని

స్థాపించెను. అది నేటికిని బదరీనారాయణముక్రింద పాండుకే శ్వరమను పేర విఖ్యాతినిఁ జెందెను. దానికి పైననున్న పర్వత మున కేడు శిఖరములు కలవు. దేవతలు నిర్మించిన నొక హిమ కుండము కలదు. లోకపాలురచే నిర్మించినదగుటచే దానికి లోక పాలతీర్థమనుపేరఁ బ్రఖ్యాతినిఁ జెందెను. పాండురాజు శాప వశమునఁ దాను స్వయముగ సంతాన ముత్పన్నమొనర్చుట కసమర్థుఁడయ్యెను. అతఁడు దేవతలచేఁ దన యిద్దరు భార్యల యందు నైదుగురు పుత్రులను బుట్టించెను.

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:— "సూతా! పాండుమహా రాజు నెవరు శపించి సంతానోత్పత్తి చేయుట కసమర్థునొనర్చి నాఁడు? దేవతల వలనఁ గుంతీమాద్రులెట్లు పుత్రుల నుత్ప న్నము కావించిరి"

అంతసూతుఁడిట్లనెను:— "స్వామీ! వినుఁడు. ఒకసారి పాండురాజు వనమునకు వేటకై పోయి అచ్చట నొకమృగ మాడుమృగముతో సంగమమొనర్చుటను గాంచెను. మహా రాజు దాగి రెండుబాణములను దీసికొని వానినిగాయపఱచెను బాణము తగులఁగానే అవి వికలులై భూమిపైఁబడెను. ఆ సమ యమున మృగము మానవవాక్కులతో నిట్లనెను:— "రాజా! నీవు నన్నుఁగొట్టి ఘోరపాపమొనర్చితివి. మేము వాస్తవ మున మృగములముకాము కిందముఁడను ఋషిని. యోగ బలమున మృగినైన నాపత్నియందు గర్భాదాన మొనర్చు చున్నాను."

రాజు వినయముతో నిట్లనెను:- "స్వామీ! మీరు ఋషులని నాకు దెలియలేదు"

మృగమిట్లనెను:-"మృగమునైన నిట్లుదాగి కొట్టరాదు

రాజిట్లనెను:- "స్వామీ! మృగయా నియమములందిది లేదు పశువు అసావధానముననున్నను, నిద్రించుచున్నను, పరుండినను, రాజు దానినిఁ జుట్టుముట్టియు, దాగియు, మోసగించియు, నెట్లయినను జంపవచ్చును."

మృగమిట్లనెను:- "చూడుఁడు. మైథున సమయము ప్రాణిమాత్రున కత్యంత హితకరమును, సుఖకరమును ప్రియమైనదై యుండును. దానికి విఘ్నమొనర్చినవారికి పాపము సంభవించును. నేను సంతతి కొఱకు నాభార్యయందు గర్భాదాన మొనర్చుచున్నాను. మాయభిలాష యింకను బూర్తి కానేలేదు ఇంతలో నీవు మధ్యలోవచ్చి మా యానందమును నశింపఁజేసినావు నీవు మృగరూపముననున్న మమ్ముఁగొట్టితివి కావున నీకు బ్రహ్మహత్యాదోషము రాదుకాని నీవును నీ భార్యతో మైథునకర్మ మొనర్చినప్పుడు నీకును నీస్థితి యేకలిగి, తత్క్షణము మరణింపఁగలవను శాపము నొసంగుచున్నాను నీ పత్నియును మృగివలె నీతో సహగమన మొనర్పఁగలదు" ఇట్లు శపించి మృగరూపమును ధరించిన నాఋషియును, నాతని పత్నియును స్వర్గస్థులైరి రాజునకు దీనివలన దుఃఖము కలిగెను. ఆతఁడు స్త్రీసంగమమును శాశ్వతముగఁ ద్యజించెను.

పాండురాజునకు మృగవాక్యములచే గొప్ప వైరాగ్యము కలిగెను ఆతఁడు రాజ్యమునువీడి యిద్దరు భార్యలను వెంటఁగొని లోకపాల పర్వతమునకుఁ బోయెను. అచ్చటమునుల వలనఁ బుత్రులులేనివారికి స్వర్గములేదనియుఁ, బితరులు దుఃఖితులనియు వినెను. అప్పుడు మహారాజునకు వనమందుఁ బుత్రేచ్ఛకలిగెను తాను స్వయముగఁ బుత్రోత్పన్నము కావింపఁజాలఁడు. ఆతఁడు కుంతితో ఋషులద్వారా పుత్రులను గనుమని చెప్పెను. కుంతి దానికంగీకరింపలేదు. అప్పుడామె దుర్వాసఋషి బాల్యకాలమున నొసంగిన దేవహూతి విద్యవిషయమై చెప్పెను.

ఇదివిని యానందించుచుఁ బాండుమహారాజు కుంతికి దేవతలను బిలుచుట కనుమతించెను. పతి యాజ్ఞననుసరించి కుంతి క్రమముగ ధర్మ, వాయు. దేవేంద్రుల నాహ్వానించెను ఆదేవతలువచ్చి యోగమూర్తులను ధరించి కుంతికి గర్భాదాన మొనర్చిరి. దీనివలనఁ గ్రమముగనామె గర్భమున యుధిష్ఠిర, భీమార్జునులను ముగ్గురు పుత్రులుదయించిరి.

ఇట్లయినను మహారాజు మరల నేదేవతలనైనఁ బిలిచి యింకను బుత్రులను గనుమనెను. అంతఁగుంతి యిట్లనెను:- "మహారాజా! ఆపత్కాలమందైనను ముగ్గురు పుత్రుల కు మించి కనఁగూడదు. తన పతిచే నెందఱు పుత్రులనైనఁ గన వచ్చును. ఇప్పుడు నేనన్యదేవత నెవరిని నాహ్వానింపను."

అప్పుడు మహారాజిట్లనెను:- అయితే, యీమాద్రి కొఱకైనను నేదేవతనైన నాహ్వానింపుము."

కుంతి మాద్రికిఁజెప్పెను మాద్రి అశ్వినీకుమారుల నాహ్వానించెను. వారివలన నామెకు బరమ రూపవంతులగు నకుల సహదేవులను నిద్దరు పుత్రులుదయించిరి. ఈవిధముగ బంచపాండవుల జననము పాండులేశ్వరమునకుఁబైన లోకపాల పర్వతముమీఁద జరిగెను. ఇప్పటికిని నచ్చట పాండవుల పేరుతోఁ జాలపర్వతములు వాగులు, గ్రామములు, చెఱువులు, శిలలు ప్రసిద్ధినిఁజెందియున్నవి. హిమాలయమందు, విశేషించి గంధమాదన పర్వత నికటమున, నడుగడుగునకును బాండవుల స్మృతిచిహ్నములు దృష్టిగోచరములగు చుండును. పంచపాండవులను గాంచి పాండురాజు పరమ ప్రముదితుఁడయ్యెను క్రమక్రమముగ బాలకులు వృద్ధినిఁబొందసాగిరి. ఆ బాలకులు ఋష్యాశ్రమములందే యుత్పన్నమైరి. ఋషులే వారికి జాతకర్మాది సంస్కారముల నొనర్చిరి. చూచుటకు వారు దేవకుమారులవలెను, ఋషిపుత్రులవలెఁ గనబడు చుండిరి.

లోకపాల పర్వతము ప్రపంచమున నన్నిటికంటె రమణీయమగు స్థానము. దానిప్రక్కన వందలకొలఁదిపుష్పములు వానికవియే యుత్పన్నమగుచుండును. ప్రకృతిదేవి అచ్చట తెఱవేయదు, ఏలననఁగా నది జనశూన్యమగు నేకాంత స్థానము

ఋతురాజనగు వసంతమందు శోభాదేవి అచ్చట షోడశ శృంగారము లొనర్చుకొని విహరించుచుండును. ప్రకృతినర్తయై నృత్య మొనర్చును. వనశ్రీ హర్షముచేఁ బుష్పించును. సాల, తాళ, తమాల, రసాల, పనసాది పెద్దపెద్ద వృక్షములచ్చట కావలివాండ్రవలె నలంకరించుకొని నిలుచుండును. భ్రమరములు ఝుంకారఝుంకారము చేయుచు గాన మొనర్చుచుండును. అదిభూతలస్వర్గము లోకపాలురచ్చటికి నిత్యమును విహరించుచుందురు. అచ్చటచ్చట రంగురంగుల మెట్టతామరలు వికసించియుండును. హిమకుండము దేవనిర్మితమైనది. నేఁటికిని దానియందిట్టి స్వచ్ఛతకలదు ఒక్కతృణమైనను దానిలోనుండదు.

పాండురాజున కాస్థానమత్యంత రుచికరముగనుండెను. ఇప్పుడు ప్రతి సంవత్సరమువలె వసంతమువచ్చెను. పాండురాజు తనచిన్నభార్యయగు మాద్రితో వనవిహార మొనర్ప నెడలెను. సాధారణముగఁ గుంతియును వారివెంటనుండెడిది కాని ఆదినమున దైవయోగమునఁ గుంతి పిల్లలను సవరించుచుండెను మాద్రియొంటరిగా మహారాజు వెంటనుండెను

మాద్రి అత్యంతసుందరి. ఇంకనుయువతి. నిరంతరము పర్వత ప్రాంతములందుండుటచే నామె సౌందర్యమింకను నినుమడించెను, ఆమె పర్వతప్రాంతములోనిదే. ఆదినమున నామె పుష్పములతో నలంకరించుకొనెను. శుభ్రమగు సన్నని పట్టు చీరెనుగట్టుకొని ఆమె సాక్షాద్రతీదేవివలె నుండెను. మహా

రాజామెతో వక్షోభను గాంచుచు నటునిటుఁ దిరుగుచుం డెను. వెంటనే ఏకాంతమునుబొంది ఆతనికిఁ గామవాసన ఉద్దీప్తమయ్యెను. వెంటవెంటనే తిరుగుచుండిన మాద్రీరూపము ఘృతమందగ్ని కార్యమొనర్చెను. మహారాజుకు నిలువఁజాల పోయెను. మాద్రి ఋషిశాపమును జ్ఞాపకమొనర్చెను. ఎంతో అనునయవినయము కావించెను. కాదని బలవంతముగఁ ద్రోచి వైచెను. ధర్మరహస్యము నెఱుకపరచెను, కాని అన్నియును వ్యర్థములయ్యెను! కామవేగము విచారశీలుఁడగు రాజు బుద్ధిని భ్రష్టము కావించెను. పరిణామమేది జరుగవలయునో అదియే జరిగెను. మహారాజా క్షణముననే మరణించెను. మాద్రి పడి పోయి కుంతినిఁ బిలిచెను. కుంతి పరువిడివచ్చి యేడ్వసాగెను.

కుంతి తాను సహగమన మొనరింతుననెను; కాని మాద్రి యిట్లనెను:- "నీవు పెద్దదానవు. నేను జిన్నదానను. నామూలమున మహారాజు మరణించినాఁడు. కావున నన్నే సహగమనమొనర్పనిమ్ము." కుంతి ఆమెప్రార్థన నంగీకరించెను. మాద్రి తనపుత్రుల నిద్దరను గుంతికప్పగించి, పతితోఁగూడ సహగమనమొనర్చెను ఆదినమునుండి కుంతి ఆయైదుగురను దనపుత్రులుగనే భావించుచుండెను. ఆయైదుగురును దామొ కటతల్లి బిడ్డలుగనేయుండిరి. ఋషులాపుత్రులతోఁ గూడిన కుంతిని హస్తినాపురమునకుఁజేర్చిరి దేవవ్రతుఁడగు భీష్ముఁడా యైదుగురను బుత్రులవలెఁ భావించుచుండెను. ధృతరాష్ట్రుని

నూరుగురు పుత్రులును, పాండురాజు యొక్క ఐదుగురు పుత్రులునుగలసి ఆడుకొనుచుండెడువారు. చివరకు రాజ్యముకొరకై ద్దరకును పోట్లాటవచ్చెను. ధృతరాష్ట్రుని పుత్రులు దుర్యోధనాదులు మేము పెద్దవాని పుత్రులము రాజ్యాధికారము మావనుచుండిరి పాండవులిట్లనిరి:- "మీ తండ్రి యంధుడగుటచే రాజ్యాధికారము లేనేలేదు. కావున మీకెట్లు రాఁగలదు! రాజపుత్రులమగుటచే మాకే రాజ్యాధికారము కలదు. చివరకీవిషయమున మహాభారతయుద్ధము జరిగెను ధృతరాష్ట్రుని పుత్రులందఱును, పౌత్రులును నామహారణమున మడసిరి. శ్రీమన్నారాయణుని కృపచేఁబంచపాండవులు మిగిలిరి. వారికినిఁ జాలమంది పుత్రులుకలిగిరి. వారందఱును యుద్ధమందుఁజంపఁబడిరి. కేవలము అభిమన్యుని భార్యాగర్భమునఁ బరీక్షిత్తు మిగిలెను ఆతనివలననే పాండవ వంశమునిలిచెను. మునులారా! ఇప్పుడు నేనుమీకు పాండవ పుత్రుల కథలను జెప్పెదను! మీరు దత్తచిత్తులరై శ్రవణముచేయుఁడు"

—(౦)—

# ద్రౌపదివలన పంచపాండవుల కైదుగురు పుత్రులు.

(౭౯౧)

శ్లో॥ ద్రౌపద్యాం పంచపంచభ్యః పుత్రాస్తే పితరోఽభవన్
యుధిష్ఠిరాత్ప్రతి వింధ్యః శ్రుతసేనో వృకోదరాత్॥
అర్జునాచ్ఛ్రుతకీర్తిస్తు శతానీకస్తు నాకులిః॥
సహదేవ సుతో రాజచ్ఛ్రుతకర్మా తథాపరే॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౨ అ ౨౭-౨౯ శ్లో

వ. అయ్యేవురకును ద్రుపదరాజ పుత్రియైన ద్రౌపది యందుఁ గ్రమంబునం బ్రతివింధ్యుండును, శ్రుతసేనుండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతకర్ముండును నన నేవురు పుట్టిరి;

శ్రీమదాంధ్ర భాగవతము

ధర్మతత్త్వజ్ఞులును, త్రికాలదర్శులునగు మహాపురుషులు భూతభవిష్యద్విషయముల నాలోచించియే యేసంఘటనము విషయమునైనను నిర్ణయించుచుందురు. మనముండి ఆ మునుప్రారబ్ధాధీనులమై సమస్తకార్యము లొనర్చుచుందుము. మనకెవరితోనైనను సంబంధముండిన నదిఅప్పుడే సంభవించిన దనిభావించెదము కాని అట్టిసంబంధము పూర్వజన్మ సంఘటనలవలన జరుగుచుండును.

సూతుఁడిట్లనెను:— "మునులారా! ఇప్పుడు నేను పాండవ వంశవర్ణన మొనర్చెదను. పాండవులు కొంచెము పెద్దవారు కాఁగానే దుర్యోధనాది కౌరవులకు వారియెడల స్వాభావిక ద్వేష మొనర్చుచుండెను. దుర్యోధనుఁడు తన దుష్టసోదరులతోడను, మంత్రులతోడను నాలోచించి వారణావతమందొక లక్కయింటిని నిర్మింపఁజేసి, దానిలోఁ గుంతితోఁ గూడిన పాండవులను దగుల్పెట్టుటకు పన్నాగము నుబన్నెను. వారు నిద్రించుచుండగా నాతఁడు దూతలు దానికగ్ని నిఁబెట్టిరి. విదురుని కృపచేఁ బాండవులొక సొరంగము ద్వారా సురక్షితముగ వనమునకు వచ్చి, వారు భిక్షాటన మొనర్చుచు సమయముకొఱకు ప్రతీక్షించుచుండిరి. ఆసమయమున వారు ద్రౌపదీ స్వయంవరమును గూర్చి వినిరి! ఆకాశమున వ్రేలాడఁగట్టఁబడి, తిరుగుచుండిన మత్స్యయంత్రమును బాణముతోఁ గొట్టినవారికి ద్రౌపదినిచ్చెదమనిరి. అర్జునుఁడా లక్ష్యమును గొట్టెను. అందువలన ద్రౌపది ఆతనితో వెడలిపోయెను. కుంతి ఒకకుమ్మరివానియింటనుండెను. పాండవులు ద్వారమునందుండఁగనే యిట్లనిరి:— "అమ్మా! నేడు మేము మంచి సుందరభిక్షను దెచ్చితిమి!,,"

కుంతి లోపలనుండి యిట్లనెను:— "సరేనాయనా! దానిని మీరైదుగురును బంచుకొనుఁడు."

ఇప్పుడామె ద్రౌపదినిఁ గాంచి, దుఃఖించి, యిట్లనెను:— "నాయనా! నామాటలు మిథ్యలు కానీయకుఁడు. మీరైదు

గురును నీకుమారిని వివాహమాడుదురు." ఈ విషయమును ధర్మరాజు సమర్థించెను; కాని ద్రుపద, ధృష్టద్యుమ్నాదులు విరోధించిరి. చివరకు వ్యాసభగవానుడు వచ్చి ద్రుపదునితో నిట్లు చెప్పెను:- "రాజా! నీకిష్టమున్నను లేకున్నను భవితవ్యత అట్లున్నది. ద్రౌపదికైదుగురు పతులగుదురు! చాల జన్మల క్రిందట నీమెయిట్టివరమును బొందినది. పూర్వజన్మమున నీమె యొక ఋషికన్యక. ఈమెకనురూపుడగు పతి దొరకలేదు. అందువలననామె తపస్సుతో శివునారాధించెను. ఆశుతోషుడగుశంకరుడు ప్రసన్నుడై, యామెసమ్ముఖమున ప్రత్యక్షమై వరమునడుగుమనెను:- "నాకు యోగ్యుడగు వరునొసంగుము. వరునొసంగుమని వ్యగ్రతతో శివునితో నైదుసార్లనెను.

ఈసారి శివుడిట్లనెను:- "భద్రా! నీవైదుగురు వరులను గోరితివి. కావున నీకైదుగురు పతులగుదురు. అయినను నీవు దోషభాగినివి కావు. నీవుపతివ్రతలలో నెన్నబడుదువు!"

వ్యాసుడు ద్రుపదునకు నచ్చజెప్పుచు నిట్లనెను:- "రాజా! ఆకన్యయే నీకగ్నియందుత్పన్నమైనది. ఈమె అయోనిజ. కావున నైదుగురుపతులున్నను దోషమంటదు."

ఇంకొక సంఘటనము కూడకలదు. ఒకసారి దేవేంద్రుడు గంగలో కొట్టుకొని పోవుచుండిన కమలపుష్పమును గాంచెను. ఉత్సుకతావశమున నింద్రుడు యుద్గమస్థానమును

జూడఁబోయెను. వెడలి వెడలి ఆతఁడు చాలదూరమేఁగెను. పైకిఁబోయిచూడఁగా నొక స్త్రీ కూర్చుండి యేడ్చుచుండెను ఆమెకంటినుండి జారినకన్నీరు సువర్ణకమలములగుచుండెను. దీనినిఁగాంచఁగనే దేవేంద్రునకు దయకలిగి ఆమెనిట్లడిగెను:- “భద్రా! నీవేల నేడ్చుచున్నావు?”

ఆమె యిట్లనెను:- “నీవు నావెంటరమ్ము. నేనుదీనికిఁగారణముఁజెప్పెదను.” ఇట్లుపలికి ఆమె ముందుముందుగా నడువసాగెను ఇంద్రుఁడామె వెనువెంటఁబోసాగెను. కొంతదూరమునకుఁబోయి నాతఁడొక గుహాలోనొక బలిష్ఠుఁడగు పురుషునిఁగాంచెను. ఆతఁడింకొక స్త్రీతో మనోవినోదముకొఱకు కొంత క్రీడయొనర్చుచుండెను. ఇంద్రునిఁగాంచి ఆపురుషుఁడింద్రుని వైపునకుఁ జూడకయే తన ప్రియురాలితో నాడుచుండెను. ఇంద్రుఁడా పురుషునవమానించెను. అప్పుడా పురుషుఁడాతని నొక గుహలోనికిఁగొనిపోయి బంధించెను ఆ గుహయందిట్టి దివ్యులు నల్వురిదివఱకే బంధింపఁబడిరి ఇంద్రుఁడిప్పుడు భయభీతుఁడయ్యెను. ఈతఁడు దేవదేవేశుఁడగు వృషభధ్వజుఁడని ఆతఁడు తెలిసికొనెను. అందువలన నాతఁడు గడగడవణఁకసాగెను. ఇంద్రునివిపత్తిని విని పార్వతీపతియిట్లనెను:- “దేవేంద్రా ఈనలుగురును నింద్రులే. నీవు నన్నవమానించితివి. కావున మీరైదుగురును భూమిపై మనుష్యులరై పుట్టవలసి యున్నది. ఈమె మీకందఱకును భార్యకాఁగలదు.”

అప్పుడా ద్రౌపది యిట్లనెను:- "ప్రభూ! నేను భూమి పైఁబుట్టవలసి యుండినచో ధర్మ, వాయు, ఇంద్ర, అశ్వినీ కుమారుల వలనఁబుట్టవలయును."

శివుఁడిట్లనెను:- "అట్లేయగుఁగాక! ఈ నూతన దేహం ద్రుపదు సాకెముక్తుఁగఁ బ్రకటమై కాక నా యంశచేఁ బుట్టఁగలఁడు. మీరు నలుగురును నింద్ర, ధర్మ, వాయు, అశ్వినీ కుమారులు ద్వారా నుత్పన్నము కాఁగలఁడు."

వ్యాసుఁడు ద్రుపదునితో నిట్లనెను.- "రాజా! ఈ పాండవులైదుగురే ఆపంచపాండవులు. ఈమె ఆదేవియే. ఈమెకీయైదుగురే యైదుగురు భర్తలగుదురు"

వ్యాసుఁడీవిధముగ వ్యవస్థనొనర్చిన తరువాత, దివ్య దృష్టితోఁ బాండవులయొక్క యింద్రరూపమును జూపించెను. అప్పుడు ద్రుపదుఁడు ద్రౌపదినిఁ బంచపాండవులకిచ్చి వివాహ మొనరించెను. ద్రుపదునికడ వివాహమైనమీఁదట నందఱును జెప్పఁగా ధృతరాష్ట్రుఁడర్ధరాజ్యమును బాండవుల కొసంగెను. ఆయైదుగురును నింద్రప్రస్థమును దమ రాజధానిగాఁ జేసికొని యుండిరి.

ధర్మరాజగు యుధిష్ఠిరుని సభకు నారదుఁడువచ్చి యిట్లనెను:- "రాజా! మీయైదుగుర కొక్కతెయే భార్యకావున మీరు నంతులుగాఁ జేసుకొనుఁడు. ఒక్కతిలోత్తమ కొఱకు సుందోపసుందులు పోరాడుకొని చివరకిద్దరును జచ్చిరి.

నారదోపదేశమును మన్నించి పంచపాండవులు ప్రతి వాఁడును నియమిత సమయము వఱకు వంతులువారిగా ద్రౌపదీసమీపమున నుండవలయునని నిర్ణయించు కొనిరి. సోదరులలో నెవఁడైన నేకాంతముగ ద్రౌపదీ సమీపమున నుండఁగా రెండవవాఁడు పోయినచో నాతఁడు పండ్రెండువత్స రములు వనవాస మొనర్పవలయును. ఒకసారి యుధిష్ఠిరుఁడు ద్రౌపదితో నేకాంతమున నుండఁగా నర్జునుఁడు గోబ్రాహ్మణ సంరక్షణార్థమై తన ధనుర్బాణములను గొనుటకు భవనము లోనికిఁ బోవలసివచ్చెను. దీనికిఁ బ్రాయశ్చిత్త రూపమున నాతఁడు పండ్రెండు సంవత్సరములు వనవాస మొనర్చెను.

కాలాంతరమందు నాయైదుగురవీర్యముచే ద్రౌపది యందు నైదుగురు పుత్రులుదయించిరి. యుధిష్ఠిరుని వలనఁ బ్రతివింధ్యుఁడును, భీమసేనునివలన శ్రుతసేనుఁడును, అర్జునకుఁ బరమ పరాక్రమవంతుఁడగు శ్రుతకీర్తియును, నకుల సహదే వులవలన శతానీక, శ్రుతకర్ములను వారును నుదయించిరి. ఈ విధముగ ద్రౌపదికైదుగురును ప్రియపుత్రులైరి. వీరు ద్వా రకలోనుండి అస్త్రశస్త్ర విద్యలను నేర్చుకొనిరి. వీరువివాహ యోగ్యులు కాఁగానే భారతయుద్ధమువచ్చెను. దానిలో వీరై దుగురును మిక్కిలి వీరత్వముతోఁ బోరాడిరి. మహాభారత యుద్ధాంతము వఱకును వీరుబ్రదికియుండిరి.

చివరకు గురుపుత్రుఁడగు నశ్వత్థామ నిద్రించుచున్న సుకుమార రాజకుమారుల నందఱను బశువులనువలె వధించెను. అతఁడు కౌరవులనువలెఁ బాండవులనుగూడ వంశనాశనమొనర్చెను. కావున భగవానుఁడు పాండవ వంశమును రక్షింపనలంచియుండెను. అందువలన నర్జునుని ద్వితీయపత్నియగు సుభద్రా కుమారుఁడగు నభిమన్యుని భార్యగర్భవతియైయుండెను. ఆతని వలననే పాండవుల వంశము నడిచెను

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! పాండవులకు ద్రౌపది గాక యెందఱుపత్నులుండిరి? వారికెందఱు పుత్రులు? ఈ ప్రసంగమును గృపతో మాకుఁ జెప్పవలయును."

సూతుఁడిట్లనెను:-"స్వామీ! ఇప్పుడు నేను పాండవుల అన్యపుత్రుల కథలను మీకుఁజెప్పెదను. మీరు శ్రద్ధాసహితులై శ్రవణమొనర్పుఁడు."



# పాండవుల యితర పుత్రులు భీమునకు ఘటోత్కచుఁడు.

(౭౯౨)

శ్లో॥ యుధిష్ఠిరాత్తు పౌరవ్యాం దేవకోఽథ ఘటోత్కచః।
భీమసేనాద్ధిడింబాయాం కాల్యాం సర్వగతస్తతః॥

శ్రీభాగ. ౯ స్కం. ౨౨ అ. ౩౦ శ్లో॥

వ. మఱియు యుధిష్ఠిరునకుఁ బౌరవతియందు దేవకుండును. భీమసేనునికి హిడింబయందు ఘటోత్కచుండును గాళియందు సర్వగతుండును (బుట్టిరి)

శ్రీమదాంధ్ర భాగవతము

ఒక పురుషుఁడనేక వివాహములనొనర్చుకొనుట ప్రాచీనాచారము రాజులకు వేలకొలఁది రాణులుండెడివారు. అప్పుడట్టి శక్తి సామర్థ్యములును నుండెడివి. వివాహమొనర్చుకొనుట ఒక పరమ ధర్మముగ నెన్నఁబడుచుండెడిది ధర్మపూర్వకముగనే కామోపభోగము లొనర్పవచ్చును కామవశుఁడయి రాజు వివాహమొనర్చుకొనెడువాఁడు. కాని విద్వాంసులలో వారి ప్రశంస యుండదు ధర్మపూర్వకముగ వివాహమాడిన భార్యకుఁ బుట్టినపుత్రుఁడే తండ్రికి ఉత్తరాధికారి కాఁగలఁడు. ధర్మహీనమగు కామమే వ్యభిచారము.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ద్రౌపది పంచపాండవుల భార్య. ద్రౌపది కాక యీయైదుగురు సోదరులకును బత్నులుకలరు. యుధిష్ఠిర మహారాజునకుఁ బౌరవియను భార్య కలదు. ఆమెగర్భమున దేవకుఁడను బుత్త్రుఁడుదయించెను. భీమసేనునకుఁ గాళీయను పత్నికలదు. ఆమెవలనసర్వగతుఁడను బుత్త్రుఁడుదయించెను సహదేవునకు భార్య పర్వతకన్యయగు విజయ. ఆమెవలన సుహోత్రుఁడను సుతుఁడుదయించెను. నకులునకుఁ గరేణుమతియను పత్నికి నరమిత్త్రుఁడను పుత్త్రుఁడుదయించెను. భీమసేనునకు హిడింబయను రాక్షసిపత్నికలదు. అర్జునునకు నులూపి, మణిపూరతనయా, సుభద్రా యను ముగ్గురు పత్నులుండిరి. వీరిముగ్గురిని ద్వాదశవార్షిక వనవాస సమయమునఁ బెండ్లాడినాఁడు. భీమసేనుఁడు హిడింబయను రాక్షసీ పత్నివలన ఘటోత్కచుఁడను పుత్త్రుఁడుదయించెను."

అంతశౌనకుఁడిట్లడిగెను:- "సూతా! భీమసేనుఁడు రాక్షసినేల పెండ్లాడినాఁడు?"

ఇదివిని సూతుఁడిట్లనెను:-"స్వామీ! తనతల్లి యాజ్ఞచే భీమసేనుఁడు రాక్షసిని వివాహమాడెను ఈవివాహమెట్లుజరిగినది మీకుఁజెప్పెదను."

భీమసేనుఁడన్న దమ్ములందఱిలో నధికబలవంతుఁడు. ఆతఁడు గొప్ప వ్యాయామపుష్టము కలవాఁడు. సింహస్కంధుఁడు ఆతనికి పదివేలయేనుగల బలముకలదు. ఆతఁడు తనతల్లినిసోద

రులందఱను భుజముమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని కొనిపోవు చుండెడివాఁడు. కాని పగలంతయును నడిచినదవి అలఁతయును నలసిపోయెను. తల్లియును, సోదరులును నలసిపోఁగానే వారొక చెట్టుక్రింద గాఢనిద్రను బోయిరి. కాని భీమసేనుఁడు మేల్కొని కాపలాకాయుచుండెను.

ఆవనమందు హిడింబుఁడను నొక నరమాంస భక్షకుఁ డగు రాక్షసుఁడు నివసించుచుండెను. ఆవనమాతని పేరితో డనే విఖ్యాతినిఁ జెందియుండెను. ఆవనములోని కెవరు వెడలి నను హిడింబుఁడు వానిని వెంటనేచంపి తినెడువాఁడు. నర మాంసపు వాసనరాఁగానే అతని నోటికి నీరూరెను. పెదవు లను జప్పరించుచు, నాశాభరిత దృష్టులతోఁ దల్లితో గూడ పాండవులనుగాంచి, ఆదట్టమైన వృక్షములమధ్య నొక పెద్దవృక్షము మీఁదకుఁబోయెను.

అచ్చటికిఁబోయి అతఁడు యువతియును దన చెల్లెలు నగు హిడింబతో నిట్లనెను:- "హిడింబా! ఇంతకు నాకుచాల దినములనుండి నరమాంసమును దినుటకవకాశము చిక్కలేదు. ప్రారబ్ధవశమున నేఁడె దాఱుగురు మనుష్యులిచ్చటికి వచ్చి యున్నారు వారందఱును మిక్కిలి బలిసియున్నారు. వారి చర్మమును మందముగను గోమలముగను నున్నది. నేను నా తీక్ష్ణదంతములతో నా మృదు మాంసమును బీకి కడుపార రక్తమును ద్రావెదను. వీరెవరో రాజకుమారులుగ నున్నారు.

వీరి వెంటనొక ముసలిదియును గలదు. వీరెవరో నీవుపోయి చూచిరమ్ము. అందఱును నిద్దురపోవుచున్నారు. ఒక్క బల వంతుడు మాత్రము మేల్కొనియున్నాఁడు. నీవేపోయి వారి నందఱను జంపి తీసికొనిరమ్ము. అవసరమైనచో నన్నుఁ బిలువుము.”

హిడింబ వెంటనే పాండవులున్న చోటునకుఁబోయెను. కేవలము భీమసేనుఁడొక్కఁడు కాపలా కాయుచుండెను. భీముఁడు నల్లనివాఁడైనప్పటికిని మిక్కిలి రూపవంతుఁడు. హిడింప క్రూరురాలైన రాక్షసియైనను కామమామెక్రూరత్వ మును, క్రోధమును నశింపఁజేసెను. వృషభమువలె నున్న నా భీముని(గాంచి ఆమె ఋతుమతియగు గోప్రవలెనయ్యెను. కామమామె అంగ, అంగములయందును మాదకతను గలిగించెను. ఇప్పుడామె తన యన్న చెప్పినమాటను మరచి పోయెను. తనకొరక నెఱవేరవలయునను మాయలోఁ బడి పోయెను ఆమె కామరూపిణియగు రాక్షసి. ఇచ్ఛానుసారము గఁదన రూపమును మార్చఁగలదు. ఆమెవెంటనే సంకల్ప మాత్రముచేతనే అత్యంతసుందరమగు మానవ స్త్రీరూపము నుధరించెను షోడశ శృంగారము లొనర్చుకొని, వస్త్రాభూష ణములచే సుసజ్జితయై కటి సూత్రములు, కర కంకణములు, పాదములకు నూపురములు మ్రోగుచుండ భీమసేనుని సమీ పమునకుఁబోయి అత్యంత దీన వాక్కులతో నిట్లనెను:—“ దేవా! మీ ద్వారమునకొక భిక్షుకురాలు నిలువఁబడియున్నది. మీ రామెకుఁగామభిక్ష నొసంగెదరా? ”

భీమసేనుఁడదరిపడి యిట్లడిగెను:-"సుందరీ! నీ వెవతెవు? ఈయర్థరాత్రిమున నీ విజనమగు భయంకర వనమున కేల వచ్చితివి? నావలన నీకుఁగావలసిన దేమి?"

హిడింబ యిట్లనెను:- "నరనాథా! నేను రాక్షసిని. ఈ వనము నాసోదరుఁడగు హిడింబునిది. ఇచ్చటికి వచ్చిన వార నందఱను నా సోదరుఁడు తినివేయును. మిమ్ములను దినుట కాతఁడు నన్నుఁబంపినాఁడు."

భీమసేనుఁడు గర్జించి యిట్లనెను:- "రమ్ము, తినుము నన్నుఁబట్టుకొని చూచెదను నీ రాక్షసత్వము."

హిడింబ దీనతతోనిట్లనెను:- "ప్రాణనాథా! నీవు నీ రూపమంత్రమును నాపైవిసరితివి. నేను నిన్నుఁబట్టుకొనుటకు వచ్చితిని, కాని నేనేపట్టుబడితిని. నన్ను నీవు నీ భార్యగా నొనర్చుకొనుము."

భీమసేనుఁడిట్లనెను:- "నేనింత నొడ్డును బొడవుగల భార్యను గైకొని యేమి చేయుదును?"

హిడింబ యిట్లనెను:- "నీ వెట్లుకోరిన నట్లు కాఁగలను."

భీమసేనుఁడు నవ్వి యిట్లనెను:-"నీ సర్పిణివైననో?"

హిడింబ యిట్లనెను"నరనాథా! నీవీ యబలపై దయఁ జూపుము. నాతోఁబరియాచకము లాడకుము. నా సోదరుఁడు

వచ్చినచో నాతఁడు మిమ్ములనందఱిను జంపివేయఁగలఁడు. ఆతఁడు వచ్చులోపల మీరందఱును నావీఁపుపై నెక్కి పాఱి పొండు. నేను నాయిష్టానుసారముగ రూపమును ధరింపఁగలను, ఆకాశమున నెగురఁగలను. ఎంత బరువునైనను మోసికొని పోఁగలను. మీరాలస్యము చేయకుఁడు, మీ సోదరులును, తల్లియును నాపై నెక్కవచ్చును."

భీమసేనుఁ డిట్లనెను:- "భామినీ! భయపడుటయును, బాఱిపోవుటయును నే నునేర్చుకొనలేదు నీకును నీసోదరునకును నేను భయపడువాఁడనుగాను నీవు నీసోదరునిఁ బిలుచుకొని రమ్ము."

హిడింబ యిట్లనెను:- "జీవనధనమా! నేను నాతను, మన, ధనములను సర్వస్వమును మీచరణముల కర్పించితిని. మీరంగీకరించినచో నేను మీ చరణసేవ నొనర్చెదను; త్రోసివేసినచో నేనిచ్చటనే ఆత్మహత్య నొనర్చుకొని మీ సమ్ముఖముననే ప్రాణములను వదలెదను"

హిడింబ యిట్లు చెప్పునంతలో నరమాంస లోభియగు హిడింబుఁ డాలస్యమగుటను గాంచి స్వయముగ వచ్చెను ఆతఁడు హిడింబవాక్యములను వినియుఁ, దన చెల్లెలు మానవ రూపమున నత్యంత సుందరీవేషమునఁ గాంచి క్రోధితుఁడయ్యెను, ఆతఁడు గర్జించియిట్లనెను:-"దుష్టా ! నీవు రాక్షస సదాచార మునకువిరుద్ధమగు కార్యము నొనర్చుచున్నావు. రాక్షసులుప

దేవతలు. వారు మనుష్యస్త్రీలతో సంగమము నొనర్చెదరు. కాని, తమపిల్లలకు మనుష్యులకీయరు. నీవు రాక్షసివై ఒక మానవపురుషునియందాసక్తి జెందితివా? సరియే. నేను నీ యీ క్షణమున జంపెదను. తరువాత కులకలంకిణివగు నిన్నును యమలోకమునకుం బంపెదను" అని పలికి ఆతండు భీమసేనుని మీందకుం బ్రహారమొనర్పం బరువిడెను.

భీమసేనుండు దీనికి సిద్ధముగనే యుండెను. ఇద్దరును గలియబడిరి వాండు వీనింగొట్టెను. ఈతండాతని బాదెను. ఇద్దరకును దుములయుద్ధము. దెబ్బలు, గ్రుద్దులు, తన్నులు, పరస్పరము నెట్టుకొనుట, క్రిందంబడవైచుకొనుట జరుగుచుండెను పాండవులును మేల్కొనిరి. వారెదుట దేవకుమారివలె నయ్యారముగ నిలుచుండిన హిడింబనుగాంచిరి. కుంతియిట్లనెను:- "అమ్మా! నీవెవరు?"

ఆమె యిట్లనెను" అమ్మా! నేను నీకోడలను".

కుంతి యిట్లనెను:- "ఏమమ్మా! ఈ రాత్రిలోన నీవెట్లు నాకుంగోడలవైతివి? నా యొక్క యే కుమారునకు భార్యవు?"

ఆమె యిట్లనెను:- "నేను మీ రెండవ కుమారుని భార్యను"

కుంతి భయభీతయై యిట్లనెను:- "నా యీ కుమారుం డెచ్చటకు బోయినాండు?"

ఆమె యిట్లనెను:-"అత్తగారు! నా సోదరుఁడు హిడింబుఁడను రాక్షసుఁడు. ఆతఁడే వారితోఁబోరాడుచున్నాఁడు."

ఇదివినఁగానే తల్లి యేడ్వసాగెను. అర్జునుఁడిట్లనెను:- "అమ్మా! ఎందుకమ్మా? అట్లేడ్చెదవు? నీ కొడుకును రాక్షసుఁడేకాఁడు యమధర్మరాజైనను జంపఁజాలఁడు. ఆతఁడెట్టి రాక్షసుఁడో చూతము" అనిపలికి అర్జునుఁడు వెంటనే పరుగిడెను. ధర్మరాజు, నకుల, సహదేవులును నాతని వెనువెంటనే పోయిరి. తల్లియునుపోయి అచ్చటికిఁ జేరెను. అందఱును బోయి చూడఁగా నిద్దరకును ఘోరయుద్ధము జరుగుచుండెను వనములోని వేలకొలఁది పెద్ద పెద్ద వృక్షములు విఱిగి ముక్కలు ముక్కలగుచుండెను. ఇద్దరును దీర్ఘనిశ్వాసములను విడుచుచుండిరి. భీమసేనుఁ డాతనిఁ గ్రిందకుఁ బడవైచి నలుపుచుండెను. నవ్వి అర్జునుఁడిట్లనెను:- "అన్నా! నన్నుఁగూడ సహాయమునకు రమ్మందువా?"

భీముఁడిట్లనెను:- "నీవునిలుచుండి విచిత్రమును జూచుచుండుము. నేనిప్పుడే వీని పీచమడంచెదను"

అర్జునుఁడిట్లనెను:- "పోనీయండి. ఎంతసేపు యీ చెలగాటము? నేనైనచో వీనిభరతమిదివఱకే పట్టించెడువాడను."

భీముఁడునవ్వి యిట్లనెను:- "నీవు భరతము పట్టించెడువాడవే నేనుజూడు వీనినిఁబచ్చడి చేయుచున్నాను. నీవు నా దగ్గఱకు రాకుము."

నవ్వి అర్జునుఁడిట్లనెను:- "కాదన్నయ్యా! నేను వీనిఁ జంపుటలోనే నీవు నాయము పడెదవు."

భీమసేనుఁడిది వినినవ్వి యిట్లనెను:- "చూడుమింకను, నేనిప్పుడే వీనిని యమపురమునకుఁ బంపెదను." అని పలికి ఆతఁడాతని నడుమునువిఱచి, చంపి క్రిందఁబడవైచెను."

ఇంతలో నరుణోదయ మయ్యెను. అర్జునుఁడిట్లనెను:- "అన్నా! త్వరవెడలుదము. మనలనెవరైనఁ జూచినఁజాల యనర్థము రాఁగలదు! మనము రహస్యముగ జీవితమును నడుపుకొనవలయును." ఇదివినఁగానే భీముఁడు తన నల్గురు సోదరులును, దల్లిని నెత్తుకొని తొందరగాఁబోయెను. హిడింబ యును గుఱుకుచు వారివెంటనేపోయెను.

భీమసేనుఁడిట్లనెను:- "ఏమి రాక్షసపిల్లా! నీవును మీ యన్నమార్గమునుబట్టి పోఁగలఁచినావా యేమి?"

ఇది వినఁగానే హిడింబ యేడ్వసాగెను. కాని ఆమె వెన్నంటుట మానలేదు, అప్పుడు ధర్మరాజిట్లనెను:- "భీమా! నీవీయబలను జంపవలదు ధర్మాత్ములగువారు స్త్రీలపైఁజేయి చేసికొనరు, ఈమె మనకేమి చెరుపొనర్పఁగలదు?"

భీమసేనుఁడందఱ నెత్తుకొని సూర్యాస్తమయమగు నప్పటికి చాలదూరముపోయెను. అందఱును కూర్చుండఁగనే యుధిష్ఠిరుఁనిజూచి సిగ్గుపడుచు హిడింబ కుంతికడకుఁ బోయి

యేడ్చుచు నిట్లనెను:- "అమ్మా! పురుషుల హృదయము కఠోరముగనుండును నీవు నారీహృదయము వ్యథ నెఱుంగఁగలవు. తాను ప్రేమించినవానిఁ బొందకుండిన స్త్రీ యెంతటి మహాకష్టమును బొందునో అది స్త్రీలకే తెలియఁగలదు. నీవు నీకుమారున కాజ్ఞయొసంగినచో నాతఁడునన్ను స్వీకరింపఁగలఁడు. కాకున్న నేనిప్పుడే యిచ్చటనే ప్రాణములను త్యజించెదను"

హిడింబయొక్క యీవాక్యములను వినిన కుంతికామె మీఁద దయకలిగెను. ఆమె భీమునితో నిట్లనెను:- "నాయనా నీవీమెను వివాహమాడుము."

భీమసేనుఁడిట్లనెను:- "అమ్మా! ధర్మరాజునకు వివాహముకాకున్న నేనెట్లు వివాహమాడుదును"

అంత ధర్మరాజిట్లనెను:- "నాయనా! ఇది అట్టివివాహము కాదు. ఈసమయమున మనమాపద్ధర్మమును పాలింపవలయును. పాపము ఇది ప్రాణముల కొసంగుచున్నది. ఏమియును ఫరవాలేదు నాయనా! నీవు మాయాజ్ఞచే నీమెను వివాహమాడుము."

భీమసేనుఁడిట్లనెను:- "మీ యందఱ యాజ్ఞయైనచో నేను వివాహముచు జేసికొందును కాని నేనీమెను సంతానము కలుగువఱకే నాకడ నుంచుకొనెదను."

ఈ విషయమును హిడింబ అంగీకరించెను. కుంతి యిట్లనెను:- "అమ్మా! దినమందు నీవు ఏమి నెచ్చటికైనను తీసికొనిపొమ్ము. కాని సాయంకాలమున నీమె యిచ్చటికి రావలయును" ఇదివినఁగానే హిడింబకు చాల యానందము కలిగెను. ఆమె భీమునిదనమీఁద నెక్కించుకొని ఆకాశమున కెగిరిపోయి. అచ్చట నుండి వనోపవన, గిరి గహ్వరములందు సుందర స్త్రీ రూపమును ధరించి ఆతనితో విహరించుచుఁ దిప్పుచు నానందించుచు సాయంకాలమునకు ఆతనిఁ దన యావాసమునకు జేర్చుచుండెను. ఈ విధముగఁజాల దినముల వఱకు, ఆమె పాండునందనుఁడగు వృకోదరునితో దాంపత్య సుఖముల ననుభవించుచుండెను. కొంతకాలమున కామెకు గర్భము నిలిచి, వెంటనే పెద్దశరీరముగల నొక పుత్రుఁడుద యించెను.

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! హిడింబ వెంటనే పుత్రునెట్లుకనెను? సంవత్సరమో రెండు సంవత్సరములో బాలకుఁడు గర్భమున నుండవలయును గదా?"

సూతుఁ డిట్లనెను:- "ఓ స్వామీ! రాక్షస స్త్రీలు గర్భాధారణ మొనర్పఁగానే పుత్రులను గనెదరు. వారి పుత్రులకును బెరుగుటలో నాలస్యముండదు. పుట్టఁగానే వారు యువకులగుదురు. అందువలన హిడింబ గర్భాధారణ మొనర్పఁగానే పర్వతప్రాంతమందు పుత్రునిఁగనెను. ఆ పుత్రుఁడు

మానవ పురుషుని వీర్యముచే రాక్షసియం దుత్పన్నమైనను వానిలో మానవుని చిహ్నములు లేవు. చూచుటకాతఁడు భయంకరముగనుండెను. అంజనపర్వతమువలె నాతఁడు పెద్ద శరీరముతోఁ గృష్ణవర్ణముగ నుండెను తల్లి దండ్రులిద్దరును గలిసి వానికి ఘటోత్కచుఁడను పేరును బెట్టెను. ఆతఁడు పుట్టఁగనే యువకుఁడయ్యెను చేతులుజోడించుకొని ఆతఁడు తన తల్లిదండ్రులకుఁబ్రణామము కావించి యిట్లనెను:-"అమ్మా! తండ్రీ! నేను మీకేమి ప్రియకార్యమొనర్తును?."

భీమసేనుఁడిట్లనెను:- "వత్సా! నీవు నీతల్లిని బాగుగాఁ బాలనపోషణ మొనర్పవలయును. మనుష్యులకు బాధను గలిగింపరాదు. నేను నిన్ను స్మరించినప్పుడు రానలయును"

ఘటోత్కచుఁడు తనతండ్రియొక్క యీ మాటనంగీకరించెను. అంతనాతఁడుపోయి తన నాయనమ్మయగు కుంతికిని, నల్గురు తండ్రులకును నమస్కరించెను. వారందరును పాండురాజు ప్రథమ పౌత్రుఁడగు హిడింబా నందనుఁడగు ఘటోత్కచుని శిరమును మూర్కొని, ముద్దిడుకొని ఆశీర్వదించెను.

ఈ విధముగఁదన ప్రతిజ్ఞను బూర్తి కావించుకొని భీమసేనుఁడు హిడింబా ఘటోత్కచులను వీడ్కొలిపెను అంత వారేకచక్రపురమునకుఁబోయి నివసింపసాగిరి.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! మాకొక సందేహ మున్నది. రాక్షసులు కామరూపులుకదా. వారు సదా మను ష్యరూపమున నేలనుండఁగూడదు. హిడింబ యెల్లప్పుడును సుందరస్త్రీగ నేలయుండఁకూడదు. ఆమె భీముని బ్రసన్ను నొనర్చుకొని వికరాళ రాక్షసి యేలనైనది?"

అంత సూతుఁడిట్లనెను:- "స్వామీ! సౌందర్యమున కేమియును బరిభాషలేదు ఎవరిరూపము వారికి బాగుండును. లంకను జయించి శ్రీరామచంద్రుఁడు పుష్పకమునెక్కి వచ్చు చుండఁగా మార్గమందాతనికిఁ గిష్కింధాపురి తటస్థపడెను. సీతాదేవి సుగ్రీవుని భార్యలను గలిసికొనఁదలఁచెను. పుష్ప కముదిగెను. ఏసీతకొఱకింతటి యుద్ధముజరిగి, యింతమంది ఋక్షవానరులు చచ్చిరనే అట్టిసీత యిచ్చటికి వచ్చినదని తెలి యఁగానే వానరస్త్రీలు మిక్కిలి యుత్సాహముతో జానకిని దర్శింపవచ్చిరి. జానకి రూపమును జూడఁగనే వారు మిక్కిలి యానందించి. తమలోఁదామిట్లనుకొనిరి:-"జానకి సుందరియే, కాని యీమెలో నొక్కలోపమున్నది. ఈమెకు తోఁకయుండి నచో నింకను బాగుండెడిది. తోఁక లేకుండిన మొండిమొండిగా నేమి బాగుండును." కావున స్వామీ! సౌందర్యము తన మన స్సును బట్టియుండును. అదేవిధముగ రాక్షసులకుఁ దమ రూపమే బాగుండును. హిడింబ మానవస్త్రీ రూపమును ధరిం చినది. తన కొఱకుకాదు, కేవలము భీమసేనుని సంతోషము

కొఱకు. ఇంకొక విషయ మేమనఁగా నసురులే మానవ రూపము మాయచే ధరించెదరు. మాయానిర్మితవస్తువు చాల కాలమువఱకు నిలువఁజాలదు. శ్రీకృష్ణుని సమ్ముఖమునకు శాల్వుఁడు మాయచే వసుదేవుని శిరస్సును ఖండించుకొని తెచ్చెను. అల్పకాలముననే అది విలీనమై పోయెను. కావున మాయారూపము చాలకాలమువఱకు నిలువఁజాలదు. ఎవఁడైన రాక్షసుఁడు మనుష్యరూపమును ధరించి చిరుతిండ్లు, పక్వాలు, ఫలపుష్పములు మొదలగునవి తిని జీవించుచుండిన నది రాక్షస సమాజమందు నిందనీయమగుచున్నది.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! నీవు చెప్పినది నిజమే. ఏవస్తువుమీఁద మమకార ముండెనో దానియందు స్వాభావిక మగు నాసక్తి కలుగును. నీవు చచ్చి మనుష్యుఁడవై, చక్కని రుచిగల పదార్థములను దినుమని ఒక పందికిఁజెప్పినచో నది తన శూకరశరీరమును నిందనీయమగుఁదన యాహారమును త్యజించుట కెన్నటికిని సిద్ధపడదు. తాము రచించిన కవితఅందఱకును రుచికరమగునట్లును, అందఱకును దన వర్ణదేహము సుందరముగను, ప్రియముగను నుండునట్లును దన స్వాభావిక శరీరము తనకు బాగుండును. సరియే, పాండవులు మరలనెప్పుడైనను ఘటోత్కచునివలన నేమైనను బనిఁ జేయించుకొని నారా? ఎన్నడైన నాతనిఁ బిలిచిరా? లేదా?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఎప్పుడైన నేదైన బరువును మోయవలసి వచ్చినపుడును, ఘోరాటమువచ్చినపుడును పాండవులు ఘటోత్కచుని స్మరించెడివారు వనవాస సమయమునఁ బాండవులు బదరీ వనయాత్రనొనర్చునప్పుడు, అత్యంత సుకుమారియగు ద్రౌపది హిమపూర్ణములగు పర్వత శిఖరములందధిరోహింపఁ జాలక మూర్ఛపడి క్రిందఁబడిపోయెను. దీనికి నకులసహదేవులును, ధర్మరాజును విలపించు చుండిరి. అప్పుడు భీమసేనుఁడిట్లనెను:- "మీరింతయధీరులరయ్యెదరేల? మిమ్ములనందఱను నేను భుజములమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని వెళ్లఁగలను. మీరుకోరునెడల ఘటోత్కచునిఁబిలిచెదను. అతఁడు మిమ్ములనందఱను దన వీపుమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని తీసికొని పోఁగలఁడు"

ధర్మరాజిట్లనెను:- "సోదరా! ఘటోత్కచునే పిలువుము. ఇట్టిసమయమున నాతఁడే పనికిరాఁగలఁడు."

ధర్మరాజుయొక్క ఆజ్ఞరాఁగానే భీమసేనుఁడు హిడింబానందనుఁడగు ఘటోత్కచుని స్మరించెను. కామరూపుఁడగు నారాక్షసుఁడు తన రాక్షస సహచరుల నందఱను వెంటఁబెట్టుకొని వాయువేగమున నచ్చటకు వచ్చెను. అతఁడందఱ పాదములకు నమస్కరించి తల్లిదండ్రులకు నమస్కరించి చేతులను జోడించుకొని యిట్లడిగెను:- "తండ్రీ! మీరు నన్నేలస్మరించితిరి."

భీమసేనుఁడిట్లనెను:- "వత్సా! నీ యీ తల్లిచాల అలసి పోయినది. ఈమెను నీభుజములపైఁ గూర్చుండఁబెట్టుకొని తీసుకొని పొమ్ము. మేమందఱమును బాదచార్లమై వచ్చెదము. కాని యీమె మంచుగడ్డలమీఁదఁ బాదచారియై నడువఁజాలదు."

ఇదివిని ఘటోత్కచుఁడిట్లనెను:- "తండ్రీ! నే నొంటరిగానే బ్రాహ్మణులందఱితోఁ గూడ, మిమ్ముల నందఱను వీపుపైఁగూర్చుండబెట్టుకొని ఆకాశమున కెగురఁగలను. పైఁగా నిప్పుడునా వెంటఁ జాలమందిరాక్షసులు కలరు. అమ్మను నే నెత్తుకొందును. మీరందఱును నీ రాక్షసుల భుజములమీఁదఁ గూర్చుండుఁడు."

దీనివలన నందఱకానందమయ్యెను. సోదరులందఱును, ధౌమ్యాది విప్రగణమును రాక్షసులపైననెక్కి గంధమాదన పర్వతశోభను దిలకించుచు బదరీ నగరమునకుఁ బోయెను. అచ్చట భగవానుఁడగు నరనారాయణుల దర్శించి అందఱును బ్రముదితులైరి బదరీవనమునకుఁజేరి, పాండవులు రాక్షసుల తోఁగూడిన ఘటోత్కచునాశీర్వదించి పంపివైచిరి. నేఁటికిని గొప్పబలవంతులగు పర్వతీయులు బదరీయాత్రామార్గమునఁ గండీలలో జనులను మోసికొని పోవుచుండినవారు ఘటోత్కచునివంశీయులుగఁ దోచుచుందురు. ఈ విధముగ హిడింబానందనుఁడగు ఘటోత్కచుఁడు పాండవులను మృత్యుముఖము నుండి కాపాడెను.

రెండవసారి ఆతఁడు తన శరీరమునర్పించి అర్జునుని రక్షించెను. కర్ణుఁడు దేవేంద్రునిఁ బ్రసన్నుఁ జేసికొని యెట్టిస్థితియందు వ్యర్థము కానిశక్తి నొకదానిని సంపాదించెను. దానినాతఁ డర్జునుని వధకొఱకై యుంచెను. భగవానుఁడగు కృష్ణచంద్రుఁడు దానిని ఘటోత్కచునిపై వేయించి వ్యర్థము కావించెను. దీనిచే ఘటోత్కచుఁడు మరణించెను. కాని వీరాగ్రగణ్యుఁడగు నర్జునుఁడు రక్షింపఁబడెను. అది అర్జునునిపై వేయఁబడి యుండినచో నిశ్చయముగనాతనికి మృత్యువు సంభవించెడిదే. మహాభారత యుద్ధముయొక్క ఫక్కియే మారిపోయెడిదే. కాని యెట్లుమారిపోఁగలదు? అన్నిటినిఁ జేయించు వాఁడీదివఱకే సమస్తము నేర్పఱచియుండెను.”

సూతుఁడిట్లనెను:- “మునులారా! ఈవిధముగ భీమ నందనుఁడును హిడింబా పుత్రుఁడునగు ఘటోత్కచుని కథా వృత్తాంతమును నేను మీకుఁ జెప్పితిని. ఇప్పుడు నేనర్జునుని పుత్రుల కథావృత్తాంతమును గూర్చిమీకు జెప్పెదను.”



# అర్జునుని అన్యసుతులు

(౨౯౩)

శ్లో॥ కరేణుమత్యాం నకులో నిరమిత్రం తథార్జునః।
ఇరావంతములూప్యాం వై సుతాయాం బభ్రువాహనమ్॥
మణిపూరపతేః సోఽపి తత్పుత్రః పుత్రికా సుతః॥

శ్రీభాగ ౯ స్కం. ౨౨ అ ౩౨ శ్లో.

వ. సహదేవునికి విజయయందు సుహోత్రుండును, నకులునకు రేణుమతియందు నిరమిత్రుండును, నర్జునకు నులూపి యను నాగకన్యకయందు నిలావంతుడును, మణిపూరపతిపుత్రి యయిన చిత్రాంగదయందు బభ్రువాహనుండు (జనించిరి)

శ్రీమదాంధ్రభాగవతము

పుత్రుఁడు తండ్రికనురూపముగ నుండును. వీర్యము యొక్కయు, కులముయొక్కయు, సంస్కారముల యొక్కయు ప్రభావము బాలకునిపై బడును. ధర్మతత్త్వము నెఱిగిన మనీషులు, పుత్రునిఁ దండ్రికాత్మగాఁ జెప్పిరి. పుత్రుఁడు తండ్రి కనురూపుఁడు కాకున్నచో దానిలో సంస్కార, అదృష్టముల యొక్కయుఁ దల్లియొక్కయు దోషముండును. కులాగతమగు సదాచారమును బాలించుచు నే పుత్రుఁడు ధర్మముతో నుండునో, ఆవీర్యజపుత్రుఁడే శ్రేష్ఠుఁడును, దండ్రికనురూపుఁ డునగును.

సూతుఁడిట్లనెను:– "మునులారా! నేనిప్పుడు మీకు సంక్షేపముగ నర్జునపుత్రులకథను జెప్పెదను, వినుఁడు. వనవాసమునకు విదేశవాసమని అర్థము. అనఁగా నాతఁడు తన నగరమును విడి పృథివీపర్యటన మొనర్పవలయును. ఒకదినమున యుధిష్ఠిరుఁడుండగాఁ దన ధనస్సును గైకొనుటకై ద్రౌపది యున్నచోటునకుఁబోయెను. ఆతఁడు బ్రాహ్మణుల గోవులను దస్యులనుండి విడిపించి, ఆతఁడిట్లనెను:– "నేను నియమానుసారముగఁ బండ్రెండు సంవత్సరములు బ్రహ్మచర్యవ్రతపాలన మొనర్చుచుఁ దీర్థభ్రమణ మొనర్పవలయును"

ఇది విని ధర్మరాజిట్లనెను:– "సోదరా! ఏమియును ఫరవాలేదు. నీవావశ్యక కార్యమునకై వెడలితివి. ఆపద్వేళత్తులందు నియమోల్లంఘనము జరుగుచునేయుండును. దానిలో దోషములేదు. ఒకవేళయున్నను నేను క్షమించుచున్నాను, నీవు వనవాసము చేయుసంకల్పమును వీడుము."

ఇదివిని అర్జునుఁడిట్లనెను: "దేవా! ధర్మమునందు దంభమొనర్చుట దోషము. మనము స్వార్థవశమున మన ప్రతిజ్ఞకు వేఱర్థమును జేయుట మోసము, ప్రవంచనము కాఁగలదు. కావున నియమములందు శైథిల్యము రాఁగూడదు. శిథిలత రాఁగానే నియమము చెడిపోవును. కావున నేను నియమానుసారముగ ద్వాదశవర్షములు ఇంద్రప్రస్థమును వీడవలసియుండును."

కుంతీనందనుఁడగు నర్జునుఁడు పట్టుఁబట్టఁగా ధర్మరాజ నుమతించెను. చాలమంది సేవకులును, వేదజ్ఞులగు బ్రాహ్మణులను వెంటఁబెట్టుకొని అర్జునుఁడు ప్రథమమున నుత్తరఖండమునకుఁబోయెను. గంగాతీరమునను్న నగర గ్రామములను గాంచుచు నాతఁడు కుశావర్త తీర్థమునకు వచ్చెను అచ్చటనే భాగీరథి తనతండ్రియగు హిమాలయము నడినుండి దిగి పృథివిపైఁగాలిడును. అతఁడు గంగాద్వారము. హరద్వారము, హరిద్వారము, కుశావర్త క్షేత్రమని ఒక్కదానికే యందురు. ఆస్థానముయొక్క రమణీయతను, ప్రకృతిశోభను గాంచి అర్జునుఁడు పరమ ప్రముదితుఁడై, అచ్చటఁగొన్ని దినములుండెను. ఒకదినమున నాతఁడు గంగా స్నానమొనర్చుచుండఁగా నచ్చటకుఁ గౌరవ్యుఁడను నాగునికన్యక ఉలూపి వచ్చెను. ఆమె దేవకన్యక. అత్యంత సుందరయువతి. కుమారి. ఇంద్రతనయుఁడగు నర్జునునిఁగాంచి ఆమె ఆతనియందాసక్తినిఁజెందెను ఆమె పాతాళమున నివసించునది. ఆమె జలమార్గముననే పాతాళమునకు వచ్చి పోవుచుండెడిది. అర్జునుఁడు నీటిలో మునుఁగఁగానే ఆమె అర్జుననిఁపట్టుకొని పాతాళలోకమునకుఁబోయెను. అర్జునుఁడు భయపడువాఁడు కాఁడు అచ్చటి మణిమయ భవనములను, అత్యంత ప్రకాశయుక్తములగుః జాలగ బహుమూల్య మణులనుగాంచి అతఁడు విస్ఫారిత నేత్రములతో నాశ్చర్యముతో నటు నిటుఁజూచుచు నాతఁడు విస్ఫారిత నేత్రములతో నాశ్చర్యముగ నటు నిటుఁజూచుచుండెను.

ఆతఁడులూపితో నిట్లనెను:- "దేవీ! నీవు నన్నిచ్చటి కేలఁ దెచ్చితివి?"

ఉలూపియిట్లనెను:- "నరనాథా! నేనైరావతనాగవంశ మందుద్భవించిన గౌరవ్యుఁడను నాగుని ప్రియపుత్రికను. నేను నిన్ను వివాహమొనర్చుకొనఁ దలఁచుచున్నాను."

అర్జునుఁడిట్లనెను:- "దేవీ! నాగులుపదేవతలు. వారికి మనుష్యులతో సంబంధమెట్లు కుదురఁగలదు?"

ఉలూపి యిట్లనెను:- "దేవా! నీవు మనుష్యుఁడని యెవరందురు? నీవుసాక్షాత్తుగ నరావతారుఁడవు. దేవేంద్రుని వీర్యమువనీవు కుంతియందుద్భవించితివి. నీవు దేవకన్యలకుఁ బతివి కావచ్చును."

అర్జునుఁడిట్లనెను.- "నేను నా సోదరునికడ ద్వాదశవర్ష బ్రహ్మచర్యవ్రతపాలన మొనర్పఁ బ్రతిజ్ఞగొని వచ్చితిని"

ఉలూపియిట్లనెను:-"మహారాజా! పరపత్నీ సంగమ మొనర్చుటచే బ్రహ్మచర్యవ్రతలోపము కలుగును. నన్ను నీవు ధర్మపత్నిగఁ జేసికొనుము. విధ్యుక్తముగ శాస్త్రీయవిధిచే వివాహమొనర్చుకొనుము. దీనివలన నీ వ్రతమును జెడదు, నా ప్రాణములును నిలుచును. నేను నీతో సత్యశపథ మొనర్చు చున్నాను. నీవు నన్నుస్వీకరింపకున్నచో నేను ప్రాణత్యాగ మొనర్చెదను. ఆత్మహత్యనొనర్చుకొందును. మీ నియమము కేవలము మీ భార్యయగు ద్రౌపది యెడలనే."

అర్జునుఁడిట్లనెను:-"మంచిది, అదేయగుచో మేళములు మ్రోగె, మండపమేర్పడె, అగ్ని వెలిఁగె, కొంగుకట్టుకొని తిరిగితిమి."

అర్జునుని యనుమతినిఁ బొందఁగానే వివాహ సామగ్రులన్నియు సిద్ధమయ్యెను. నాగులు అర్జునునకు ఉలూపి నొసంగి వివాహమొనర్చిరి. ఒకదినముమూత్రి మచ్చటనుండి, తననూతన వధువును గైకొని అర్జునుఁడు తనస్థానమగు నారద్వారమునకు వచ్చెను. అచ్చట నాతఁడు చాల దినముల వఱకు ఉలూపితోనుండెను. ఆమెకొక పుత్రుఁడు పుట్టఁగానే తల్లి పిల్లవానిని నామె పుట్టినింటికిఁబంపి, ఆనందముతో నర్జునుఁడు ముందునకుఁబోయెను. ఉత్తర తీర్థములన్నిటిని సేవించి ఆతఁడు తూర్పుతీర్థములను సేవింపఁబోయెను. నైమిశారణ్యము, బ్రహ్మావర్తము, ప్రయాగ, కాశీ, అంగ, వంగ, కళింగదేశములలోని తీర్థములను సేవించుచు మణిపురమునకుఁ జేరుకొనెను ఆదినములలో నచ్చట చిత్రవాహనుఁడను రాజు రాజ్య మొనర్చుచుండెను. అర్జునుఁడచ్చటి వన పర్వతములందును, సరోవర తటములందుఁ గూర్చుండెను. అచ్చట నాతని గణగణధ్వని వినఁబడెను. ఆతఁడు వెనుకకుఁ దిరిగి చూడఁగాఁ జాలమంది యువతులు వచ్చుచుండిరి. వారికి ముందొక మంచిరూపవతియగు యువతి యుండెను. అట్లు ముందు వచ్చుచున్న యువతి యొక్క అంగ ప్రత్యంగముల

నుండి సౌందర్యము వెల్లివిరియు నట్లుండుటను గాంచెను. ప్రశ్నించి తెలిసికొనఁగా నామె మణిపురాధీశుఁడగు చిత్రవాహనుని పరమ సుకుమారియగు నేకైకపుత్రికయని యర్జునుఁడు తెలిసికొనెను. ఇంకను నామెకు వివాహము కాలేదు.

అర్జునుఁడు రాజపుత్రుఁడు, కులీనుఁడు, వీరుఁడు, సుందరుఁడు, నిర్భయుఁడు. ఆతనిమనస్సున నా సుకుమారి నెలకొనెను. ఆతఁడు నిర్భయుఁడై చిత్రవాహన మహారాజు సమీపమునకుఁబోయి యిట్లనెను:-"రాజా! నేను రాజపుత్రుఁడను. క్షత్రియుఁడను."

రాజిట్లనెను:- "కుమారా! నీవే రాజునకుఁ గుమారుఁడవు"

అర్జునుఁడిట్లనెను.- "మహారాజా! నేను హస్తినాపురాధిపతియగు శంతనుని ప్రపౌత్రుఁడను. విచిత్రవీర్యుని పౌత్రుఁడను, పాండుమహారాజుయొక్క తృతీయపుత్రుఁడను. ధర్మరాజ వృకోదరులు నాకన్నలు. నకుల సహదేవులు నాతమ్ములు మీయొక్క వస్తువును యాచింప వచ్చితిని."

రాజిట్లనెను:- "కుమారా! ఈరాజ్యమంతయును నీదియే. నీవు పాండురాజున కెట్లు పుత్రుఁడవో నాకునునట్లే. చెప్పుము. నీకేవస్తువు కావలయును?"

అర్జునుఁడిట్లనెనుః- "మహారాజా! నేను మీపుత్త్రికను వివాహమాడఁ గోరుచున్నాను."

ఆనందమును బ్రకటించుచు రాజిట్లనెనుః- "నాయదృష్టము. నీవంటి కులీనుఁడును, సదాచారియు, విశ్వవిజయుఁడు నగు వీరుఁడు నాపుత్త్రికకెట్లు లభింపఁగలఁడు? కాని నాదొక కులాగత మగు ప్రతిజ్ఞ గలదు. దానిని నీవు పాలింపవలయును"

అర్జునుఁడదియేమి యనెను.

రాజిట్లనెనుః- "ఈసంబంధమున నొక యితిహాసము కలదు. నాపూర్వపురుషులలోఁ బ్రభంజనుఁడను రాజొకఁడుండెను. ఆతనికి సంతానమేమియును లేకుండెను. పుత్త్రప్రాప్తికొఱకాతఁడు శివునారాధించెను. ఆశుతోషుఁడగు భూతనాథుఁడు ప్రసన్నుఁడై యిట్లనెను.- "రాజా! నీకేకాదు, నీవంశమున నింకనెవరికైనను సంతాన మొక్కటియే కలుగును." అప్పటినుండి మా వంశమున నొక్కొక్క పుత్త్రుఁడు కలుగుచుండెను. నాకు పుత్త్రుఁడుపుట్టక పుత్త్రికపుట్టెను. అందువలన నే నీమెకుఁబుత్త్రికా ధర్మమున వివాహ మొనర్పఁదలఁచుచున్నాను.

అర్జునుఁడిట్లడిగెనుః- "పుత్త్రికా ధర్మమననేమి?"

రాజిట్లనెనుః- "ఏపిల్లకు సోదరులులేరో, ఆమెను వస్త్రభూషణాదులతో నలంకరించి వరునికొసంగి తండ్రి యిట్లన

వలయును:- "నేనీ భ్రాతృహీనయగు కన్యను నీ కొసంగు చున్నాను. ఈమెకుఁబుట్టిన పుత్రుఁడు నా పుత్రుఁడు కాఁగలఁడు" ఈవిధముగఁ బ్రతిజ నొనర్చి కన్యనిచ్చిన యెడల దానినిఁ బుత్రికాధర్మమందురు. నా పుత్రికకుఁబుట్టిన పుత్రుని నేను దీసికొనెదను, ఇదియే యీమెకు శుల్కము. నీవిట్టి ప్రతిజ్ఞనొనర్చినచో నదినాకును నాకుమార్తెకును నదృష్టము."

అర్జునుఁడు దీనికంగీకరించెను. రాజు గొప్ప ఉత్సవమును గావించెను. రాజ్యమంతటను నానందోత్సవ మొనర్పఁబడెను చిత్రాంగద కర్జునునితో విధ్యుక్తమగుఁబాణిగ్రహణ సంస్కారము జరిగెను. అర్జునుఁడు తనరాజ్యమును వీడి ఇంత దూరమువచ్చుటెక్కడ? ఇంకొకరాజ్యము లభించుటెక్కడ? చిత్రాంగద దేవతుల్యుఁడును, పరమ పరాక్రమవంతుఁడునగు పతినిబొంది పరమ ప్రముదితయయ్యెను. ఆమె సర్వాత్మ భావముతో నర్జునుని సేవించుచుండెను. అర్జునుఁడు తన నూతన శ్వసుర గృహమున మూఁడు సంవత్సరములుండెను. చిత్రాంగదాగర్భమున నొక పుత్రుఁడుదయించెను అప్పుడాపుత్రుని పుత్రునితల్లినివదలి దక్షిణ యాత్రకుఁబోయెను. అర్జునుని యొక్క ఆ పుత్రునిపేరు బభ్రువాహనుఁడు. చిత్రవాహనుఁడాతనినే యువరాజుగాఁ బ్రకటించెను. క్రమ క్రమముగా బభ్రువాహనుఁడు వృద్ధి పొందుచుండెను.

మహాభారత యుద్ధము ప్రారంభ మైనప్పుడు బభ్రు వాహనుఁడు అన్నదమ్ములకు యుద్ధము జరుగుచున్న సంగతిని వినఁగానే ఆతఁడు తనతల్లితో నిట్లనెను:– "అమ్మా! నేనును యుద్ధమునకుఁ బోయెదను."

తల్లియిట్లనెను:– "పోయిరా! నాయనా! క్షత్రియధర్మ మిదియే."

బభ్రువాహనుఁ డిట్లడిగెను:– "అమ్మా! నేనే పక్షమునఁ బోరాడవలెను."

చిత్రాంగద యిట్లనుకొనెను:–" పాండవ లైదుగురు. కౌరవులు నూఱుగురు. కౌరవులకు పదునొకండక్షౌహిణీల సేన కలదు. పాండవుల కేడక్షౌహిణీల సేనకలదు. కావునఁ బాండవులకోటమి కలుగవచ్చును. కావున నాయనా! ఓటమి యెచ్చట కలుగునను ననుమానముండునో అచ్చటి నుండి నీవు పోరవలయును."

బభ్రువాహనుఁడు తల్లిగర్భమునందే సమస్తాస్త్రశస్త్రములను నేర్చియుండెను ఆతఁడు తనతండ్రియగు నర్జునుని కంటె బలవంతుఁడును, ధనుర్వేద విశారదుఁడునై యుండెను. ఆతఁడు క్రోధించి, హుంకరించి కురుక్షేత్రమునకు వచ్చెను. ఆ సమయమునఁ గౌరవులకోటమి కలుగుచుండెను. ఆతఁడు కౌరవుల పక్షమునకేపోయెను.

పాండవపక్షపాతియును, బరమ కౌతుకియును, సుప్రసిద్ధమగు మోసగాడును నగు శ్రీకృష్ణుఁడిట్లనుకొనెను:– "ఈ వీరుఁడు కౌరవపక్షమున నున్నచోఁ బాండవులెవరును వీనిని జయింపఁజాలరు. అనియాతఁడు వృద్ధబ్రాహ్మణ రూపమును ధరించి బభ్రువాహనుని కడకువచ్చి యిట్లనెను:– "కుమారా! నీవెచ్చటకుఁ బోవుచున్నావు?"

బభ్రువాహనుఁడు వృద్ధబ్రాహ్మణునకుఁ బ్రణామమును గావించి యిట్లనెను:–"స్వామీ! నేను మహాభారత యుద్ధమునఁ బోరఁబోవుచున్నాను."

భగవానుఁడిట్లనెను:–"నీవే పక్షమునఁ బోరాడెదవు?"

బభ్రువాహనుఁడిట్లనెను:– "స్వామీ! ఏ వైపునఁ బరాజయము ముకలుగుచున్నదో ఆ వైపునఁబోరెదను."

భగవానుఁడిట్లనెను:–"నీవర్జునుని పుత్రుఁడవై పాండవుల పక్షమున నేలఁబోరాడవు?"

బభ్రువాహనుఁడిట్లనెను:– "స్వామీ! నా తల్లి యాజ్ఞయిది. నాకుమాతృవచనమే పరమ ప్రమాణము"

భగవానుఁడిట్లనుకొనెను:– "వీఁడు కపటమునఁగాని జయింపఁ బడఁడు." ఇట్లనుకొని ఆతఁడిట్లనెను:– "నీవుగొప్ప శూరవీరునివలెఁ గనఁబడుచున్నావు. కాని యెంతటి దాతవో మేము తెలిసికొనవలయును. నేను నిన్నుయాచించెదను."

బభ్రువాహనుఁడిట్లనెను:- "అడుగుఁడు స్వామీ! నా సర్వ మును బ్రాహ్మణుల కొఱకే.

భగవానుఁడిట్లనెను:- "ముందు నీవీరత్వమును జూడ వలసియున్నది. తరువాత యాచించెదను, సరియే. శ్రీకృష్ణుఁడీ సమయమున నెచ్చటనున్నాఁడో చెప్పుము."

ఇదివిని బభ్రువాహనుఁడొక బాణమును గొట్టెను. బాణము మూఁడు లోకములందును దిరిగి; పాతాళమును జించుకొని శ్రీకృష్ణుని చరణములకడకు వచ్చిపడెను.

భగవానుఁడిట్లనెను:- "నీవు చాల గొప్ప వీరుఁడవే. సరియే. దాతృత్వమెట్టిదో చూడవలయును. నేనడిగిన దీయఁగలవా?"

బభ్రువాహనుఁడిట్లనెను:- "సరియే, నీవేది యడిగినదాని నొసంగెదను."

భగవానుఁడిట్లనెను:-" నాకు నీశిరస్సును నొసంగఁ గలవా?"

బభ్రువాహనుఁడిట్లనెను:- "మీరేది యడిగిన దానినొ సంగెదను."

భగవానుఁడిట్లనెను.- "నేను నీశిరస్సునడిగినని చ్చెదవా

బభ్రువాహనుఁ డిట్లనెను:- "స్వామీ! నీవు నన్ను మోసగించుచున్నావు. శిరస్సు నొసంగుటలో నాకభ్యంతరము లేదు; కాని నాకు రెండు కోరికలు నిలిచిపోయినవి."

భగవానుఁడిట్లడిగెను "అదేమి?"

ఆతఁడిట్లనెను:— "ఒకటియుద్ధము చేయవలయుననియు, రెండవది వివాహ మొనర్చుకొనవలయుననియుఁ గలదు."

భగవానుఁడిట్లనెను.— "మంచిది, నీశిరస్సు తెగిపోయినను నీవు పూర్తిగా యుద్ధమును గాంచఁ గలుగుదువు. నీ వివాహము మాఅందఱ వివాహములతో జరుపఁబడును."

ఇట్లుపలికి భగవానుఁడాతని శిరమును ఖండించి ఒక శమీవృక్షమునకు వ్రేలాడఁదీసెను. తల తెగినను నాతఁడెచ్చటఁబరాజయమును గాంచిన నటుహుంకారము నొనర్చును. ఆ హుంకారముచే సేనలు యోజనముల కొలఁది వెనుకకు తొలఁగును. అప్పటినుండి వివాహమున నొక హుండిని మూఁతినిమూసి, అది బభ్రువాహనుని శిరమని భావించి, వరుని మామ వెంటఁగొని పోవుచుండును. వివాహము కాఁగానే దానిని శమీవృక్షమునకు వ్రేలాడఁగట్టుదురు. ఇది ఉత్తర దేశమునఁ గల ఆచారము. ఆతని శిరస్సును శ్రీకృష్ణుఁడు మహాభారత మందు ఖండించెనని ఒకానొక కల్పములోని కథ కలదు."

ఇంకొక కథయిది—బభ్రువాహనుఁడు మహాభారత యుద్ధమునకుఁ బోనేపోలేదు. యుద్ధమైన తరువాతఁబాండవులు దిగ్విజయమునకు వెడలినపుడు, దానిలో నాతఁడు తన తండ్రియగు నర్జుమునితోఁ బోరినాఁడు."

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! బభ్రువాహనుఁడు తనతండ్రితో యుద్ధమునేల నొనర్చెను? దయతో నీ వృత్తాంతమును నీవు మాకుఁజెప్పవలయును."

సూతుఁడిట్లనెను:- "స్వామీ! మా గురువగు వ్యాసభగవానుఁడు మహాభారతమందీ కథను వర్ణించినాఁడు. జైమిని అశ్వమేధ పర్వమందును దీనిని విస్తారముగ వర్ణించెను. ఈ కథను నేనత్యంత సంక్షేపముగ మీకుఁజెప్పెదను."

మహాభారతయుద్ధమైన తరువాత ధర్మరాజగు యుధిష్ఠిరుఁడు అశ్వమేధ యజ్ఞము నొనర్చెను. దానికొక యశ్వమునువిడిచెను, దేశవిదేశములందు భ్రమణ మొనర్చుచు నా యజ్ఞాశ్వము మణిపురమునకుఁ జేరుకొనెను. అచ్చటి రాజు అర్జుననందనుఁడగు బభ్రువాహనుఁడు తన తల్లివలనఁ దనతండ్రి దిగ్విజయమొనర్చుటకై అశ్వరక్షణ మొనర్చుచుఁదన రాజధానికి వెళ్ళుచున్నాఁడని వినఁగానే ఆతఁడు స్వాగతమొసంగుటకుఁజాల సామగ్రిఁ దీసికొని తండ్రి సమీపమునకుఁ బోయెను. బభ్రువాహనుఁడు తన వెంటఁజాలగ ధన, రత్న, భూషణ, వస్త్రాలంకార వాహనాది నానా విధములగు వస్తువులనుపహారముగఁ దీసికొనివచ్చెను. తండ్రి సమీపమునకుఁ బోయి, ఆతఁడాతని పాదపద్మములకుఁ బ్రణామము కావించి, తెచ్చిన వస్తువులన్నిటిని సమర్పించి చేతులనుజోడించుకొని

యిట్లనెను:- "తండ్రీ నేను మీ కనుగతుఁడను. నాకు యోగ్యమగు సేవయేదైన నుండిన నాకుఁ జెప్పుఁడు."

తనపుత్రుని యొక్క యీవ్యవహారమున నర్జునునకు సంతోషము కలుగలేదు. అతఁడు క్రుద్ధుఁడై యిట్లనెను:- "నీయీవ్యవహారమువలన నీవు నావీర్యమునఁ బుట్టిన పుత్రుఁడని తోఁచుట లేదు"

ఇదివిని బభ్రువాహనుని కన్నులు క్రోధముచే నెఱ్ఱనయ్యెను. ఆతఁడు తనక్రోధము నాపుకొనుచు నిట్లనెను:- "ఏమి? పుత్రుఁడు తండ్రిని సత్కరింపఁగూడదా?"

ధీర గంభీరస్వరమున నర్జునుఁడిట్లనెను:- "అవశ్యము చేయవచ్చును. తండ్రి నాదరించుట పుత్రునకుఁ బరమధర్మము కాని యీనీవ్యవహారము నేను నిశ్శస్త్రుఁడనై నిన్నుఁ దండ్రిగాఁ గలిసికొనినప్పుడు శోభించును. ఇప్పుడు నేను ధర్మరాజునకుఁ బ్రతినిధినై యుద్ధేచ్ఛచే సమస్తరాజులను యుద్ధమునకుఁ గవ్వించుచుఁ దిరుగుచున్నాను. నిర్బలులైనవారు వచ్చి నాకుఁ గానుకల నొసంగుచుందురు. దీనతతో నాకధీనులయ్యెదరు. వీరాభిమానులగువారు నాతో యుద్ధమొనర్చెదరు. నీవు క్షత్రియ వీర్యమున నుద్భవించియు నొకదిగ్విజయి యగు రాజుయొక్క సేనాపతి సమ్ముఖమున యుద్ధమొనర్పకయే తలవంచితివి. ఈవ్యవహారము క్షత్రియోచితముగ లేదు."

బభ్రువాహనునకుఁ దనపొరపాటు తెలిసెను. ఆతఁడు వెంటనే తిరిగి తల్లి కడకుఁబోయి యిట్లనెను:- "అమ్మా! నేనీ రాజుయొక్క అశ్వమును బట్టుకొందును. ఈతనితో యుద్ధమొనర్చెదను."

చిత్రాంగద యిట్లనెను:-"వత్సా! ఆతఁడు నీకుదండ్రి. తండ్రి తోఁబుత్రుఁడు. యుద్ధమొనర్చుట మంచిదికాదు."

బభ్రువాహనుఁడిట్లనెను:- "అమ్మా! ఈతఁడు నన్నుఁ దిరస్కరించినాఁడు ఇప్పుడు నేను విననుకు."

తల్లియును, కుమారుఁడును నిట్లు మాట్లాడుకొను నంతలో నాగరాజకన్య ఉలూపి అచ్చటకువచ్చెను. ఆ సుందరినిఁగాంచి హఠాత్తుగ బభ్రువాహనుఁడు స్తంభితుఁ డయ్యెను. ఆతఁడిట్లనెను:- "దేవీ! నీవెవరు? ఎవరికొఱకు నీ విచ్చటికి వచ్చితివి?"

ఉలూపి యిట్లనెను:- "వత్సా! నేను నీకుతల్లిని. నీవు గర్విష్ఠుఁడగు నీతండ్రితో యుద్ధమవశ్యమొనర్పుము. భగ వానుఁడు నీకు మేలొనర్పఁగలఁడు. వీరాభిమానియగు నీ జనకుని గర్వమును నీవుయుద్ధమున నుగ్గు నుగ్గొనర్పుము."

ఇదివిని బభ్రువాహనుఁ డత్యంత ప్రసన్నుఁ డయ్యెను. ఆతఁడిట్లనెను:-" అమ్మా! నేను నీయాజ్ఞనవశ్యము పాలించె

దను. తండ్రి యుద్ధముచేఁ బ్రసన్నుఁడగుచో నే నాతనితో యుద్ధమొనర్చెదను ఈతని యుద్ధమునఁ బరాజితు నొనర్చెదను.,,

ఇట్లుపలికి వీరాభిమానియగు బభ్రువాహనుఁడు వెంటనే తన సువర్ణకవచమును ధరించి రణభూమికేఁబోయెను. ఆతఁడు తన సేవకులతో నిట్లనెను:- "ఈ గుఱ్ఱమును బట్టుకొనుఁడు. ఈ సైనికుల నందఱను గొట్టి తరుముఁడు.'' సేవకులట్లే యొన ర్చిరి. అర్జునుని యజ్ఞాశ్వమును బట్టుకొనెను. ఇదివిని అర్జు నుఁడు మిక్కిలి హర్షితుఁడై బభ్రువాహనుతోఁ బోరసచ్చెను. తండ్రికుమారులకు ఘోరసంగ్రామము జరిగెను. ఇద్దరును నస్త్రశస్త్రము లెఱింగినవారు. ఇద్దరును యుద్ధమున వెను కడుగువేసెడువారుకారు. ఇద్దరును బ్రాణములనుబణముగఁబెట్టి పోరాడుచుండిరి. అర్జునుఁడు బాణములనుగొట్టి బభ్రువాహ నుని గాయపఱచెను ఇచ్చటబభ్రువాహనుఁడును దనశక్తికొలఁది పోరుచుండెను. చివరకొక యమోఘ బాణమును నర్జునుని ఱొమ్మునకు వైచికొట్టఁగాఁ నది తగులఁగానే ఆతఁడు మూర్ఛి తుఁడైరథమునుండి క్రిందఁబడి ప్రాణములు కడిచెను.

తండ్రి బాణములచేఁ బుత్రుఁడీదివఱకే జర్జరితుఁడ య్యెను. బాణములనుగొట్టి మూర్ఛితుఁడై భూమిపైఁ బడి పోయెను. తన పతియును బుత్రుఁడును మరణించుటనుగాంచి చిత్రాంగద యేడ్చుచు సమరభూమికి వచ్చి, తనపతియొక్క-

మృతదేహమును ఒడిలోఁబెట్టుకొని బిగ్గఱగ నేడ్చుచుండెను. ఆమె వివిధవిధములఁ గరుణావాక్యములను బలుకుచు విలాప మొనర్పసాగెను. ఉలూపియు నచ్చటికివచ్చెను. ఆమెకుఁ జెప్పుచుఁ జిత్రాంగద యిట్లనెను:- "అక్కా! నీవే నాపుత్రుని శత్రుజితుఁ గావింపఁగా నాపతి నేలఁ బోరఁబోయినాఁడు. నాకు పుత్రుఁడు చచ్చినాఁడను జింత పతిపోయినంత చింతగా లేదు. నేనీ కురుకులతిలకుఁడు జీవింపక నుండఁజాలను. కావున నేనును ప్రాణత్యాగమొనర్చెదను." అని పలికి చిత్రాంగద ప్రాణ పరిత్యాగ మొనర్ప నుద్యుక్తయయ్యెను.

ఇంతలోనే బభ్రువాహనునకు మూర్ఛ తెలిసెను తన తండ్రిచచ్చుటయును, దన తల్లి విలపించుటయును గాంచి యాతఁడును దుఃఖింపసాగెను. అప్పుడులూపి అందఱకును ధైర్యము చెప్పుచు నిట్లనెను:- "మీ రెవ్వరును జింతింపకుఁడు. నేనిదియంతయును బతిహితము కొఱకే యొనర్చితిని." అని పలికి ఆమె సంజీవని మణినర్జునుని హృదయమున నుంచెను. ఆమణినిఁ బెట్టఁగనే అర్జునుఁడు నిద్రించి లేచినవాని వలెఁ గన్నులను నులుముకొనుచు, లేచి నిలుచుండి చిత్రాంగద, ఉలూపియను నిద్దరు భార్యలను రణభూమియందుండుటను గాంచి అందఱును వ్యాకులురై యుండుటనుగాంచి వారికిఁ గారణమడిగెను. అంత జిత్రాంగద యిట్లనెను: "ప్రాణనాథా! మీరు ఉలూపిని దీనికి కారణమడుగుఁడు."

అర్జునుఁడులూపినడుగఁగా నామె యిట్లనెను:- "దేవా! మీరన్యాయముగ శిఖండిని ముందుఁబెట్టుకొని అధర్మముగ భీష్మునిఁ జంపుటచే గంగాసహితముగ వసువులు నీ మృత్యువు నీకొడుకుద్వారానే కలుగునని శపించిరి."

ఈ శాపమునెవరును వినలేరు. కేవలము నేనే వింటిని. దీనిచే నేను జాలభయమును జెందితిని. నేను నా తండ్రితో నంతయును జెప్పితిని. ఆతఁడు వసువులకడకుఁబోయి వారి నను నయ వినయములచే సేవింపఁగా నా తండ్రియొక్క విన్నతిని విని వారిట్లనిరి:-"అర్జునుని మృత్యువు తప్పక ఆతని తనయుని చేసంభవింపఁగలదు; కాని మరల నాతఁడు సంజీవనీ మణి ద్వారా జీవితుఁడు కాఁగలఁడు. ఈ మృత్యువు చే నాతని పాపమునకుఁ బ్రాయశ్చిత్తము కాఁగలదు" ఆతనికి పాప ప్రాయశ్చిత్తము జరుగుటకై నేను బభ్రువాహనుని యుద్ధము నకుఁబురిగొల్పితిని. ప్రాణనాథా! పుత్రుని వలనఁబరాజయ మును బొందుటలో నే దోషమునులేదు; ఏలననఁగాఁబుత్రుఁ డాతని కాత్మయే దీనివలన మీ పాపమునకుఁ బ్రాయశ్చిత మైనది, కాకున్న మీకు నరకము సంభవించెడిదేఁ వసువుల శాపము చేతనే బభ్రువాహనుఁడు మిమ్ముఁ జంపఁగలిగెను. కాకున్న మిమ్ము దేవతలందఱు గలిసివచ్చినను జయింపఁజా లరు. మీరు సాక్షాత్తుగ నరావతారులరు నేను జేసినదంతయు నుమీహితము కొఱకు ప్రేమ వశముననే చేసితిని."

ఇదివిని యర్జునుఁడు పరమ ప్రసన్నుఁ డయ్యెను. ఆతఁడు తనపుత్రునిఁ బ్రేమతో నాలింగనము కావించుకొని, యాతని శిరస్సును మూర్కొనెను. అప్పుడు చేతులను జోడించుకొని బభ్రువాహనుఁ డిట్లనెను:- "తండ్రీ! మీరు నాయెడల బ్రసన్నులరైనచో నొకదినము మా రాజభవనమున విశ్రాంతి నొనర్చుకొని రేపు ప్రాతఃకాలమునఁ బోవచ్చును."

అంత నత్యంత ప్రేమతో నర్జునుఁడిట్లనెను:- "వత్సా! నేను స్వతంత్రుఁడనుగాను అశ్వమును బట్టి పరతంత్రుఁడను. అశ్వగతి స్వతంత్రమైనది. దానినాపుట ఉచితము కాదు. నీవు నీయిద్దరు తల్లులను దీసికొని ధర్మరాజు అశ్వమేధము నకు రావలయును."

ఇదివిని బభ్రువాహనుఁడు మరలనిఁక బలవంత మొనర్ప లేదు తలనువంచి ఆతఁడిట్లనెను:- "తండ్రీ! నేను యజ్ఞము నకుఁదప్పక వచ్చెదను." ఇదివిని అర్జునుఁడు సంతోషించి అశ్వమునకు వెనువెనుకనే పోసాగెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! బభ్రువాహనుఁడు తనయిద్దరు తల్లులను దీసికొని రణరంగమునుండి గృహమునకుఁ బోయెను అంతనాతఁడు యజ్ఞసమయము రాఁగానే యిద్దరు తల్లులను దీసికొని హస్తినాపురమునకు వచ్చెను. అందఱును బభ్రువాహనునకు గొప్పగా స్వాగతసత్కారములను గావిం

చిరి. బభ్రువాహనుఁడు తన నాయనమ్మ యొక్కయు గురు జనులయొక్కయు పాదములకు నమస్కారము లొనర్చి యజ్ఞములోని సమస్త కార్యముల నొనర్చెను. ఈవిధముగ నేను బభ్రువాహను ఇరావంతులను నిద్దరపుత్రులను గూర్చి వర్ణించితిని. ఇప్పుడాతని తృతీయ పుత్రుఁడగు నభిమన్యునియొక్కయు ఆతని వంశజులయొక్కయు కథలను జెప్పెదనువినుఁడు."

—(౦)—

# అర్జునసుతుఁ డభిమన్యుఁడును నాతని వంశజులును.

(౭౯౪)

శ్లో॥ పరీక్షీణేషు కురుషు ద్రౌణేర్బ్రహ్మాస్త్ర తేజసా!
త్వంచ కృష్ణాను భావేన సజీవో మోచితోఽన్తకాత్॥
తవేమే తనయాస్తాత జనమేజయ పూర్వకాః!
శ్రుతసేనో భీమసేన ఉగ్రసేనశ్చ వీర్యవాన్॥

శ్రీభాగ. ౯ స్కం, ౨౨ అ ౩౪-౩౫ శ్లో.

కం॥ ద్రోణసుతు కూవు వేఁడిమి
బ్రాణంబులఁబాసి హరికృపాదర్శన సం
త్రాణంబున బ్రతికితె కా
క్షోణీశ్వర! మున్ను నీశిశుత్వము వేళన్॥

వ. నీ కుమారులు జనమేజయ శ్రుతసేన భీమసేనోగ్ర సేను
లను నల్వురు.

శ్రీమదాంధ్రభాగవతము

చాలమంది పుత్రులుద్భవింప వలయుననియు, వారిలో నొక్కఁడైన భగవద్భక్తుఁడుగాని, వీరుఁడుగాని, వంశోద్ధార కుఁడుగాని కావలయునని శాస్త్రకారుల కథనము కిరీ యుఁడు సమరమునకుఁ బోయినచో మరల జీవితుఁడై వచ్చునను

నాశ లేదు. ఆతఁడు చేతిలో శిరమును బెట్టుకొని, శిరస్సునఁ దలపాఁగాఁజుట్టుకొని సమరమునకుఁ బోవును. అందువలన వీర క్షత్రియుఁడు తన వీరపుత్రునకు సదా మంగళమును గాంక్షించుచుండును. ఆతఁడు పుత్రవంతుఁడైనచో నత్యంతానందమును జెందుచుండును.

సూతుఁడిట్లనెను:—"మునులారా! ద్రౌపది, ఉలూపి, చిత్రాంగదలే కాక భగవానుఁడగు శ్రీకృష్ణుని చెల్లెలగు సుభద్రయను నామెయు నర్జునునకు భార్యయైయుండెను. వనవాస సమయమున నీతని దృష్టి సుభద్రపైఁబడెను. బలరాముఁడును, నితర యాదవులును విరోధించినను శ్రీకృష్ణుఁడర్జునునకు సుభద్రను హరించి తీసికొనిపొమ్మని సలహా నొసంగెను. భగవానుఁడీ విషయమున నాతనికి సహాయమొసంగెను. తన రథమును గూడనొసంగెను. అర్జునుఁడు సుభద్రను హరించికొనిపోయెను. ఆమె గర్భమునుండియే మహావీరుఁడగు నభిమన్యుఁడుదయించినాఁడు."

ఇదివిని శౌనకుఁడిట్లడిగెను:— "సూతా! నీవు కోతలం కోయుచున్నావిప్పుడు. సుభద్రాహరణము, అభిమన్యు జన్మములవంటి సుందర సరసకథలను నీవు రెండు ముక్కలలో ముగించుచున్నావు. చెప్పుము, భగవద్భక్తుల కథలందింతటి తొందఱనేల నొనర్చుచున్నావు?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! నేను సుభద్రాహరణ లీలను విస్తారముగ శ్రీకృష్ణచరిత్ర ప్రసంగముననే జెప్పెదను. స్వామీ! సుభద్రాహరణమునందర్జునుని వీరతా ప్రాధాన్యత యేదియును లేదు. అందులో భగవానుని భక్త వత్సలతా మహిమము కలదు. భగవానుఁడెంతటి భక్త వత్సలుఁడనఁగా తన సాతేఁడు యనుచరులయొక్క అత్యంతాల్పములగు కోరిక లను నెఱవేర్చుటయే కాదు. ఆ కార్యములందాతఁడు తాను స్వయముగ సహకారమొనర్చును. వీరికీ చరిత్రము నిచ్చట వినుటయే యిష్టమగుచోఁ జెప్పెదను నేనిప్పుడే చెప్పెదను"

ఇదివిని శౌనకుఁడిట్లనెను:- "సూతా! ఇదంతయు నీ యిష్టముపై నున్నది."

సూతుఁడిట్లనెను:- "స్వామీ! అది అచ్చటనే ఉపయుక్తముగనుండును. ఇచ్చటఁ గేవలము కథాప్రసంగము నొక సూత్రమున గుచ్చుటకై నేను గేవలము పరంపరంగాఁ జెప్పెదను. సుభద్రా గర్భమున వీరాగ్రగణ్యుండగు నభిమన్యుఁ డుదయించెను. ఈతఁడు గర్భమున నున్నప్పుడే అర్జునుఁడీతని మాతను శస్త్ర శస్త్రముల సంబంధమును గూర్చి మాట లాడెడువాఁడు. ఆ విషయములను విని గర్భమందే యీతఁడు సమస్తాస్త్ర శస్త్రములను నేర్చెను. పాండవులు పండ్రెండు సంవత్సరములు వనవాససమయమున విరాట్రాజుకడ నొక సంవత్సరమజ్ఞాతవాసమున నున్నప్పుడర్జునుఁడాతని పుత్రికయగు

నుత్తరకు నృత్యగాన శిక్షణమొసంగు చుండెడువాఁడు. చివర కాతని పుత్రికను దనపుత్రుఁడగు సుభద్రా నందనుఁడగు నభిమన్యునకిచ్చి అర్జునుఁడు వివాహము కావించెను. ఉత్తర గర్భవతిగనుండఁగా నభిమన్యుఁడు చాలమంది మహారథులచే మహాభారతయుద్ధమునఁ జంపఁబడెను. దుర్యోధనునకు బావ మఱఁదియగు జయద్రథుఁడు బాలకుఁడగు నభిమన్యుని వధింపఁగా వానిని సవ్యసాచియగు నర్జునుఁడు శ్రీకృష్ణుసహాయమున సూర్యాస్తమానమునకుఁ బూర్వమే చంపివైచెను.

మహాభారతయుద్ధము సమాప్తమైన తరువాతఁ బాండవ కులమును సమూలముగ నాశముచేయుటకై అశ్వత్థామ ద్రౌపదియొక్క యైదుగురు పుత్రులశిరములను ఖండించెను. పంచ పాండవులను జంపుటకైదు బాణములను విడచెను. ఉత్తరా గర్భమునుగూడ నాశమొనర్చుటకై అతఁడొక బ్రహ్మాస్త్రమును విడిచెను; కాని భగవత్కృపచేఁ బంచపాండవులును రక్షింపఁ బడిరి. ఉత్తరాగర్భస్థబాలకునిఁ గూడ నేమియుఁ జేయఁజాలక పోయెను. ఆ గర్భస్థబాలకుఁడే పరీక్షిన్మహారాజు. అతఁడే శుకమహర్షివలన శ్రీమద్భాగవతకథను గంగాతటమున—శుక దేవాశ్రమమున వినెను. ఆ పరీక్షిన్మహారాజు మహిమము నెవరు గానమొనర్పఁగలరు?"

పరీక్షిన్మహారాజునకు నల్గురు పుత్రులుదయించిరి. జనమేజయుఁడు, శ్రుతసేనుఁడు, భీమసేనుఁడు, ఉగ్రసేనుఁడు.

జనమేజయ మహారాజు గొప్ప ధర్మాత్ముఁడు. ఈతఁడే సమస్త పురాణములను, మహాభారతమును విని దీనిని పృథివియందు విశేషముగఁ బ్రచారప్రసార మొనర్చెను. పుణ్యశ్లోకుఁడగు జనమేజయునికీర్తి సూర్యచంద్రులున్నంత వరకుండును. ఈతఁడనేక యశ్వమేధయజ్ఞముల నొనర్చెను. కావషేయ గోత్రియుఁడగు తురుఁడను ఋషివరునిఁదన పురోహితునిఁగ నొనర్చుకొని యజ్ఞములద్వారా భగవంతుని యజించెను. పృథివియందంతటను దనయేకఛత్రి రాజ్యమును స్థాపించుకొనెను. ఈజనమేజయమహారాజు పుత్త్రుఁడగు శతానీకునిస్వామీ! మీారెఱుఁగుదురు. మీావలన నాతఁడాత్మజ్ఞానోపదేశమును బొందినాఁడు. ఈతఁడు ధనుర్వేద విశారదుఁడయ్యెను. కృపాచార్యుని వలన నాతఁడస్త్రవిద్యను. యాజ్ఞవల్క్యుని వలన వేదత్రయిని, క్రియాజ్ఞానమును అనఁగా భక్తిశాస్త్రమును నధ్యయనము కావించెను. ఈ శతానీకుని పుత్త్రుఁడే సహస్రానీకుఁడు. సహస్రానీకున కశ్వమేధజుఁడును, అతని కసీమకృష్ణుఁడును, అసీమపుత్త్రునకు నేమిచక్రుఁడను బుత్త్రుఁడుండెను. నేమిచక్రుఁడే హస్తినాపురమునకు చివరరాజు. పూర్వము హస్తినాపురమునకు కొలఁది దూరములోనే నేమిచక్రిమహారాజుసమయమున గంగా ప్రవాహము హస్తినాపురమ్మునక్కు క్రిందకు వచ్చెను. ఒకసారి వరదవచ్చెను. హస్తినాపురమంతయును గొట్టుకొనిపోయెను. అప్పుడు మహారాజా నగరమును వదలి ప్రయాగకు సమీాపమునకు వచ్చి కౌశాంబి యను

నగరమున సుఖపూర్వకముగ నివసించుచుండెను. కౌశాంబినే యాతఁడు తనరాజధానిగాఁ జేసికొనెను.

నేమచక్రునకు బుత్రుఁడు చిత్రరథుఁడు. ఆతనికిఁ గవిరథుఁడు కవిరథునకు వృష్టిమతుఁడు, వృష్టిమంతునకు సుషేణుఁడు. సుషేణునకు సునిథుఁడు, ఆతనికి నృచక్షువు, నృచక్షువునకు సుఖీనలుఁడు సుతుఁడయ్యెను.

అంతశౌనకుఁడిట్లనెను:- "ఈవంశములే చెప్పెదవా? లేక యేదైన జెప్పెదవా? వీనికి వాఁడుకలిగెను. వానికి వీఁడు కలిగెనని చెప్పుదువా? లేక ఏమైన కథను సాగించెదవా?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! వేదమందు నేదో విధముగఁ గన్నులను మూసికొని విశ్వాసబలమునఁ ద్రాగినట్లు, మీరును నీ వంశానుచరితమును వినుఁడు. వైద్యుఁడిది మంచి మందని చెప్పినచో మనమాతని మాటమీఁద విశ్వాసముంచి, యిష్టముండినను లేకుండినను జేదుమందును శ్వాసనాపుకొని త్రాగివేయుదుము. అట్లే యీ చంద్రవంశ వంశావళిని మీరు వినుచుండుఁడు. ఇంకఁగొంచెముగనే యున్నది. మన ముఖ్యోద్దేశ్యము యదువంశ వర్ణనము. అందులోను యదుకుల భూషణుఁడును, యదునందనుఁడునగు, శ్రీకృష్ణచంద్రుని చారుచరితను వినవల్లయును. కావున నిప్పుడు పురువంశమును గూర్చి సంక్షేపముగఁజెప్పి, నామమాత్రముగనను ద్రుహ్యు, తుర్వసు వంశజరాజ చరితములను గూర్చివర్ణించి, యదువంశ కథను గూర్చిచెప్పెదను;"

అంత శౌనకుఁడిట్లనెను:— "మంచిది, సూతా! వంశావళినిగూర్చి యింకఁ జెప్పుము. సుశీనలుని పుత్రుఁడెవఁడు?"

సూతుఁడిట్లనెను:— "స్వామీ! సుశీనలుని పుత్రుఁడు కురిష్లవుఁడు. ఆతనికి సునయుఁడు. సునయునకు మేధావి, మేధావికి నృపంజయుఁడు, ఆతనికి దూర్వుఁడు దూర్వునకు తిమి తిమికి బృహద్రథుఁడు. బృహద్రథునకు సుదాసుఁడు, సుదాసునకు శతానీకుఁడు. శతానీకునకు దుర్దమనుఁడు. ఆతనికి వహీనరుఁడు. వహీనరునకు దండపాణి, దండపాణికి నిమి,నిమి పుత్రుఁడు క్షేమకుఁడు, ఈ క్షేమకుఁడే చంద్రవంశపు రాజులలోని బృహత్క్షత్రుని వంశములో చివరవాఁడు. కలియుగమున క్షేమకుని అనంతరమీవంశము సమాప్తము కాఁగలదు. ఈ పురువంశము దేవతలచేతను, ఋషులచేతను సత్కృతమైనది."

అంత శౌనకుఁడిట్లడిగెను:—"సూతా! చంద్రవంశజులిప్పటికిని చాలమంది కలరుకదా! నీవు క్షేమకుని తోడనే యీ వంశమంతమగు ననుచున్నావే."

అంత సూతుఁడిట్లనెను:—"స్వామీ! బీజమేవస్తువునకు నాశముకాదు. సూర్యవంశపురాజగు మరువును; చంద్రవంశపు రాజగు దేవాపియును నిప్పటికిని యోగసమాధి యందు కూర్చుండి బదరీనాథమునకు పైన నలక్షిత భావముతోఁదపమొనర్చుచున్నాఁడు. కలియుగాంతమైన తరువాత వీరు మరల సూర్యచంద్ర వంశములను స్థాపించెదరు. రాఁబోవు యుగము

లందు మరు' దేవాపుల సంతానములే సూర్య చంద్రవంశము లుగ నెన్నఁబడును. దీనినిఁబట్టి యీ యిద్దరురాజుల యనంత రము కలియుగము వచ్చినట్లూహింపవలసి వచ్చుచున్నది. వంశ ములందంత విశుద్ధత లేదు. అయినను సూర్యవంశపు మహా రాజగు సుమిత్రుఁడును, చంద్రవంశపు రాజగు క్షేమకుని వఱకు కలియుగమందును నీవంశపరంపర యేదోవిధముగ నవిచ్ఛిన్నము నగు శుద్ధముగను నున్నదని తోఁచుచున్నది. ఈ రోజుల తరు వాతఁగలియుగ ప్రభావముచే విశుద్ధ వంశపరంపర నిలువలేదు. మ్లేచ్ఛులు వచ్చువఱకును క్షత్రియకులమున్నను, వారు క్రమ క్రమముగా క్షత్రియధర్మమునుండి చ్యుతులైరి. వారు ప్రజా పాలనమునకును, ధర్మయుద్ధమునకును విముఖులైరి. ఇప్పుడు నామమాత్ర క్షత్రియులే యుండిరి. ఇప్పుడు కత్తియెవరిదో వారిదే బత్తె అయినది. వంశపరంపర లుప్తప్రాయమైనది. యుగప్రభావముచే జనులకు ధర్మము నెడల నరుచి కలిగినది. వర్ణాశ్రమధర్మములు నష్టప్రాయములైనవి. కులగతమగు మర్యా ద ఛిన్న భిన్నమైనది. భగవంతుఁడేది చేసినను మనమేలునకే చేయును. ఆతఁడు చెఱుపును మదిదరిఁజేరనీయఁడు. ధర్మ మాతని హృదయము నందును, నధర్మమాతని వీపువలనను బుట్టినది. కృతయుగమున ధర్మము నాలుగుపాళ్ళు. త్రేతా యుగమున మూఁడుపాళ్ళు ధర్మము. ఒకపాలు అధర్మము. ధర్మము తన ఆధిపత్యమును సాగించుకొనును. ద్వాపరయుగ మున సగముధర్మము, సగమధర్మము. కలియుగమున ధర్మము

నిర్మూలముగనుండును. బలము ధర్మమునశించును. నాలుగు పాదములుగల ధర్మమునకు మూఁడుపాదములు విఱిగిపోవును. కృతయుగమున ధర్మమేకఛత్రాధిపత్యము నెట్లు వహించినదో కలియుగమున నధర్మమట్లై ఘోరముగనున్నది. కావున ఈ కలియుగమును వృద్ధిఁబొందించుటకై విశుద్ధవంశములన్నియును భిన్న భిన్నములగును. ఆ కులీనులగు వర్ణసంకరులు దస్యుధర్మముననే వారికిష్టమువచ్చినట్లు కలియుగమునఁబుట్టి కాపింతెదరు. దానిశక్తిని వృద్ధిఁబొందింతురు. కాలము అన్నిటినిఁ జేయింపఁగలదు! కాలరూపుఁడగు భగవానుఁడే అంతయు సమయానుసారముగ మార్పుఁజెందించును. కావున స్వామీ! ఇప్పుడు భూమిమీఁదకుఁ గలియుగము వచ్చిపడినది. బ్రహ్మరాక్షసులు స్త్రీల గర్భములనుండి మనుష్యరూపమున నుద్భవించి కలియుగ ప్రవృత్తమును బ్రచారమొనరించుచున్నారు. ఈ విధముగ నేను హస్తి మహారాజు తండ్రియగు బృహత్క్షత్రుని వంశమును గూర్చి వర్ణించితిని. ఇప్పుడుమీరు బృహద్రథుని అవశిష్టరాజుల నామములను గూర్చి వినుఁడు.

ఇదివఱలో నేను మగధరాజగు బృహద్రథ సుతుఁడగు జరాసంధుని జన్మమువఱకు వర్ణించియుంటెని. జరాసంధుని శ్రీకృష్ణుని సహాయమున భీమసేనుఁడు ద్వంద్వ యుద్ధమున మధ్యకుఁ జీల్చివైచెను. ఈ కథను నేను ముందు చెప్పెదను. అతనికి సహదేవుఁడు పుత్రుఁడు. భగవదాజ్ఞచేఁదన తండ్రివలన

బంధితులైన రాజులను సత్కారపూర్వకముగ వస్త్ర భూషణములచే నలంకృత మొనర్చి తమ తమ నగరములకుఁ బంపి వైచెను. సహదేవపుత్రుఁడు మార్జారి. ఆతనికి శ్రుతశ్రవుఁడు శ్రుతశ్రవునకు యుతాయువు ఆతనికి నరమిత్రుఁడను సువ్రిసిద్ధభూపతి పుట్టెను. నరమిత్రుని పుత్రుఁడు సునక్షత్రుఁడు. ఆతనికి బృహత్సేనుఁడు. బృహత్సేనునికి గర్మజిత్తు. కర్మజిత్తునకు సృతజయుఁడు. ఆతనికి సుతుఁడు శుచి శుచికి క్షేముఁడు, ఆతనికి సువ్రతుఁడు. సువ్రతునివలన ధర్మసూత్రుఁడు, ధర్మసూత్రుని వలన శముఁడు. శమునకు ద్యుమత్సేనుఁడు, ద్యుమత్సేనునకు సుమతి, సుమతి సుతుఁడు సుబలుఁడు. సుబలునిపుత్రుఁడు సునీథుఁడు, సునీథునకు సత్యజిత్తు, సత్యజిత్తునకు విశ్వజిత్తు. ఆతనికి రిపుంజయుఁడు. జరాసంధుని తరువాత మహాభారత యుద్ధమైన తరువాత మగధవంశమందు వేయి సంవత్సరములలో నీ యిరువదిద్దరు రాజులెరి. రిపుంజయుని యనంతరము మగధ రాజ్యము ఛిన్నభిన్నమైనది. బీహారునందిప్పటికిని గిరివ్రజ (రాజగిరి) మను స్థానము కలదు. అచ్చటనుండి ఉష్ణజలస్రోత వెలువడుచున్నది. ఇది మిక్కిలి రమణీయకముగను, స్వాస్థ్యప్రదమగు స్థానము; కాని యిప్పుడావంశము కేవలము కథా మాత్రముగ మిగిలినది. కరాళకాలము సమస్తమును దన విశాలగర్భమున దాచుకొనినది.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈ విధముగ నేను యయాతిమహారాజుయొక్క కనిష్ఠపుత్రుఁడగు పురువంశమును గూర్చి అత్యంత సంక్షేపముగ వర్ణించెను. ఇప్పుడు మీరు నావలన నేమి విన గోరుచున్నారు?"

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! యయాతి మహారాజునకు శుక్రతనయ యగు దేవయానియును, వృషపర్వుని ప్రియపుత్రికయగు శర్మిష్ఠయును నిద్దరు పత్నులుండిరనియు వారిలో దేవయాని గర్భమున యదు, తుర్వసులను నిద్దరు పుత్రులును, శర్మిష్ఠగర్భమున ద్రుహ్యు, అను, పురులను ముగ్గురుపుత్రులును నవ్మించిరని నీవిదివఱకే చెప్పియున్నావు. నీవు శర్మిష్ఠయొక్క చిన్నకుమారుఁడగు పురుని వంశమునే వర్ణించితివి ఇప్పుడు మేము యయాతి మహారాజు యొక్క మిగిలిన నల్గురుపుత్రుల వంశముల వర్ణనమును వినఁగోరుచున్నాము.

సూతుఁడిట్లనెను:- "స్వామీ! నేను వీరందఱను గూర్చి విస్తారముగ వర్ణింపఁబూనినచో నీకథ సమాప్తముకాదు! శ్రీకృష్ణచరిత్రమునకు నవకాశము లభింపదు కావున నేను పురుమహారాజుయొక్క సోదరుల వంశములను నత్యంత సంక్షేపముగ వర్ణించెదను. అందఱికంటె ముందుగా మీరు శర్మిష్ఠ ద్వితీయ పుత్రుఁడగు అనువంశమును గూర్చి వర్ణించెదను ఈవంశమునఁజాలమంది ప్రసిద్ధులగు రాజులుండెదరు. వారి గూర్చి నేను వర్ణించెదను."

—[0]—